# నాటకములు.

| | | | |
|---|---|---|---|
| నర్మదా పురుకుత్సీయము. | ... | ... | 0—12—0 |
| సారంగధర చరిత్రము. | ... | ... | 0—6—0 |
| ప్రచండ చాణక్యము | ... | ... | 0—12—0 |
| కోకిల. ... | ... | ... | ... | 0—12—0 |
| శ్రీహరినారాయణ చరిత్రము. | ... | ... | 0—12—0 |
| పాదుకా పట్టాభిషేకము. | ... | ... | 0—12—0 |
| వనవాస రాఘవము. | ... | ... | 0—12—0 |
| బుధబోధసుధ. ... | ... | ... | 1—0—0 |
| విజయరాఘవము. ... | ... | ... | 1—0— |
| రాధాకృష్ణ. ... | ... | ... | 0—6—0 |
| వృద్ధవివాహము. ... | ... | ... | 0—8—0 |
| మనోమహిమము. ... | ... | ... | 0—4—0 |
| ప్రహ్లాద. ... | ... | ... | 1—0—0 |
| గులేబకావలి. ... | ... | ... | 0—8— |

# నావెల్సు.

| | | | |
|---|---|---|---|
| మాధవీకంకణము. ... | ... | ... | 1—8— |
| శైవలినీచంద్రశేఖరము. | ... | ... | 0—12— |
| శుక్తిమతి. ... | ... | ... | 0—12— |
| రాధారాణి. ... | ... | ... | 0—4— |

# వచనకావ్యములు.

| | | | |
|---|---|---|---|
| మధ్వాచార్య. ... | ... | ... | 0—8— |
| వరాన్వేషణము. ... | ... | ... | 0—2— |
| వీరేశలింగ కవిచరిత్రము.. | ... | ... | 1—0— |

అమ్ముటకు సిద్ధముగా నున్నవి. 

దొరకుచోటు: వలయువారు,

డి. వి. రమణారావు అండ్ కో.

తెనాలి, కృష్ణాజిల్లా.

శ్రీ

# వనవాసరాఘవము.

[ ఆఱంకముల నాటకము. ]

ఇది

ప్రచండ చాణక్యము; నర్మదాపురుకుత్సీయము
మొదలగు నాటకములు రచించిన,


## పానుగంటి - లక్ష్మీనరసింహారావుగారిచే


రచియింపఁబడి,




ఇదియు

శ్రీ సౌదామినీ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి

ప్రకటింపఁబడెను.

1909





కాపీరైటు]     మొదటికూర్పు 1000 ప్రతులు.     [రిజిష్టర్డు.

వెల 0—12—0.

# పీఠిక

శ్రీమద్రామాయణము నంతయు నాటకరూపముగ వ్రాయవలయు నని యెంచి, యయోధ్యాకాండములోనిగాథను బట్టభంగరాఘవ మను పేరిటను, యుద్ధకాండములోనిగాథను విజయరాఘవమను పేరిటను, రెండునాటకముల వ్రాసి యచ్చొత్తించితిని. ఇప్పు డారణ్యకిష్కింధ సుందరకాండములలోనిగాథను సంగ్రహించి వనవాసరాఘవ మను పేరిటినాటకమును వ్రాసితిని. దీనిని 1908 సంవత్సరము సెప్టెంబరు 26 తేదిని నారంభించి, నవంబరు 19 తేదీని ముగించితిని—

ఈగ్రంథమునుగూడ మహారాజరాజశ్రీ శ్రీ రాజా రావు వేంకటకుమారమహీపతిసూర్యారావు బహద్దరు రాజా ఆఫ్ పిఠాపురం వారి ద్రవ్యసాహాయ్యమువననే యచ్చు వేయించితిని. విద్యానిధులు, విద్యాభిమానులు, పండితపోషకులు, ధర్మకార్యనిరతు లగువీరు దీర్ఘాయురారోగ్యైశ్వర్యాభివృద్ధుల శ్రీపరమేశ్వరకటాక్షముచే నొందుదురుగాక!!

ఈనాటకమునకుఁ గూడ నాందీప్రస్తావనలు వ్రాసి నన్ను సంతసపెట్టిన నామిత్రు లగు మ॥ రా॥ శ్రీ॥ కూచినరసింహముగారి కనేకనమస్కారము లాచరింతును.

పిఠాపురం.
6-2-1910.

పానుగంటి లక్ష్మీనరసింహారావు.

## ఈనాటకమునందు వచ్చుపాత్రలు.



### పురుషులు.



1 శ్రీరాముడు—కథానాయకుడు.

2 లక్ష్మణుడు—

3 అకంపనుడు }
4 ధూమ్రాక్షుడు } రాక్షసులు.

5 రావణుడు—రాక్షసరాజు.

6 కబంధుడు—రాక్షసుడు.

7 శరభుడు }
8 అంశుమాలి } వానరులు.

9 ఆంజనేయుడు—సుగ్రీవునిమంత్రి.

10 సుగ్రీవుడు—వానరరాజు.

### స్త్రీలు.



1 సీత—కథానాయిక.

2 శూర్పణఖ—రావణునిచెల్లెలు.

3 తార—వాలిభార్య.

4 త్రిజట—రాక్షసస్త్రీ.

&c. &c. &c.

పా—నాకోఁడ్పాటు గావలసినయీనాటక మెద్దియో చెప్పుఁడు.

సూ—ఁవనవాసరాఘవ, మను నొకనాటకరాజము. కర్త ప్రసిద్ధకవియైన పానుగంటి లక్ష్మీనరసింహారావు. ఇది యాతనియష్టమోత్కృష్టనాటకము. శ్రీమద్రామాయణకథాగ్రథిత మగుటచేఁ బరమపావన మైనగ్రంథము.

పా—చిత్తము. మీకు సదాసహచారి నగు నేను మీయాజ్ఞకు బద్ధుఁడను. ప్రసిద్ధకథయగుటచేఁ బాత్రలఁ జెప్ప నక్కఱ లేదు. కాలవిలంబము లేకుండ సన్నిపాత్రల నాయత్తము చేసెదను. కాని, అర్యా! ఒకందుఁ కించుక సిగ్గగుచున్నది.

గీ. మీసములు దీసి మోముపై ♦ మేలిరంగుఁ
బూసిఱవికలు దొడిగి పూఁ ♦ బోండ్ల మగుమ
మంతయేకాని తోఁకల ♦ నమరుచుకొని
మర్కటంబులలాగున ♦ మసలు టెట్లు?

సూ—సరిసరి! ఇందులకా సందేహించు చుంటివి. ద్విపాత్త్రులము గదా, చతుష్పాత్త్రుల మెట్లగుదుమనియా!

గీ. నాల్గుపదముల భక్తవా ♦ నరులుచూడ
భక్తిరహితద్విపాత్పశు ♦ వాళికంటె
శ్రేష్ఠు లందురు కానని ♦ సిగ్గదేల
యొక్కరాతిరి క్రోఁతులై ♦ యుండుటకును.

చ. అనవరతంబుజిహ్వనగ్రి ♦ యన్హృదయంబునఁబెట్టిరామపా
వనపదదాస్యరూపములఁ ♦ బావనిభాసిలెనంద్రుసత్కవుల్
మనమునఁజింత సేయు మొక ♦ మాటతఁడోకపియంటకర్హుఁడా
తనిఁగపియించునొచువెస ♦ తర్కపుఁజిత్తమో? పారిపార్శ్వకా?

పా—దీర్ఘ వాలంబులు గలిగి లంఘనంబులు సేయువారినిఁగపులనుట, కుతర్కంబును మానవులపై వానరుల నెక్కించుట వివేకంబు నుంగాఁబోలు. నే నెఱుంగను బోనిండు.

సూ—అటుగాదు.

క. తలదిరుగుఁరోగి యనఁడే
యిల యంతయుఁ దిరుగునంచు ♦ నిప్పగిది నెపో
చలచిత్తులు సుస్థిరభ
క్తుల బాహ్యాకృతులఁ గాంచి ♦ క్రోఁతు లనుటయుఙ్.

పా—ఉపమానంబునుబట్టియా యాతని భక్తుఁడని యొప్పుకొనవలయు. సరి యట్లేకానిండు. మీమాట త్రోసివేయ నేల?

సూ—నిరుపమానభక్తుఁ డని యొప్పుకొనిననాకు మఱింతపరమానంద ము. హనుమంతుఁడు భక్తాగ్రేసరుఁ డని కదా గ్రంథంబు లు ద్ఘోషించుచున్నవి!

పా—ఆర్యా! యీ వితండవాదముతోఁ బని యేమి?

క. భక్తులరీతు లెఱుంగను
ముక్తులమాటన్న నేమొ ♦ మొదలే యెఱుఁగఙ్
శక్తికి దాఁటినవిద్వ
ద్వ్యక్తులు నాకేల చెప్పఁ ♦ డొప్పినపనులఙ్.

సూ—అట్లైనబావా! హనుమత్సుగ్రీవాంగదప్రముఖులు మహాపురు షులని నెమ్మదిం దలఁచి నాటకప్రదర్శనంబులకుఁ దొడంగుము. వారియాకారములఁ జూడకు.

ఆ. వె. ఱాతిబొమ్మఁ జూచి ♦ ఱాయియే యనియొప్ప
రికము సేసిపోవ ♦ రిత్తఫలము
దానిదైవమంచుఁ ♦ దలపోసి పూజింపఁ
బుణ్యదాయకంబు ♦ ముక్తిదంబు.

పా—ఆర్యా! యిఁక నేను బోయి సర్వ మాయత్తముచేసెదను. మన ప్రదర్శనకార్యము నిర్విఘ్నముగఁ గొనసాగున ట్లొక్కసారి యాశీర్వదింపుఁడు.

సూ—నే నన నెంతటివాఁడను? నాయాశీస్సన నెంతటిది?

సీ. భక్తులకన్నుల ♦ పండువై పుట్టిన
శ్యామలాంగుఁడు రామ ♦ చంద్రుఁ డుండ
క్షితిసుతయయ్యును ♦ క్షితిమాతయై యొప్పు
కల్యాణి జానకీ ♦ కాంత యుండఁ
దిండినిద్రయు లేక ♦ ధృతధనుర్బాణుఁడై
మించి రక్షించు సౌ ♦ మిత్రియుండ
రాక్షససంహారి ♦ రామనామము గుత్త
గొనినభక్తుఁడుఁ గాలి ♦ కొమరుఁ డుండఁ

గీ. కష్టములు గాసి విఘ్నము ♦ ల్గాని మనకు
వచ్చు టెటులయ్య? వచ్చిన ♦ విచ్చునయ్య
భాస్వరునిదీప్తి నిరుళ్లు ♦ భయ మిఁకేల
పోయిజరిగించు నాటకం ♦ బోయిబావ!

(ఇద్దఱునునిష్క్రమింతురు.)

ఇతిప్రస్తావన.

---

శ్రీ

# వనవాసరాఘవము.

## ప్రథమాంకము.

[ప్రదేశము—పంచవటి]

(ప్రవేశము—సీత, లక్ష్మణుఁడు, శ్రీరాముఁడు.)

రాము—తమ్ముఁడా! లక్ష్మణా! పుణ్యమూర్తి యగుభరతునకుఁ బాదుక లిచ్చి చిత్రకూటమును వదలి యిప్పటికి దాదాపుగఁ బదుమూఁడువత్సరము లైనవి. అనేకమునుల సేవించి రాక్షసుల గొందఱ జంపి తుదకు భగవతి యగుగోదావరితీరమును జేరి పర్ణశాల నిర్మించుకొని యిచట నుంటిమి. లక్ష్మణా!

గీ. పరమసంపూర్ణసౌఖ్యసం ♦ భరితమైన
రాజ్యసంపదఁ బాసి య ♦ రణ్యమున వ
సింపఁ గష్ట మంటివి; చూడు! ♦ సిలుఁగు లేవి?
యెచటి కచటికె సరిపోవు ♦ నెటులొ యట్లు.

సీత—మహావినయధురీణుఁడు, మనలఁ దలిదండ్రులుగఁ బరిగణించుచు నెల్లప్పుడు సర్వవిధములచేఁ బ్రమాదశూన్యుఁడై సముచితోపచారములు సేయుచుండ మనకుఁగష్టము లేమి యుండును?

రాము—జానకీ! సమస్తసద్గుణసంపన్నుఁడైనలక్ష్మణుఁడో; సేవాపచారముల గుఱ్తెఱుఁగక యట్లొనరించుట లేదు.

గీ. కష్టములు పైకి రాఁబోవఁ ♦ గడు భయంబు
హృదయ మొందును; వచ్చిన ♦ పిదప నట్టె
యడఁగి యలవాటుపడి కుదు ♦ ర్పాటును జెందు
యట్లు కాకున్న బ్రదుకసా ♦ ధ్యంబు గాదె!

గీ. సుఖపురుదయము; కష్టప్రభీతి ♦ సుఖము దుఃఖ
ము మదిఁ జేరనంతవఱకె; ♦ మోదదుఃఖ
ములకు మనసు మొదట నింత ♦ యులుకుఁ జెంది
వెంటనే తటస్థత నొందు ♦ వింతగాఁగ.

ఇట్టియవస్థలో మన మునటి మని నేను దెలియఁ జేసితిని. కాని నీవు చెప్పినట్లు పుత్త్రప్రాయుఁడై సదా మనలఁ గనిపెట్టి సేవించులక్ష్మణునియుపకారమును మఱువఁ దరమా! ఈపుణ్యరాశి మననీడవలె నుంటచేతనే మనము సర్వకష్టములకు దూరమైతిమి. ఈతనిని నేనుగాని నీవుగాని విడిచియుండునుత్తరక్షణమున మనకు మహాకష్టము లారంభ మగుట కేమిసందేహము!

లక్ష్మ—మహానుభావా! అట్లు సెలవిచ్చుచున్నా రేమి! సర్వమును ద్యజించి మీపాదపద్మములే గతి యని యెంచి మిమ్ముఁగొల్చుటకు నేను మీతో వచ్చియుండ మీరుగాని, మావదినెగారుగాని, నన్ను విడుచు టేల?

రాము—తమ్ముఁడా! నిన్ను విడుతు మని చెప్పియుండ లేదు. అట్లు సంభవించునెడల—

లక్ష్మ—సంభవించు ననుసందేహమునకుమాత్ర మేమికారణము?

రాము—నాయనా! కారణ మేమున్నది? దుష్టదినములు చేయుపరిధానాపకారము బంధువిశ్లేషమే కదా?

లక్ష్మ—అది పితృమరణమువలనను, మాతృపరిత్యాగమువలనను, మొదటనే తీఱినది కాదా?

రాము—అంతటితోఁ బూర్తి యైన మహానందమే! కాని, యరణ్యవా సపరిసమాప్తి యగువఱకు నేక్షణమున కాక్షణమే మన మట్టి సందేహములో నుండవలయును.

సీత—ఆర్యపుత్రా! అ గ్లానతిచ్చెద రేల? లక్ష్మణుని మనమెడఁబాయు దుమా?

రాము—లక్ష్మణుని నే నెడఁబాయవచ్చును. నీ వెడఁబాయవచ్చును. నిన్ను నేనెడఁబాయవచ్చును.

సీత—మహాప్రభూ! వింతమాట లాడుచుంటి రేమి?

రాము—వెఱ్ఱిదానా! వింత యేమున్నది.

గీ. వేలువేలుశోణాత్మలు ♦ వేలువేలు
తనువులును గల్గుజీవుల ♦ కు నిరుఁ గలుగు
క్షణభంగురము ప్రమాద ♦ కలన గాని
యెపుడు వేర్పడియుంట ప్ర ♦ కృతియెకాదె?

సీత—ఆఁ! ఆఁ! ఆర్యపుత్రా! మనకుఁ దనువు లాత్మలు వేఱా?
(కౌఁగిలించుకొనును.)

రాము—(నవ్వుచు) కానియెడలఁ గౌఁగిలింత యేల?
(నేపథ్యమున) సెబాస్! సెబాస్! కౌఁగిలింత తగనే తగదు.
ఓకాంతాధమా! నీ వాసుందరాంగు నంట నర్హురాలవు కావు.

సీత—(బెదరుచు) ఆఁ! అదేమి?

రాము—(నవ్వుచుఁ దలపైకెత్తుచు) భయ మేమియు లేదు.

లక్ష్మ—రామచంద్రా! ఎవ్వతెయో యొకరాక్షసస్త్రీ వికృతరూపిణి యై యిటకుఁ వచ్చుచున్నది. (ధనుస్సున బాణము సంధించి) ఆగు! ఆగు! జాగ్రత్త! మహాప్రభూ! రామభద్రా! అత్యంతదు ర్మార్గురా లగుతాటకను మీరు వధించిన ట్లీరౌద్రాకారయై,

హేయకంఠిమైమాఱ్గోఁన వచ్చుచున్నయీయసురకాంతను నే
ను హింసింతును. అనుజ్ఞ యొసఁగుఁడు.

రాము—సరే! తరువాత చూచుకొనవచ్చును. అగత్యము రానిమ్ము.
(నేపథ్యమున) ‟అగత్యము రానిమ్ము,, అని యామనోహరాకా
రుఁడు నాయాగమనమున కనుజ్ఞ యొసఁగుచుండ నీవు ఆఁగు
మని నిరోధించెద వేల? నే నాఁగను.

(శూర్పణఖ ప్రవేశించును.)

శూ—నీవు నాయెడ దయగలవాఁడవై నన్ను నీదరిఁ జేరనిచ్చితివి.
సంతోష మైనది. కాని, ధనుర్బాణముల ధరించి రోసరోసలా
డుచున్న యీతనిఁ జూడ నా కొడలు మండుకొనిపోవు చున్నది.
ఈతఁ డెవఁడు? నీ వెవఁడవు? ఇది యేమి తె?

లక్ష్మ—దుష్టప్రలాపిని! ఒడ లెఱిఁగి పూజ్యు లగువీరిఁగూర్చి గౌరవగర్భి
తము లగుమాట లాడుము.

రాము—ఆమెయిష్టానుసారమే మాట లాడనిమ్ము. అందువలనమనకు
గౌరవహాని యేమున్నది? గౌరవ మొకఁ డిచ్చినవచ్చునా? తీసి
వేసినఁ బోవునా? మన కున్నగౌరవము మనము వివవకున్నంత
వఱకేమియుఁ బ్రమాదము లేదు. కాన నీ నీమెతో మనవృ
త్తాంతమును గొంత ముచ్చటింపుము.

లక్ష్మ—(అపవారించి) మహాప్రభూ! ప్రచ్ఛన్నముగ నెట్లో దినములు
గడుపవలసియుండ మనచరిత్ర మీనోటియొట్టుపువాని చెవిఁ
బడ నేల?

రాము—ప్రచ్ఛన్నముగ దినములు గడపవలయు ననుట సరికాదు.

సీ. తండ్రియిష్టము వెంట ♦ ధారుణీపట్టంబు
నాకైన ఘన మేమి? ♦ లోక మందు

నెందటో యభిషేక ♦ మందరే? వారియూ
రేమి? పేరేమి? నా ♦ రెట్టివారో?
యెవరికిఁదెలియు? నా ♦ కీర్తులకాక ప
ట్టాభిషేకము భంగ ♦ మగుచు విపిన
వాసకష్టములు రా ♦ వసుధలో నాపేరు
జిహ్వాపై నాడని ♦ జీవుఁ డున్నె?
ఆపదల కోర్చి యిప్పుడు స ♦ త్యావనమున
వర్తిలినమన ఖ్యాతి చె ♦ ప్పంగఁ దరమె?
సుఖముతోడఁ బ్రచ్ఛన్నత ♦ సొలసె మనకుఁ
గష్టములతోడ విఖ్యాతి ♦ గలుగు నింక.
గీ. ఎన్నిగాథలు వినఁగ లే ♦ దెన్నినాట
కములు చూడంగలేదు త ♦ త్కవులు సుఖము
పడినవారిని వ్రాసిరె? ♦ ఇడుమ లన్ని
ముగియుపిమ్మట గ్రంథముల్ ♦ ముగియలేదె?
గీ. జరుగనున్న రామవనవా ♦ సంపునాట
కమున సీతాంతరాక బీ ♦ జ మగుజుమ్ము
కాన మనయుదంతంబు ని ♦ ష్కపటముగను
వ్యక్తపఱిచినఁగాని పై ♦ యంక మెట్లు?
లక్ష్మ—ఓయాసురకాంతా!
సీ. బహుయజ్ఞభంజన ♦ భైరవకర్మయౌ
తాటకఁ జంపిన ♦ మేటిమగఁడు
ఖరకంకపత్త్రవే ♦ గమున దిక్కులవెంట
మారీచు నెగచిన ♦ శూరవరుఁడు
దేవారిరణముల ♦ దేవేంద్రునకుఁ గుడి
చేయియౌ దశరథు ♦ జ్యేష్ఠసుతుఁడు

చాపశాపము లొక్క ♦ సరణియగా పరశురా
ముని భంగపఱిచిన ♦ ఘనభుజుండు
తండ్రిమాటను బాలింప ♦ దండకాఖ్య
వనికి వచ్చినగుణరాశి ♦ మునివరేణ్య
రక్షణమునకు రాక్షస ♦ రాజిఁ జంపఁ
బ్రతినవట్టినశ్రీరామ ♦ భద్రుఁ డితఁడు.

శూ——సరే.సరే! ఇఁకఁ జెప్ప నక్కఱలేదు. ఈమెయాతనిభార్య నీవు——

రాము——అసురకాంతా!

గీ. ముగురుతల్లుల కే మొట్ట ♦ మొదటివాఁడ;
ముగురుతోఁబుట్టులకు ముందుఁ ♦ బుట్టినాఁడ;
నితఁడు రెండవసోదరుఁ ♦ డితనిపేరు
లక్ష్మణుఁడు సర్వసద్గుణ ♦ లక్షణుండు.

నీవు చెప్పిన ట్లీమె నాయిల్లాలు. జనకమహారాజుపుత్త్రిక. సీత. నీ వెవరిదానవు? నీపే రేది?

శూ——మీరుబహుజనముగ నున్నారు కావున స్వనామోచ్చారణము గలుగకుండనామనిర్ణయమున నన్యోన్యసాహాయ్యమొనర్చుకొనిరి నా కట్టియవకాశ మేది? ఇవిగో చేటలవంటి నాగోళ్లను గాంచి నానామ మేదియో గ్రహించుకొనుఁడు.

రాము——ఓహో! శూర్పనఖవా! విశ్రవఃపుత్త్రుఁ డైనరావణునిసోదరివా! కాని, రాక్షసివయ్యును బూర్వమర్యాద ననుసరించినందులకు సంతసించితిని.

శూ——నేను భయంకరస్వభావనే యగుదును. పూర్వమర్యాదలను ధిక్కరించుదాననే యగుదును. కాని మహానుభావా! నిన్నుఁ జూచినదిమొదలు నా కేమో హృదయము కరఁగికొంతమానుషత్వము సిద్ధించినట్లు తోఁచుచున్నది.

సీత—ఆర్యపుత్త్రా! జగదానందకర మగుమీమూర్తిని జూచియాటవిక భయంకరశరభశార్దూలపంచాననాదిమృగములే స్వస్వభావము లం దక్కి, శాంతిని వహించి, తలలు వంచి, తోఁక లాడించి, దేహములు ముడుచుకొని, అడఁగి, మడఁగి, యొదిగి, మీయాకస్థావస్థను గుర్తెఱింగి కాఁబోలును గనుల నీరు వెట్టికొని, మిమ్ము మహావిధేయత గల సేవకులవలె ముందు నడచుచుఁ, గాపు గాయుచుండ నీక నీరాక్షసికి మిమ్ముఁ జూచి హృదయము కరఁగు టేమివింత?

రాము—సీతా! ఈకాంతయందుఁ గలిగినమార్పు కలిగినది కాదు.

సీత—మఱి యేలాగునఁ గలిగియుండును?

రాము—ఆమెనోటివెంటనే విందువుగాక!

లక్ష్మ—(తనలో) నేనుగూడఁ బొరఁబాటు పడితిని గాఁబోలు.

శూ—రామచంద్రా! తాత్కాలికముగ సిద్ధించినమానుషత్వమును నాయెడ స్థిరపఱుచుటకై నన్ను శాశ్వతముగ మనుష్యకాంతను జేయఁ బ్రార్థించుచున్నాను.

లక్ష్మ—అనఁగ? (తనలో) శృంగారభావమును స్పష్టీకరించుటయందు రాక్షసులలోనేకాదు పశువులలోఁగూడ స్త్రీవ్యక్తికి లజ్జాసాధ్వసములు సహజములుకదా!

సీత—(తనలో) జగన్మోహనాకారుఁ డగునానాథుని గాంచి యీమె వలచినది కాఁబోలు!

శూ—మహాత్మా! లోకసమ్మోహనదక్ష మగునీరూప మేమి? ఈజటావల్కలధారణ మేమి? ఘోరాటవికసంచార మేమి? కురూపయై యతిహేయదర్శన యైనయీకాంతతోడిపొత్తేమి? వయోరూపలావణ్యశీలుఁ డగుపురుషునికిఁ దగినభార్య లేకుంట సామాన్య

లోపమా! నన్నుఁగాంచియైన నిప్పుడట్టిలోపము దీర్చుకొనుట కేల ప్రయత్నింపవు?

లక్ష్మ—(తనలో) ఓసిచండాలిసీ! నీనాలుకను ఖండింపవలయును.

సీత—(తనలోనవ్వుచు) నాకు నేఁటికాలమునకు సపత్నీదర్శనమా?

రాము—

గీ. అగ్నిసాక్షిగ నేఁబెండ్లి ♦ యాడినట్టి
యీవనిత యెట్లు లున్న నీ ♦ కేమి? నాదు
కంటికి కతి దివ్యదర్శన ♦ గాఁగ నుండు;
వనిత నాకు భూషణము; లో ♦ పంబుగాదు.

సీత—(తనలో) నాథా! నీవలన నిట్లు బహుమానింపఁబడి యుప్పొంగు చున్నాను.

శూ—ఆహాహా! రామచంద్రా! ప్రాకృతునివలె నేమిమాట లాడుచు న్నావు? ఈమె నీకంటికిఁ జక్కనిదిగా నున్నదా! ఆహా! ఎంత వెఱ్ఱిపడుచున్నావు! ఆమెతలవెండ్రుక లెట్లున్నవో! నిగనిగలా డుచుఁ దుమ్మెదఱెక్కలవలె నల్లనై సోఁగలై యున్నవి కావా! అట్లుంట సౌందర్యలక్షణమేనా? మొక్కజొన్నపీచువలె నెఱ్ఱ గను బొమ్మజెముడువలె గుమురుగను గరుసుగ నుండవలయును గాదా? చూడుము! నీయిల్లాలినాసిక పైని సన్న మేమి? క్రిం దికి రాఁగఁ గ్రమముగ లావేమి? ఛీ! ఛీ! ముక్కురంధ్రములు గానఁబడకనే యున్నవి. పైనిఁ క్రింద నొకటేలావై పర్వతగు హాముఖములవలె ముక్కుఱములు పైకి స్ఫుటముగాఁ గనఁబడు టయే కాక ముక్కున సగమువఱకు వ్యాపించియుండ మఱింత ముడిసిపోవుదువు కాఁబోలు! అదిగాక నిలువుముక్కుఁ జూచి యే వలపుచే నిలువఁబడలేనివాఁడ వింక నీసతి కడ్డముక్కే యుండినయెడల నేమైయుందువో? అదేమి? ముంగికివలెఁజుంచు

నకువలె మూతి బుడ్డగించి యున్నదేమి? మొసలికి వలెఁ బెదవులేలేనేమి? పట్టిచేసి పెదవులయిన లేనియెడ నింక నేమి సౌందర్యము? ఛీఛీ! ఈపాడురూపు చూచి పట్టరానితమకమునఁ బైనఁ గ్రిందనెఱుఁగక పరవశుఁడ వైతివా? ఆహాహా! ఆనందము! పుల్ల! గాలి వేయఁ దడదడ లాడుచు, ఉష్ఫాలున నూదఁ బెళ్లున విఱుగు నట్లున్నది. ఇట్టిసడుముతో—నాకుఁ దెలియక యడుగుచున్నాను! ఏమి ప్రయోజనము? పట్టు మని భర్త పరమానురాగమునఁ గౌఁగిలించిన సక్కఱకువచ్చునా? తామసమునఁ బదితన్నులు తన్నినసక్కఱకు వచ్చునా? మనుజశరీరములు ఛీఛీ! నిరుపయోగములు. ఇంతకు నెంత యున్నది! నామూగతో మూరెఁడయినఁదలమొదలు పాదమువఱకు లేదు. పోనీ! తేలికగలమొడలు గలదిగదా! చుఱుకుఁదన మేమైన నున్నదో చూతమున నతిమందత! అడుగులో నడుగు. ఈదిక్కుమాలిన రంగేమి? వెలవెలలాడుచుఁ బసుపుకాంతులలో రక్తకాంతులు. చిలుకుచుఁ గోఁతిపిట్టమామిడిపండువలె,—ఛీఛీ!—పరమాసహ్యముగ నున్నది. నూనెపఱుఁగుఁడువలె నిగనిగలాడుచు మిలమిలలాడుచు బాడికందెనవలె నంటుకొను నేమోయనుసందియము గలిగించుచు భర్తకనులకు దివ్యాంజనమువలె నంధకారోదయము సేయుచు మోహప్రదమై యుండవలసినగాత్రవర్ణమీరీతిగా గాడిదెవాలకమైనను నీకు మొగము తిరుగకున్నది. నీబుద్ధి మారకున్నది. ఈచక్కఁదనము!—ఈయొడ్డు పొడవు—ఈరంగు—ఈరూపు—ఈలాఘవము—

**లక్ష్మి**—(అపవారించి) రామచంద్రా! ఈయసంబద్ధప్రలాపము నెంతకాలము సహింపవలయును?

రాము—(అపవారించి) అసంబద్ధప్రలాపము కాను. రాక్షసమతముచే సౌందర్య మెట్టిదో వెల్లడించుచున్నది.

గీ. తర్కగణితాదిహేతుప్ర ♦ ధానశాస్త్ర
ధర్మములుదేశకాలభే ♦ దంబులేక
సమ మగును; రెండురెండును ♦ సంధిఁజెంది
నాలు గగు సర్వకాల దే ♦ శాలయందు.

గీ. గాన, శిల్ప, సాముద్రికా ♦ కవిత, లనెడు
నభిరుచిప్రధానోరుశా ♦ స్త్రాళి నంత
తతులు దేశదేశముల విం ♦ తలగు; కాల
భేదమున మారును; మారు భే ♦ దమునను.

శూ—లక్ష్మణుఁ డేమో నీచెవిని గుసగుస లాడుచున్నాఁడు. ఆతఁడే మీాముప్పునకుఁ గారణ మగును. అతనిమాటఁ బాటింపవలదు. నేను నీకు హితమును బోధించుచున్నాను. భయంకరరూపమై చింతావహమై దుఃఖహేతువైనయీాయువ్రాగ్గురాలిని త్యజించినన్ను స్వీకరించి స్వేచ్ఛగ సర్వసౌఖ్యము ననుభవింపుము.

సీత—(తనలో) ఇఁక నేమున్నది? స్పష్టముగనే పలికినది.

లక్ష్మ—శూర్పణఖా! అనేకలావణ్యవతులు ప్రపంచమున నుండిరికాని నీయట్టిసుందరాంగిని గని విని యెఱుంగను. ఏమిసౌమ్యరూపము—ఏమి దివ్యతేజస్సు—ఏమి యలౌకికలావణ్యము—అన్నిటిని మించినయేమిగుణగణసమంజసత—

రాము—(అపవారించి) లక్ష్మణా!

గీ. పరధనాపహారణమును ♦ బరగురుత్వ
భంజనాలాపమును, బర ♦ భామురాంగి
హేళనము, పరోన్నతికీర్త్య ♦ గూడ దని వ
సిష్ఠశిష్యుఁడ వగు నీకుఁ ♦ జెప్ప నేల?

శూ—లక్ష్మణా! నీవు నాసౌందర్యప్రభావమును నిజముగా గుర్తెఱిగి నట్లగపడుచున్నావు.

లక్ష్మ—(తనలో) అకాలపువెఱ్ఱిముండ. ఇఁక నాపైఁ బడునేమో!

సీత—(తనలో) పాపము! నిష్కపటతచేఁ బ్రకాశించుచున్నది.

శూ—ఏమి రామభద్రా! ఆలస్య మేల? ఎందుల కీదీర్ఘాలోచనము శీఘ్రముగ నేదో యొకటి తెగనీయ వేమి?

లక్ష్మ—(తనలో) ఏదో యొకటి కాదు. ఒకముక్కు—రెండు చెవులు—ఇదిగో! ఖడ్గము. సిద్ధముగనే యున్నాను.

రాము—శూర్పణఖా! నే నేకపత్నీవ్రతప్రతిష్ఠఁ గలవాఁడను. నన్ను క్షమింపుము.

శూ—ఇదే వెఱ్ఱి! ఇదే తలతిక్క! ఇదే చాదసత! ఏకపత్నీవ్రత మని యి దెక్కడిధర్మమో! పురుషుల కేకపత్నీదీక్ష యేమి? అందు లో మహారాజుల కేకపత్నీవ్రత మేమి? దేహదార్ఢ్యము గలిగి-స్వచ్ఛందత గలిగి—భోగేచ్ఛ గలిగి—మనసున కుత్సాహము గలిగి—సౌందర్యసంగ్రహణము గలిగి—పురుషత్వము గలిగి—క్షణక్షణనూతనవనితావినోదామోదవైభవాపేక్ష గలిగి-అనుభవింప లేక—సుఖపడ లేక—చేతవాత గాక—ఏల లేక—రోగములచే శక్తి లేక—దురాశాచింతలచే మనసున కుద్రేకము లేక—ఈగ్గిలబడుచు—ముక్కుచు—మూల్గుచు—సతిమాట వినుసరికి నిద్రను నటించుచు—దేహపీడను దెచ్చుకొనుచు—సిగ్గు లేక—స్త్రీలకంటె నధములై—నపుంసకులై—రాతిబొమ్మలై—సమర్థింపఁజాలని యున్న యొకభార్యనైన యెవఁడో యొకదనుజుఁ డెత్తుకొనిపోయిన మంచి దని లోలోన నేడ్చుచున్న పిఱికిపందలకు—పౌరుషహీనులకు—తోలుతిత్తులకు—గడ్డి బొద్దులకు—పోఁతుపడుచులకు—లోలోనియు

ప్రయోజకతలు—అశక్తతలు—ఆఁడుతనములు—అవసరతవకీలు కమ్ముకొనుట కీదిక్కుమాలినకాలములో నేకపత్నీవ్రతదీక్షయనునొక పెద్దవంక దొరికినది. ముప్పదియేండ్లకు లోపునాఁడవు. నీ కేకపత్నీదీక్ష యేమి? నీతండ్రికి ముగ్గురుభార్యలు మూఁడు వందలయుంపుడుకత్తె లెట్లుండిరి? అతని కేల యీనిర్భాగ్యపు వ్రతము లేక పోయెను? లేకపోవుటచేతనే కదా నీకు ముగ్గురుసోదరు లుండుభాగ్యము తటస్థించెను? లోకములో నెందఱనేకపత్నీవ్రతముగలవా రున్నారు! మాయన్న రావణున కెందఱుభార్య లున్నారు! ఎందఱు కాంతల నపహరించినాఁడు! ఇంక నెందఱ నపహరింపఁదలఁచి యున్నాడు! జీవవ్యాపారము స్వచ్ఛందత మైయుండఁ బశువులలోనైన లేనియీపాడుకట్టుబాటునకుఁ బ్రజ్ఞాశీలు రేల లోనై యుండవలయును?

లక్ష్మ—(తనలో) ఆహా! ఆహా! ఏమి ధర్మోపన్యాసము! ఏమి వాగ్ధాటి ఏమి యుక్తిసందర్భము! ఏమి నీతిబోధనపటుత్వము! చిత్రకూటమున వసించియుండ మునియగుజాబాలి రామభద్రున కిట్టులే నాస్తికత నుపదేశించినాఁడు. ఇప్పు డీరక్కసి యీమహానుభావునకు—ఈనయూపరావతారునకు—స్వైరవిహారప్రాముఖ్యమును బోధించు చున్నది. పురుషులలో జాబాలిని స్త్రీలలో దీనినే యిట్టియపూర్వవ్యక్తులను జూచినాఁడ. ఈమె స్వానురూపస్వాభావుఁ డగునాజాబాలి నంకించుకొన్న యెడల మా కీబాధ లేకుండును. రాముఁ డపుడు జాబాలికి మృదులముగఁ జమత్కారముగఁ బ్రత్యుత్తర మిచ్చి దిద్దుబాటు చేసినాఁడు. ఇప్పు డేమి చెప్పునో వినవలయును.

రాము—శూర్పణఖా! నీవు శ్రమపడి నీమతానుసరణముగ న్యాయములని తోఁచినమాటలను జెప్పితివి. సంతసించితిని. కాని మాకు

వి యసమ్మతములు. అయినను నీతో నిందునుగూర్చి వాదించుట యనావశ్యకము. అది గాక వాదమున నుభయపక్షములవారికి గొన్ని సమానాంగీకృతము లైనయంశము లుండవలయును. వానిపైన విభేదాంశములఁ గూర్చి వాదము జరుగవలయును. అట్లు కాక నే నుత్తరధ్రువమున నీవు దక్షిణధ్రువమున నున్నా రము! వాదము పొసఁగదు. అయినను నీగ్రహణశక్తి కనుగుణ మైనకొన్ని మాటలు లేక్రొ చెప్పకపోయిన నీమనసున కెట్లున్నను నామనస్సునకు శాంతి యుండదు.

గీ. జనుని కుద్వాహ మిహపర ♦ సాధనంబు;
నాతి యొకతెయె పరసాధ ♦ నంబునకును
చాలు ననుట స్పష్టం బిహ ♦ సౌఖ్యమున కొ
కచెలి సరిపోవునో లేదొ ♦ కాంతు మెంచి.

ఆ. వె. ఉవిద లేఁదఱున్న ♦ నొక్కొకపరి యొక్క
తరుణితోడనే క ♦ దా కలయిక?
అదియె చాలుదనుక ♦ నక్కఱకును రాఁగ
బహుసతీపతిత్వ ♦ బాధ యేల?

ఆ. వె. ఏకకాలమందు ♦ నేకసతీభోగ
శక్తి మనకు లేని ♦ సరణి నరుని
కతిసతీపతిత్వ ♦ మస్వభావ మనర్హ
మంచుఁ దెలియఁజేయు; ♦ నట్లు గాదె?

గీ. సతతనూతనకాంతాను ♦ పక్తిక్రొత్త
వేడుక యని యెంచుటకంటె ♦ వేఱుపామ
రతయు, నప్రాజ్ఞతయు ధీజ ♦ డతయు నస్వ
భావమును, బశుత్వంబు పా ♦ పంబు లేదు.

గీ. అస్థిమాంసవసాశోణి ♦ తాదిరచిత
తనువుతో నున్నపనికి శూ ♦ ర్పణఖ! యేమొ
ముకలయిన నేమి? పత్తోలం ♦ బొమ్మయైన
నేమి? పమాంసపిండంబు ♦ లేని యేమి?

గీ. వస్తుయాథార్థ్య మెంచఁగ ♦ వానిలోన
నొకటికంటె విలక్షణ ♦ మొకటి యేది?
అట్టిచో నెన్నియో నెత్తి ♦ గట్టికొనుట
యేల? ఇహపరముల కొండె ♦ చాలియుండు.

గీ. గాత్రమందలిపరమాణు ♦ కాండ మెల్ల
ప్రతినిమేషమునకు మారు ♦ ప్రతిభ సతత
తైలధారవంటిది కానఁ ♦ దత్త్వమెంచఁ
దనువులు నిమిషనిమిషనూ ♦ తనము లగును.

గీ. నూత్నవనిత లేకున్న వి ♦ నోదగరిమ
లే దనెడుమాట కూడను ♦ లేదు; దాన
నేకపత్నీవ్రతులయిన ♦ నెపుడు క్రొత్త
పెండ్లికూఁతుతోఁ గూడి ♦ వెలయుచుంద్రు.

గీ. ధరణిలోనఁ గొంచెము హెచ్చు ♦ తగ్గుగాఁగ
స్త్రీపురుషసృష్టి సమముగాఁ ♦ జెలఁగుఁ గాన
నొక్కపురుషున కొకసతి ♦ యుంటకంటెఁ
దగదనుచుజీవసృష్టి క ♦ ర్థంబు గాదె?

గీ. కతప లొందఁదగినయింతు ♦ లెందఱును స
రుండు గట్టుకొనుట నిత ♦ రులకు బాధ;
తనివిఁగల్గనియావని ♦ తలకు బాధ;
పలజాలక తనబాధ; ♦ ఇన్ని యేల?

శూ—అయ్యో! అయ్యో! ఇట్లు జెప్పవలదు. నీవు బాలవేదాంతివి. మహారాజ పండితుండవు. ఈభార్యనైన నీ విక నెంతోకాల మే లుదు వని నేను నమ్మను. నీవంటిసన్న్యాసితో నాకుఁ బనిలేదు. ఇదుగో! నాయిచ్చవచ్చిన ప్రభుండు. ఓలక్ష్మణా! నీ వింతకు ముందు నాసౌందర్యమును యథార్థముగఁ బరిగణించితివి. నీవు రసగ్రహణపారీణుండవు. గుణగ్రహణసమర్థుండవు. నీచుఱుకుం దనమునకు నాకఱుకుందనమునకు సరిపోయినది. నీపదుచుదన మునకు నాశరీరపటుత్వమునకు సరిపోయినది. నీకుఁ గాంతలే మికి నాకుఁగాంతుండు లేమికి సరిపోయినది. కావున నీవు నాక నురూపపతివి. ధనుర్బాణము లటుంచుము. ఇదిగో! కౌఁగిలిం చుచుంటిని. (మీఁదఁ బడఁబోవును.)

లక్ష్మ—ఆఁగు! ఆఁగు! మీఁదికి రాకు. ముందుగానే కౌఁగిలింతలా? ఆఁ! ఆఁ! దూరముగ నుండు. నేను నీ కర్హుఁడ నని చెప్పితివి. నీవు నా కర్హ వగుదువొ లేదో యాలోచింతుము. తొందర పడకు.

శూ—వృథావాక్యముల నీయన్న కాలక్షేపము చేసినాఁడు. ఇఁక నేనాలస్యమున కోర్వను. రా. రా! నే నెఱుంగుదును. నీయ న్నచేఁ దిరస్కరింపఁబడిన నన్ను నీయన్న యెదుటనే చేపట్టుటకు లజ్జపడుచున్నావు. పురుషున కామాత్రపుసిగ్గుండినఁ బ్రమా దము లేదు.

(చేయిపట్టుకొని లాగును.)

లక్ష్మ—చీచీ! చండాలిసీ! వదలు; వదలు! ఊఁ!

శూ—బాగుపడలేనివానివలె లేనిపోనివెఱ్ఱిపోకలఁ బోకు! బుద్ధిగలిగి చెప్పినమాట విని బ్రదుకుతెరువు చూచుకొనుము. నాకు స్వగ్రామమున మహాంతఃపుర మున్నది. మహాభోగసమన్విత

మైనదానియందుఁ జేరి మనముపగలెల్ల సంభోగక్రీడల ననవరత
మొందెదము. సాయంకాలము కాఁగానే స్వచ్ఛందగమన నైన,
నేను నిన్ను వీఁపుపై నెక్కించుకొని మున్యాశ్రమముల
కుఁ బోయి యచ్చటి మునులను సకాంతాకముగఁ జంపి
తత్కళేబరములఁ దీసికొని వచ్చి నికుంభిలాశక్తికి ని
వేదించి యాపచ్చి మాంసముఁ దిని—యాపచ్చిరక్తము
త్రావి—యాక్రొవ్వు దేహములకుఁ బూసికొని—ముక్కకొ
నవఱకు సురను త్రావి—మైమఱచి—మునిచర్మములు చేతఁ
బూని—నన్ను నీవు నిన్ను నేను గట్టిగ మోదుకొనుచు దిగంబ
రులమై తాండవ మాడుదము. గతిలేనియీరాముని గొలిచి మ
ఱింత గతిలేనివాఁడనై యుండు టేల? ఈయవకాశము వృథ
పోనీయకు. నీకు దరిద్రత వదలుటయే కాక మహైశ్వర్యము
నాతోఁగూడ రానైయున్నది. కిక్కురుమనక రా! (లాగును)

సీత—(అపవారించి) ఆర్యపుత్రా! లక్ష్మణుఁడు తీవ్రముగ నగపడుచు
న్నాఁడు. పాపమా తెలివితక్కువదానిని హింసింపఁడుకదా!

రాము—ఆతఁడు నాయనుజ్ఞకు మీఱినపని నీకముందుఁ జేయునేమో
కాని యింతకుఁ ముందెన్నఁడు జేసియుండలేదు.

లక్ష్మ—పరమ మూర్ఖురాలవుగ నున్నావు. నీకుఁ దెలియదు—నేఁజె
ప్పిన వినకున్నావు. నాస్వభావమును బాగుగ గుర్తెఱుఁగకున్నా
వు. పో! దూరముగఁ బొమ్ము.

(చేయిత్రోసి ధనుస్సుతోఁ జేతిపైఁ గొట్టును.)

సూ—హా. హా. హా! ధనుస్సు విఱిగినదేమో చూచుకొనుము!
ఈదెబ్బ నాకు లక్ష్యమా? మీఁద నీఁగ వ్రాలినట్లయిన లేదు.
గాలి తాఁకినట్లయిన లేదు. హా. హా. హా! మన్మథబాణములు
రేయింబగళ్ళు పాదాదిశిరఃపర్యంతము నాఁటుటచే దేహము

తివిస్మరియైనది. ఈమొండితనముమీఁద నొడలు కోసిన నాఁటు నేమోకాని—

లక్ష్మ—అదెంతపని! మహాప్రభూ! (కత్తి దూసి) కటాక్షించి యనుజ్ఞ యొసఁగుఁడు.

రాము—శూర్పణఖా! అతనితో నీకేమి?

శూ—ఆఁ! అతనితో నాకేమియు లేదు. ఉన్నదంత నీతోడనే యున్నది. ఇతఁడు మొండి. బండ. అనురాగ మెఱుంగఁడు. అందులోఁ జుఱుకుపా లెక్కువ. అశక్తతలో దుష్టత్వము మెండు. చేఁతగాక చిట్టుమను తొందరపాటువాఁడుచేయి వదల్చుకొన లేక చాపమునఁ గొట్టినాఁడు. ముద్దుపెట్టుకొన లేక మూతిపైఁ బొడిచినాఁడు. కౌఁగిలింప లేక కాలు లఱచినాఁడు. తనయధీనమైనతరుణిని దాఁక లేక తరవారి యెత్తినాఁడు. చీచీ! ఇట్టినిరుపయోగపుఁబెద్దమ్మ లుండనేల? బానలకొలఁది రుచ్యాహారముల మ్రింగి—బారుమని త్రేఁచి—ప్రక్కలోనివనిత నెఱుఁగక.—బట్ట యెఱుఁగక—బండవలెఁ జచ్చినట్లు పండుకొని—క్రొంకివే దురుబద్ధను చేతఁబూని—యూఁచలను విడిచి—యూరివారిని బాధించుట పౌరుషమని తలఁచినమహాబుద్ధిశాలురలోవాఁ డితఁడు. పశువులవలెఁ దినుట, నిద్రించుట, కాలు లాఁచుట పౌరుషమా? చీచీ! ఎదుటఁ బడినకాంతను మెదలనీయఁదగునా! సరసములు—సల్లాపములు—ముద్దులు—ముచ్చటలు—పలుకులు—పరిహాసములు—తాండవములు—తన్నులు—పీఁకుటలు—బఱుకుటలు—కొఱుకుటలు—నఱుకుటలు—జరిగించి యాకాంతతో నట్టనడువీథిని పట్టపగలు క్రీడించుటయే పౌరుషము. అట్టిపుంస్త్వము లేదు సరే కదా ముందునకు లాగిన వెనుకకుఁ బోయెను. చేయి పట్టికొన్న మొఱ్ఱో! విష్ణువు మనెను.

దగ్గఱకు వచ్చిన గడగడ లాడెను. నవ్విన రొసరొస లాడెను. క్రీఁగంటఁ జూడఁ గన్ను లెఱ్ఱఁజేసెను. సరసకు రమ్మనినఁ జంపెద ననెను. ఈపుంస్త్వ మేమినా! శ్రాద్ధమా! చాలు! ఇఁక నతనితోఁ జాలు! నీవు నాకు సమస్తవిధముల నచ్చినావు. అదిగో! ఏకపత్నీవ్రతమను నొకపెద్దతలతిక్క నీకుఁ బట్టికొనినది. అది నేను విడిపించుటకు యత్నింతును. ఇంతసేపు నందునుగూర్చియే యాలోచించుచుంటిని. ఏకపత్నీవ్రతమనగ నిద్దఱుభార్య లొకసారి జీవించి యుండఁగూడ దనియేనా! సెభాస్! సీతను నే నిప్పు డవలీల జంపి రూపమైనఁ గానఁబడకుండ మ్రింగెదను. తరుత్తరక్షణమున నీవు నన్ను వివాహము చేసికొనిన నీవ్రతమున కాభంగము లేదు! నాకా సుఖమున్నది! ఉభయతారక మైన యీపని నేల చేయఁగూడదు? సీతా! రా. పచ్చిమిఱియపుఁగా యనువలెఁ గటుక్కునఁ గొఱికెదను.

(మీఁదికిఁ బోయి సీతను గ్రహించి లాగును.)

**సీత**—నాథా! నాథా! రక్షింపుము.

**రాము**—(సీతనువిడిపించి) లక్ష్మణా! ఈరాక్షసిబాధ యధిక మగుచున్నది.

**లక్ష్మ**—సెల వైనయెడలమీఁదుముక్కలక్రింద ఖండింతును.

**సీత**—చంపుటకు నే నంగీకరింపను.

**లక్ష్మ**—ముక్కుసెవులు గోసి విరూపను గావింతును. శూర్పణఖా! సీతాదేవియనుగ్రహమున బ్రదికితివి. నేను నిన్ను మూఁడుముక్కలక్రింద ఖండింతు నంటిని. ముక్కుసెవులు గోసి నామాటనుయథార్థపఱుచుకొందును. రా; రా!

(శూర్పణఖ కేశపాశముఁ బట్టి లాగికొనుచు నిష్క్రమించును)

**సీత**—ఈరాక్షసి నన్ను స్పృశించినది. నేను తిరిగి భగవతియగుగోదా

వరిలో స్నాన మొనరింతును. సెల విమ్ము.

రాము—నిన్ను విడిపించునప్పుడు నేనుమాత్రము రాక్షసి నంటలేదా? నేనును వచ్చెదను.

(నేపథ్యమున) అయ్యయ్యో! ఈకటికవాఁడునాకర్ణనాసికము ఛేదించినాఁడు. రామభద్రా! నిన్నుఁ గోరినందులకు నన్నిట్లు పరాభవించితివికాదా! కాసి! జాగ్రత్త! నావలెనిన్ను నేనేడ్పించెదను. కాచికో! (ఏడ్చును)

రాము—

గీ. కఠినకాంతారవాసదుః ♦ ఖముల కెల్ల
నాదిహేతువు మంధర ♦ యయ్యోఁ గాదె?
కష్టములలోన మఱికొట్టు ♦ కాండమునకు
రావణభగిని యింకఁ గా ♦ రణము సుమ్ము.

లక్ష్మణుఁ డింక రాక యుండె నేమి?

(లక్ష్మణుఁడు ప్రవేశించును.)

లక్ష్మ—మహాత్మా! మాధ్యాహ్నికకృత్యములు నిర్వర్తింప వేళయగుచున్నది.

(నేపథ్యమున) ఎవరక్కడ? ఎవ రక్కడ? రాముఁ డఁట! యేఁడి? లక్ష్మణుఁడఁట! యేఁడి? దురాత్ములు మాచెల్లిలిని బరిభవించినారు. రే! సేవకులారా! రండు! వారిసూఁడుఁడు!

గీ. దేవతానీకఖండనో ♦ ద్దీప్తభుజుఁడు,
శతసహస్రోరుయోగవి ♦ శంసనుండు,
మానికులమాంసభోజియా ♦ దానవుండు
ఖరుఁడు దూషణుతో వచ్చుఁ ♦ గాచికొనుఁడు.

రాము—సోదరు లగుఖరదూషణులతో శూర్పణఖ తనపరిభవవృత్తాంతమును దెలుపుకొనఁగ వారు బద్ధకోపులై మనమీఁదికి దండె

త్తి వచ్చుచున్నారు. అయినను బ్రమాదమేమియు లేదు. పవి
త్రమగునీపర్ణశాలాప్రాంత దేశమున రాక్షసులతో యుద్ధమెందు
లకు? నేను బోయి వారి నెదుర్కొనెదను లక్ష్మణా! నీవు వైదే
హితోఁ బర్ణశాలకుఁ బోయి యచ్చట భద్రముగ నుండుము.

లక్ష్మ—చిత్తము.

సీత—మీకుజయ మగుఁగాక! నమస్కారము!

(లక్ష్మణుఁడు సీతతోఁ బోవును.)

రాము—ఓ ఖరదూషణులారా! మీరు ముందునకు రావలదు. ఇచటి
ప్రదేశము యుద్ధమున కనుకూలముగ లేదు. మిమ్ముఁగాంచుట
కు రాముఁడ నైననేనే యటకు వచ్చుచున్నాను.

(నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.



# వనవాసరాఘవము.

—⁂—

## ద్వితీయాంకము.

ప్రదేశము. జనస్థానము.

ప్రవేశము. అకంపనధూమ్రాక్షులు.

అకం—నీవెందుల కేఁగవు?

ధూ—నే నుబ్బసపు రోగము గలవాఁడను గాన యుద్ధమునకు రాలేక యిక్కడ నుండిన రణరంగమునకు బలవంతముగ నీడ్చుకొనిపోఁ బడుదు నని భయముచే ఖాండవమున దాఁగితిని.

అందుచేత నాకు యుద్ధాంశము లేమియుఁ దెలియవు.

అకం—నీవు పూర్ణాయువు కలవాఁడవు కావున నే నీకీశ్వాసరోగము సంభవించినది.

ధూ—సరే. నారోగముచే నేను బ్రదికియుంటిని నీవెట్లు చావుదప్పించుకొంటివి?

అకం—నారోగముచే నేను బ్రదికితిని.

ధూ—అకంపనా! నీవు దృఢముగనే యుంటివి. నీకు రోగమేమి?

అకం—పిఱికితనము. ఈపైదారుఢ్య ముబ్బుజబ్బువాని యొడలి పొంగు నిగ నిగవంటిది.

ధూ—నీవు యుద్ధమునకు వెళ్లితివా?

4.

అకం—వెళ్లితిని. ఆవిషయమున వెళ్లనివానికంటె నెక్కువధైర్యము గలవాడనే యగుదును. కాని వెళ్లినలాభ మేమి! విల్లుపట్టనా! నారి లాగనా! అమ్ము విడువనా! గదయెత్తనా! నిలువఁబడనా! అట్టహాసము సేయనా! తేఱిపాఱి చూడనైనఁ జూడనా! ఏము న్నది!

ధూ—ఎందుచేత?

అకం—ఆరామయుద్ధ మహిమ మేమోకాని యభివర్ణించుటకునలవికాదు. తలఁచుట కంతకంటె నలవికాదు. ఆతనిమీఁదికి మొదటఁబంపఁబడినపదునాల్గురు రక్కసు లవలీలగఁ జంపబడినారు. అంతక్రోధావేశమునఁ బదునాల్గువేలరాక్షసులతో ఖరదూషణులు యుద్ధమునకు బయలుదేరఁగ రాముఁడు—అబ్బ! ఇప్పటికైన రణకంపము వదలకున్నది. గంధర్వాస్త్రమఁట—దానినివేసి—ఆసైన్యమునంతనావులించు కాలములోఁ జంపెను. తరువాత ఖరదూషణుల నిద్దఱనుగడ తేర్చెను.

ధూ—త్రిశీర్షమకరాలయులో?

అకం—వారిపని యంతకు ముందే యయ్యెను.

ధూ—గాంధర్వాస్త్రబాధ నీ కెట్లుతప్పినది?

అకం—అదృష్టముచేత—ఆయువుండుట చేత—ఆనోఁటిదక బుణాను బంధముచేత—

ధూ—సరే! అర్థములేని యీమాటలకేమి? నీవేమిచేసి యాభయంకరాస్త్ర బాధఁ దప్పించుకొంటివి?

అకం—ఏమిచేసి కాదు, ఏమిచేయక తప్పిచుకొంటివి యనుము.

ధూ—సరే. ఏమి చేయక తప్పించుకొంటివి?

అకం—యుద్ధమునకు వెళ్లక—

ధూ—మొదట వెళ్లితినని చెప్పితివి కాదా?

అకం—ఆ! రాముఁడు యుద్ధ మారంభింపకున్నంతవఱకు రణరంగమునం దతిరౌద్రమూర్తినై తిరుగుచునే యున్నాను. రాముఁడు యుద్ధమున నొకడుగు ముందునకుఁ బెట్టునసరికి నేను బదునాలుగడుగులు వెనుకకుంచితిని. అందులో లోప మేమియు లేదు. ఒకని పనికంటె మనపని హెచ్చయుండవలయును గాదా?

ధూ—రాముని జూచుసరికి నీ వింటికిఁబోయితివా?

అకం—అప్పుడు నేను జూడనే లేదు. చూచినవారివలన విని—

ధూ—ముందు పదునల్వురు చచ్చిరని—తరువాత గాంధర్వాస్త్రప్రయోగ మైనదని—తరువాత వారు చచ్చిరని—అంతకుముందే మఱికొందఱు చచ్చిరని—చూచినవానివలనే చెప్పితివి? ఎట్టులు చెప్పఁగలిగితివి?

అకం—వినికివలన—

ధూ—యుద్ధమే యెఱుఁగని నేనుఁ యెఱిఁగియెఱుఁగని నీవుతప్ప మఱెవ్వరు బ్రదుకనే లేదే! వినుట కెవ రున్నారు?

అకం—వినుటకు నేనే యున్నాను.

ధూ—కాదు. చెప్పుట కెవ రున్నారు?

అకం—ఇంతపనిఁ జేసినవారే యున్నారు.

ధూ—రాముఁడు నీతో యుద్ధవార్త లన్నియుఁ జెప్పెనా?

అకం—నాతోఁ జెప్పకుండనే వింటిని.

ధూ—అదెట్లు?

అకం—సీతాలక్ష్మణులతోడను ముసలిగ్రద్దతోడను జెప్పుచుండ

ధూ—సరే. జటాయువుకూడ నటనే చేరినాఁడా? నీవు వారికిఁ గనఁబడకుండ దాఁగివింటివి కాఁబోలు!

అకం—ఆ! అట్టిపనియే జరిగినది.

ధూ—తరువాత నేమి చేసితివి?

అకం—దూరముగఁ బోయి యేడ్చితిని.

ధూ—చచ్చినవారికొఱకా?

అకం—కాదు. నాకొఱకే—

ధూ—ఎవనికొఱకు వాఁ డేడ్వ నేమి లాభము?

అకం—అటు తెంచియే లంకకుఁ బోయి రావణునికొఱ కాతనియెదుట నేడ్చితిని.

ధూ—రావణుకొఱ కేషు పనఁగ సోదరు లగుఖరదూషణులు మరణించుటచేత రావణునికిఁ గలిగినయాపత్తునుగూర్చి యాతఁ డేడ్వఁగ నీవును దుఃఖసహితుఁడవై పరామర్శించితి వనుటయే కదా?

అకం—కాదు. రావణుఁ డావార్తచే నేడ్వకపోవుటచేత నతఁనికిఁ బ్రతినిధిగ నే నేడ్చితిని..

ధూ—ఏడ్పునఁ బ్రతినిధి నుంచుట యరవలలో నసురులలో నలవాటే కదా!

అకం—ఆతఁ డుంచలేదు. నేనే బుద్ధిపూర్వకముగ నుంటిని.

ధూ—సరే. లంకలోనుండి తిరిగి యేల యిటకు వచ్చితివి?

అకం—రావణుఁడు కూడ రమ్మనఁగ వచ్చితిని.

ధూ—ఆలాగా! రావణుఁ డిప్పుడు జనస్థానమున నున్నాఁడా?

అకం—ఇప్పుడు లేఁడు.

ధూ—ఇక్కడ కేల వచ్చినాఁడు.

అకం—మారీచునితో మాట లాడుటకు.

ధూ—ఆసంభాషణమందలియంశములు నీ కేమైనఁ దెలిసెనా?

అకం—తెలియ లేదు. కాని రామునితోడ యుద్ధము సేయుటనుగూర్చినయాలోచనమును గుఱించి యని నాయభిప్రాయము.

ధూ—ఈముసలిముండకొడుకు యుద్ధమున కంగీకరించునా?

అకం—నీవు సిఱికితనమున నాజ్యేష్ఠ భ్రాతవయ్యును యుద్ధమునే కోరు చున్నావేమి!

ధూ—నేను దప్ప యందఱును మరణించవలయు నని. మారీచుఁడుయు ద్ధమున కంగీకరింపక పోవుటచే దానవేంద్రుఁడు తిరిగి లంకకుఁ బోయెనా?

అకం—అందుచేతనే యని యూహింతును. యుద్ధప్రయత్నమునకే వచ్చినాఁ డని కూడ స్పష్టముగఁ జెప్ప వీలు లేదు.

ధూ—దానవేంద్రునివెంట నీ వేల పో లేద?

అకం—శూర్పణఖ పోవుటచేత,

ధూ—సరి. రామపరాభూత యగుశూర్పణఖ యీసారి రావణునిఁ ద ప్పకుండ యుద్ధమునకుఁ బురికొల్పును.

అకం—ఆప్రయత్నమునుగూర్చియే కాఁబోలు! రావణుఁడు మారీచా శ్రమమునకు మఱల వచ్చినాఁడు

ధూ—ఆలాగా! ఏదో యొకగట్టిప్రయత్నము జరుగుచున్నదని నే నూ హింతును.

అకం—గట్టిప్రయత్న మేల జరుగును? రాముఁ డంతవాఁడై యుండి యొకప్రేఁటు వేయుసరికి బ్రహ్మాండభాండమంతయు నెత్తి నోరు గొట్టుకొనుచు నెగిరిపోయిన మారీచుఁడిప్పు డేమొగము పెట్టి కొని యుద్ధాలోచనము సెప్పును?

ధూ—యుద్ధము లేకపోయిననేదో మహామాయోపాయము జరుగక మానదు.

అకం—మాయావేషములకు మారీచుఁడంతవాఁడే లేఁడు.

(నేపథ్యమున) హా! సీతా! హా! లక్ష్మణా!

అకం—అమ్మయ్యో! రామకంఠస్వర మదియే. పాఱిపోవుదమురమ్ము పర్ణశాలనుండి రాముఁ డింతదూరమేల వచ్చెనో!

ధూ—ఆర్తస్వరమువలె వినఁబడుచున్నది. రామునకార్తి యేల కలిగి యుండును?

అకం—నే నిఁక మాటలాడలేను. నా కొడలు కంప మొందుచున్నది.

(నేపథ్యమున తిరిగి)

హా! సీతా! హా! లక్ష్మణా!

అకం—అమ్మయ్యో! అమ్మయ్యో! రమ్ము. పోవుదము.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

*

ప్రదేశము—పర్ణశాల.

ప్రవేశము—సీతా లక్ష్మణులు.

---

సీత—ఆఁ! ఆఁ! అదేమి? నానాథుఁడు "హా! సీతా! హా! లక్ష్మణా!" యని యక్లేల యార్తుఁడై విలపించినాఁడు?

లక్ష్మ—(సందేహముగ) అట్టిధ్వని నాకుఁగూడ వినఁబడినది.

సీత—లక్ష్మణా! అట్టు లాడెద వేల? ఆధ్వని నీకుఁ వినఁబడినదా లేదా యని నిన్ను నే నడిగితినా?

లక్ష్మ—ధ్వని నాకుఁగూడ వినఁబడిన దనుటచే ధ్వనిమాత్రము భ్రమము కాదనియు నది యేమై యుండునో యనియు నాలోచించుచుంటిని. క్షమింపుము.

సీత—శ్రీరామచంద్రునికంఠస్వరమే వినఁబడియుండ నింతదీర్ఘాలోచన మేల?

లక్ష్మ—అది మహాత్ముఁడైన రామభద్రునిరవ మని మీ కెట్లు తెలిసినది?

సీత—లక్ష్మణా! నా కెట్లు తెలిసెనా? నానాథునిరవమే నే నెఱుఁగనా? వింతమాట లాడెద వేల? నీ వేమి నిద్రించుచుంటివా! నీకేమి మతి చెదరినదా! ఏదైన నావహించినదా!

లక్ష్మ—అమ్మా! నేను నిష్ప్రమాదముగనే యున్నాను! ఉగ్గుపాలద్రావు మొదలు కలసి పెఱిఁగినమాయన్నగారిగాత్రనాదము నే నెఱుఁగనా?

సీత—ఉగ్గుపాలనుండి యేకముగఁ బెఱిఁగినయభిమానముచేత నేనా! అన్నగా రనుమహానురాగముచేత నేనా 'అయ్యో! లక్ష్మణా!' యని

యామహానుభావుఁ డటువంటివాడె గిట్టి మనికడుపునిండినవానివ లెఁ గానంత తొట్రుపాటయిన లేక కదలక మెదలక యింక ని క్కడనే యున్నావు.

లక్ష్మ—అమ్మా! ఇక్కడనుండి కదలుట యెందులకు?

సీత—ఎందుల కని న న్నడుగు చుంటివా! ఆపత్సముద్రమున మునుఁగు చు నమ్మయ్యో! అమ్మయ్యో! యవసానకాలమునఁగాఁబోలు హా! లక్ష్మణా! యని యాక్రోశింప నట్టియన్నగారిని గాపాడవల యు నన్నచింత నీ కక్కఱలేదా? ఎందుల కని న న్నేల యడిగె దవు? ఆతఁడు నీకుమాత్రము ముఖ్యుఁడు కాఁడా? ఆతనిని వద లఁజాలకయే యిక్కడకు వచ్చి యిట్లు చేసెదవా? అయ్యో! నాథా! నాథా! నీ కేమియాపద సంభవించినదో కదా!

లక్ష్మ—తల్లీ! అమంగళములు పలుకఁ దగునా?

సీత—అమంగళములు కంటియెదుట జరుగుచునేయుండ నిఁక నేమున్న ది? హా! నాథా! సీతమ్ముఁ డైన,ని న్నుద్ధరించుటకురాక యి క్కడనేయున్నాఁడు. మఱియొకసారి పిలువుము.

లక్ష్మ—జగదవనపటిష్ఠుఁడును, మహాసురఖండనుఁడును దివ్యాంశసం భూతుఁడు నైన శ్రీరామచంద్రదేవు నీనిర్భాగ్యుఁ డుద్ధరించువా డా! అమ్మా! లేనిపోనితొట్రుపాటు నొందక యామ వీరశి ఖామణి కేయాపత్తును సందేహింపక మనసుఁ గుదుటఁబఱచు కొని యుండుము. ఆయనయే యిక్కడకుఁ గొలఁది సేపటికి రాఁ గలఁడు.

సీత—ఇచ్చటికి శీఘ్రముగ రానున్నవాఁడు, మనల దుఃఖాక్రాంతు డై పిలువ నేల?

లక్ష్మ—ఆమహానుభావుఁడు మనలఁ బిలువ లేదు. ఆయార్తరవమాత నిది కాదు.

సీత—మ ఱెవరిదో చెప్పరాదా?

లక్ష్మ—అమ్మా! నామాటయందు విశ్వాస ముంచఁదగును. అది యొక రాక్షసునిది.

సీత—ఎవఁ డారాక్షసుఁడు?

లక్ష్మ—మారీచుఁడని నాకనుమానము. వాఁ డతిమాయావి. వాఁడే యీ మాయలేడిరూపమును ధరించి వచ్చినాఁడు. లేకున్న బంగారుచర్మ మేమి! నీలపుగొరిజ లేమి! వజ్రఫలక మగుకడుపేమి! ఈసంగతి నేను మీసన్నిధానమున రామభద్రునితో డనే మనవి చేసికొనియుంటిని కాదా! కాని మీరు దానియందుం డునభిలాష చే—

సీత—ఇప్పుడు నీ వెప్పుడు మాటలకేమి? ఆరాక్షసుఁడు?

లక్ష్మ—మహామాయావి యగుటచే రామునికి దొరకక దొరుకున ట్లగపడి దూరమునకుఁ బోయి యిట్లుమోసపుచ్చి పర్ణశాలకు దూరముగఁ దీసికొనిపోయి యుండును రామభద్రుఁడింక లేడి దొరకదను నిరాశతో దానిచర్మమైననుమీకుఁ జూపించి సంతోషపెట్టుదుననువాగ్దానము ననుసరించి బాణమును సంధించి దానిని గొట్టఁగ నది మరణాసన్నసమయమున హా! సీతా! హా! లక్ష్మణా! అని రామస్వరముతో నాక్రందనము చేసియుండును.

సీత—ఇది యంతయు నీయూహము—నీబుద్ధివైశద్యము—నీకల్పనాచాతుర్యము—నీవల్లినకథ—ఇది యథార్థ మనినీవుమాత్రము ప్రమాణముచేసి చెప్పఁగలవా? చెప్పలేవు. నే నెఱుఁగనా? ఇట్లు జరిగియుండు ననియే చెప్పఁగలవు కాని యప్రత్యక్షవార్తను గ్రహించుటకు నీవేమి భగవంతుఁడవా?

లక్ష్మ—అమ్మా. నాకు దివ్యజ్ఞానము లేదు. నేను భగవంతుఁడ నని చెప్పలేను. కాని దివ్యజ్ఞానసంపన్నుఁడును, భగవదంశసంభూ

తుఁడును మహాతేజశ్శాలియు నగు శ్రీరామభద్రుని మాహా త్మ్యమునందలిసంపూర్ణవిశ్వాసముచే నే ననినట్లే జరిగియున్న దని నేను దృఢముగఁ జెప్పగలను.

సీత—ఏమి లక్ష్మణా! ఇంతకు ముందు జింకను గ్రహింపలేక రాముఁడు దానిని గొట్టెనంటివి? ఇప్పుఁడాతఁడు దైవమంటివి? నీకు రెండు నాలుకలా? ఏమాటలను విశ్వసింపను? నీకు హృదయమం దేదో యున్నట్లున్నది. కానినీవుకల్పించిన ప్రబంధము నిజమే యను కొందము. తాను రామబాణప్రయోగమునఁ బ్రాణత్యా గము సేయుచు హా! సీతా! హా! లక్ష్మణా! యనిరామ స్వరమున నఱచినఁ దన కేమి లాభము? ఏయభిప్రాయ మున నఱచియుండునో యూహించి చెప్పుము నీకవితాచమ త్కృతిని గాంతును?

లక్ష్మ—అమ్మా! ఈకంటకపుమాట లేల? నాహృదయమున సీతారా మపాదారవిందభక్తి తప్ప మఱియేమున్నది?

సీత—అప్రస్తుతము లగునట్టియీమాటల కేమి? ఏదీ? మారీచుని కేమి లాభమో చెప్పుము.

లక్ష్మ—(సందేహించుచు) ఆమాటలు విని మనమిచ్చట తొట్రుపాటు పడుటయే.

సీత—ఆ! ఆ! అదికినదా? అదికినట్లు నీకుమాత్రము తోఁచుచున్నదా? నీమనస్సునందే నీకు సంతుష్టి నీయఁజాలని మాటలను బైకి నా తో నేల చెప్పెదవు? మనమాతని మాటలవలన నలజడి నొంది నఁ దన కేమి వినియోగము. బాణవ్రణపీడితుఁడై కన్నీళ్లను వ దలుచున్నాడు. గాయమునుండి రక్తప్రవాహమును వదలుచు న్నాఁడు. సర్వైహికలంపటతను వదలుచున్నాఁడు. ఊపిరిని విడు చుచున్నాడు. ప్రాణమునువిడుచుచున్నాఁడు. లోకమునే వదలు

చున్నాఁడు. ఇట్టి సర్వసంగ పరిత్యాజనసమయమందు నీపైన నాపైన నతనికి వైరము వదలినదికాదేమి? నిన్ను నన్ను సాధించుతలఁపు వదలినదికాదేమి ? ఎట్టిపరమదుష్టుఁడైనను నెట్టి నీచుఁడైన, నెట్టి మాయావియైన, నెట్టి యధముఁడైన, నెట్టిమహాపాపుఁడైన దేహాత్మ విభేదన సమయమున హృదయమును శాంతిపఱుచుకొని పూర్వపాప కృత్యములకుఁ బశ్చాత్తాప మంది తనయుత్తరగతి యెట్లుండునో యనుమహాభీతితో గడ గడ వడఁకుచు వెనుక దూఱిన దైవమును మహాదీనుఁడై ప్రార్థించుట సహజము గాని చచ్చిన తరువాతనైన శత్రువులను సాధించ వలయునను నీర్ష్యతో—దుర్బుద్ధితో—మహాపాపపుఁజింతతో మాయావియై యసత్య మాడుచు, నప్రమాణములు సేయుచు మహామాయలను బన్నుచు, ప్రాణములు విడుచుట కేవల మసహజము. మారీచున కవసానకాలమున ‘హారహారా!’ యని యనుకొన్న బరమార్థముకాని, హా ‘లక్ష్మణా’, యనియనుకొన్న వాగ్వ్యయము—నోరు నొప్పి—ఊపిరిఖర్చు — మాత్రమే కాని యేమివినియోగము? మహాకష్టము లొందుమహాత్ముఁడైన యన్నగారి దరిజేరక దూరమున వదినెగారిని గని పెట్టుకొని యుండునిన్నుఁ దలచుకంటె నెదుటఁ బ్రకాశించుచున్న దివ్యమంగళమూర్తిని—తనవంటి మహాబలుని నవలీలఁబరలోకమున కంపఁగలిగినయలౌకిక తేజశ్శాలిని—అట్టి శ్రీరామభద్రుని ‘హా! రామచంద్రా!’, యనియఱచిన నెక్కువసందర్భముగ నుండునే? ఎక్కువ సమయోచితముగ నుండునే? మహావీరుఁడైనవానిపై నాత్మను లగ్నము చేసి ప్రాణమును విడుచుటచే తదాత్మకథికోన్నతగతి సంప్రాప్తికిఁ గారణ మగునే? లక్ష్మణా. పర్యవసానమున నసందర్భ మగునీకల్పనము విశ్వసనార్హము కాదు

మారీచునియభిప్రాయమును గూర్చి నీవు చెప్పినమాట లసందర్భములుగ నున్నట్లు నీకుఁదోఁచలేదా?

లక్ష్మ—అసందర్భమున కేమున్నది? రాక్షసులు జనసామాన్యమువలెఁ గాదు. వారుప్రబలమాయాన్వితులు. మహాక్రూరులు. అత్యంతాసూయాకలుషచిత్తులు. అవసానకాలమందైన హృదయమార్దవమును గలిగియుండరు.

సీత—తమయవసానకాలమందా? అన్నగారియవసానకాలమందా?

లక్ష్మ—(తనలో) ఆహా! ఈమె నన్నెట్టిమాట లాడుచున్నది? భర్తకాపత్తు గలిగె ననుదుర్భ్రమమువలనఁ గలిగిన తొందరచే నటులపలుకుచున్నది. నే నిక్కడనుండి శ్రీరామభద్రునియొద్దకుఁ బోలేదనుకోపముచేతఁ గూడ నసందర్భపుమాట లాడుచున్నది. అయిన నేమి చేయను? అన్నిటికిఁ దల యొగ్గవలసినదే. నేను జెప్పినమాటలను బొత్తుగ విశ్వసింపకున్నది. ఆమె ననవలసినపనియేమున్నది? భర్త యాపదలో నున్నాఁడని యనుకొనిన యేకాంత యాశ్వాసవాక్యముల శాంతిల్లును!

సీత—ఏమి లక్ష్మణా! మాట లాడకున్నావు?

లక్ష్మ—అన్నగారియవసాన మనుసందియమునకుఁ బని లేదు.

సీత—(గుండెలు కొట్టుకొనుచు) అయ్యో! అయ్యో! నిశ్చయమే? నిశ్చయమే? హా! రామభద్రా! (ఏడ్చును.)

లక్ష్మ—అమ్మా! ఊఱడిల్లి చెప్పినమాట వినుఁడు. మాయన్నగారికే యాపదయు రాలేదు. రాదు. నిశ్చయముగ నమ్ముఁడు. ఇదియంతయు మారీచునిమాయ. మాయాకురంగరూపమున రాముని మోసపుచ్చి యామహాత్ముని మనలను విడువఁజేసినాఁడు. ఇట్లుకేక వేసి నన్ను మీకు దూరముగఁ జేయఁదలఁచినాఁడు. నేను మిమ్ముఁ ద్యజించినయెడల మీరరక్షకలగుదురు. మీరొంటరిపా

టుజూచి యేరాక్షసుఁడైనమిమ్ము వంచింపసమీపించునెడల నే మి కావలసినది?

సీత—ఎంతదూర మాలోచించితివి! జరుగఁగూడని యెన్నెన్ని యంశ ములు జరుగు నని యనుమానించుచుంటివి! ఆశలకు నాలోచన ములకు నంతమున్నదా! నేనడిగినకొలఁది నీవాలోచించి చెప్పుచునే యుందువు. నేను జెప్పుచున్నాను. విను; నీవియాలోచనములు. అనఁగ ననుమానములు. అనఁగ నయథార్థములు. నేఁబ్రత్యక్ష ముగ రాముఁనియార్తరవమును వింటిని. నాకర్ణేంద్రియమే ప్రబల సాక్షి. నీవు నట్టియార్తధ్వనిని వింటి నని చెప్పితివినీవేసాక్షివి. రామచంద్రునిస్వర మని నే నంటిని. రామచంద్రునిస్వరమువలెనే యున్న దని నీవంటివి. నీ“వలెనే,, యను మాటనునిర్ధారణపఱిచి సిద్ధాంతపఱిచి నన్ను విశ్వాసపఱుచుటకుఁ దలంపోఁక లేని యా ధారము లేని యసందర్భము లగున నేకగాథలఁ గల్పించుచుంటి వి. రామునిస్వరమువలెనే యున్నస్వరము పదునాలుగుపాళ్ళు రామునిదై యుండవలయునుగాని మఱియొకనిదికాదు. అట్లుకార ణముగ ననుమానింపఁ గూడదు. మనకుఁ గర్ణేంద్రియములకంటె నీకల్పనాకథలు ప్రమాణములా? రామచంద్రుఁడు నిశ్చయ ముగ విపత్తునఁ బడియున్నాఁడు. నీవు పోయియాతనికిఁ తోడు పడుము. నేననినప్రకార మాతఁడుకష్టములోనేయుండుట సంభ వించెనా నీవువెంటనేతోడు పడుదువు. నీ మతానుసరణముగ నాతఁడాపత్తులోనే లేకయుండెనా యిద్దఱును గలసిసుఖముగని టకు వత్తురు. నీ విచట నుండునెడల మహాప్రమాదము సంభ వింపఁ గలదు. వెడలినయెడల నష్టము లేదు.

లక్ష్మ—అమ్మా! నాయభిప్రాయ మెట్లున్న దన—నేను వెడలినయెడ ల మహావిపత్తు సంభవింపఁగలదు.

సీత—(ఏడ్చుచు) అయ్యయ్యో! అయ్యయ్యో! నాకు భర్తృవియోగముకంటె నాపద యేమున్నది? హా! నాథా! రామభద్రా! నీతమ్ముఁడై మహాకఠినుఁడై నామాటను లక్ష్యపెట్టక నాపల్కులకుఁ బ్రతివాక్యములు సెప్పుచు నీయాపదను గణింపక నీప్రాణమును సరకు గొనక నాదుఃఖమును దృణప్రాయముగ నెంచి కొలుకరానికొయ్యయై నాయెదుట నిలువంబడి నన్నేడ్పించుచున్నాఁడు. "హా! లక్ష్మణా! రావోయి! బాధపడుచున్నది నేనే" అని యింకొకసారి నాథా! గట్టిగ కేక వేయరాదా? అయ్యయ్యో! నావెఱ్ఱియే కానియా కేక కూడ మారీచునిదే యని నిశ్చయపఱిచి యీతఁడు మఱింత కదలఁడు. నాథా! అరువ వలదు. నీగొంతుక నెచ్చును. నాయనా! లక్ష్మణా! అన్నా! తండ్రీ! సౌమిత్రీ! నిన్ను బతిమాలుకొందును. నీపాదములపైఁ బడెదను. నమస్కారము. నన్ను రక్షింపుము.

లక్ష్మ—పాపము శాంతించునుగాక!

సీత—నాపాపము రామచంద్రదర్శనమునఁగాని శాంతింపదు. పొమ్మ. పుణ్యముఁ గట్టుకొనుముఁ నానాథు నిటకుఁ దెమ్ము. రక్షింపుము. కూఁతవ్రేటుదూరములో నానాథుఁ డున్నాఁడు. ఒక్కయఱగడియలోఁ దిరిగి యామహానుభావునితో వచ్చెదవు. నాకింతలో నేయాపదయు రాదు నాయనా! ఊఁ!

లక్ష్మ—అమ్మా! రాక్షసులకూఁతవ్రేటుదూరము మనుజులకుసామాన్యదూరమా? దూరమున నుండుటచేతనే శ్రీరామభద్రుఁ డింక రాకున్నాఁడు. ఈసరికి వచ్చుచునేయుండును? ఇఁకఁగొన్నినిమేషములు శాంతి వహించినయెడల మహాత్ముఁ డగు శ్రీరామమూర్తిని దర్శించి కృతార్థుల మగుదుము.

సీత—నీ విచ్చట నుండ నేను నానాథుని సందర్శింపగలనా? ఆమహాను
భావుని సెలవు లేదని సందేహించుచుంటిని గాని లేకున్న నీసరి
కట్టినాదము వచ్చిన చొప్పు ననుసరించి పోయి నానాథుని
గాంచియుండక పోవుదునా?

లక్ష్మ—భర్తయాజ్ఞను నివ్వారిముల్లంతయైన మీరుటకు భర్త విపత్తున
నున్నాఁడని నిశ్చయముగ నమ్మినమీరే యింత సందేహించు
చుండఁ గష్టలేశమైన లేదనుదృఢాధ్యవసాయము గలుగు నేను
బరదైవ మనినమ్మికొల్చుచున్న యామహాప్రభుఁడు మి మ్మిచ్చోఁ
గనిపెట్టుకొనియుండు మని నాకిచ్చిన యాజ్ఞను మీఱుట కెంత
సందేహించుచుంటినో స్వానుభవమువలనఁ దల్లీ! గ్రహింతురు
గాక!

సీత—పోనిమ్ము. మఱియొకమాట చెప్పెదను. మొదట న న్నిక్కడ
నుండుమని నానాథుఁడు నాకాజ్ఞ యిచ్చెను. ని న్నిక్కడఁ గని
పెట్టి యుండుమని నీయన్నగారు నీ కాజ్ఞ నొసఁగెను. తరువాత
„హా! సీతా!,, యని పిలిచెను. ఆహ్వానమున కభిప్రాయము
రమ్మనుటయే కద! „హా! లక్ష్మణా!,, యని నిన్నుఁ బిలిచెను.
నిన్నుఁగూడ రమ్మని యాక్రోశించినాఁడు. ఉండు మన్నప్పు
డుంటిమి. రమ్మనెను గానఁ బోయెదము. ఇప్పుడు పోకున్న గు
ర్వాజ్ఞోల్లంఘన మగును. కావున మనమిద్దరముగూడ నామహా
ప్రభుని సేవింతము రమ్ము నాయనా! సందేహింపకుము.

లక్ష్మ—(మాటలాడకుండును.)

సీత—ఏమి మాటలాడకున్నావు? నీవు శ్రీరామ సాన్నిధ్యమునకు
వచ్చుట కిష్టపడనివాఁడ వగునెడల నన్నుఁ బోనిమ్ము.

లక్ష్మ—తల్లీ! నమస్కారము. క్షమియింపుము.

సీత—ఏల?

లక్ష్మ—ఇచ్చటనే నిమ్ముఁ గనిపెట్టియుండు మని యన్నగారియాజ్ఞ తల్లీ! అనుగ్రహింపుము. క్షమియింపుము.

సీత—ఆఁ, ఆఁ! నన్నుఁ బోనీయవా? నాకేమి కారాబంధమా? నాకాళ్లకు సంకెలలా? నేను నీయధీననై యుండవలసినదా? నీవు నాకేమి ప్రభుఁడవా? ఆజ్ఞ నొసఁగువాఁడవా? నన్నుఁ గదలనీయవా? నాపెనిమిటిని నేను జూతునన్న నీప్రతిబంధ మేల? నడుమ నీ వెవఁడవు? భార్యాభర్తల నెడబాపఁదలఁచియే వచ్చితివా? అన్నగారి యవసానకాలమున గొంతుకలో గరిటెఁడుగోదావరీతీర్థమైనఁ బోయకుండఁ జంపఁదలఁచియే వచ్చితివా? ఛీ! దురాత్మా నీవు భరతునిప్రోత్సాహమున నిటకుమాబాధలను జూచి సంతసించుటకు నానాథుని మ్రింగివేయుట కుమృత్యుస్వరూపమవై వచ్చితివి. అంతఃపురమును వదలుకొంటిమే—ఊరిని వదలుకొంటిమే—రాజ్యమును విడిచితిమే—సర్వసుఖముల, బరిత్యజించి యరణ్యములకు వచ్చితిమే—ఇంక విడువవలసినవి మాయొద్దఁ బ్రాణములు తప్ప మఱి యేమియు లేవే—ఏల మమ్మింత బాధించెదవు? శ్రీరామభద్రుఁడు నీ కేమిద్రోహ మొనర్చినాఁడు? హరిహరీ! హరిహరీ! ఎంత కఠినుఁడవు! ఎంత పాపాత్ముఁడవు! ఎంత ద్రోహచింతఁగలవాఁడవు! ఎంత బంధుఘాతుకుఁడవు!

లక్ష్మ—(తనలో) రామరామరామా! ఎట్టికఠినవాక్యములు నిర్దోషుఁడనై వినుచున్నాను!

సీ. మరణ మొందఁగ నున్న ♦ మనతండ్రి నెడఁబాసి
తల్లులవిడనాఁడి ♦ తరుణి విడచి
గురువులఁ ద్యజియించి ♦ పురవాసమును వీడి
తనుసౌఖ్యమును రోసి ♦ తండ్రి వీవె

ధరణినాథుఁడ వీవె ♦ దైవంబ వీవె నా
తల్లి వీవనుచు ని ♦ ద్రయును భుక్తి
మాని మీపాదప ♦ ద్మధ్యానమే తార
కోపాయముగ నెంచి ♦ యోపినట్లు
మిమ్ముఁ గొల్చి దినంబుల ♦ మీఁగుచుంటి
నిందులకు నామదియె సాక్షి ♦ యిచటిమృగచ
యంబె సాక్షి యర్కుఁడె సాక్షి ♦ యవని సాక్షి
మిన్నె సాక్షి యన్నిఁటికంటె ♦ మీరె సాక్షి.

సీ. ఈరీతి నేనుండ ♦ నిప్పుడు మాతల్లి
జానకి—ఆమెదో ♦ సముసఁ గాదు;
నాకర్మకలనచే ♦ నన్నాడుమాటలు
మదిదహించుచునుండె ♦ మొదటినుండి
గురువులచేనైన ♦ గోరంతమాటఁ బ
డనివాఁడఁ; బ్రారబ్ధ ♦ మునను దీవ్ర
కోపుఁడ నోపలే ♦ కేఁటెక్కు నానోట
వడి జాఱునో యని ♦ జడియుచుంటి;
నింతకంటెఁ దెగినసరె ♦ యెదురుపలుక
కోర్చునట్లు నీశాంతిలో ♦ నొక్కయణువు
దాసునకుఁ గటాక్షించి తొం ♦ దరనుబడిలి
ననుదురుక్తి లేకుండ స ♦ న్మనుప వయ్యా!

(ప్రకాశముగ): అమ్మా! అమ్మా! నేను దుర్మార్గుఁడను గాను. మీపాదకైంకర్యతత్పరుఁడను. నన్ను స్వప్నమందైన సందేహింపఁదగదు. అనవసర మగునాందోళనమును మాని యిఁకఁ గొంచెము సేపు తాళినయెడల మనకు జగదానందమూర్తి యగుశ్రీరామమూర్తిదర్శన మగును.

సీత—ఆఁ! ఆఁ! ఏమనుచుంటివి? నాది యనవసర మగునాందోళనమా? నీది యవసరమగు శాంతతయా? ఏమి? ఏమి? మగఁడు మహావిపత్తులోఁ బడి మొఱ్ఱో సీతా యని మొఱవెట్ట నే నలజడిపడుట యనవసరమా? అన్న గారలో లక్ష్మణా! యని యఱవ నఱచి యఱచి యతఁడే చల్లారు నని మనసువలుసంతయైన చలింపకుండుట యవసరమా? అయ్యయ్యో! అయ్యయ్యో! తల్లిదండ్రులను వదలి ధరణీరాజ్యమును వదలి, దండకాటవియందుఁ గూడవచ్చినభార్యయైన దాపున నుండుయోగము లేక, రాక్షసునిచే దూరమున బాధింపఁబడుచు మహార్తుఁడై యొంటరియై దిక్కులేక యాక్రోశించునాథుని, దయగలవాఁడ వని—తమ్ముఁడ వని—కూడ వచ్చినవాఁడ వని—ఏమేమో యుపచారములు సేయుచున్నవాఁడ వని—యున్నదిక్కు మగవాఁడవైననీ వొక్కఁడవే యనిపోయి కాపాడుమని నేను నెత్తిఁ గొట్టుకొని యేడ్చుచు నిన్నుఁ బ్రార్థించుట యసహజమా? నాప్రార్థనల మన్నింపక నాయేడుపులకుఁ జెడచెవి పెట్టి నేఁ జెప్పుప్రతివాక్యమునకుఁ బూర్వపక్షము సేయుచు నేవేవో చిత్రకల్పనాకథల నుపన్యసించుచు ఘనతని నాతఁడే కాపాడుకొనును. ఒకనిచేఁ గీడ నన పరము వచ్చినప్పుడే వచ్చును; తొందరలే,, దనినాకు నీతిబోధనములు సేయుచుఁ జెక్కుచెదరక కన్నైన చిట్లించక, మొగమైన ముడువక, యింత యులుకైన లేక, నిశ్శంకుఁడవై, నిష్కళంకుఁడవై, నిరుపద్రవుఁడవై నిశ్చలుఁడవై యాహా! ఆహా! భ్రాతమహాకష్టమును విని పాషాణపాంచాలికవలె నుండుట సహజమా? చాలు, చాలు! ఇఁక నీప్రేమము తెలిసినది. నీయోగ్యత తెలిసినది. నీబుద్ధి తెలిసినది. నిన్ను నమ్మి

రాదు. నీవు ప్రచ్ఛన్నకిరాతుఁడవు. భ్రాతృపరిపంథివి. నరరూపరాక్షసుఁడవు. సదానుగత కాలస్వరూపుఁడవు.

లక్ష్మ—(నమస్కరించి)

గీ. ఎట్టిపాపంబు నిన్నైన ♦ నేనెఱుఁగఁ
దల్లివగు నీపదారవిం ♦ దములతోడు
తత్త్వ గురు వసిష్ఠ ఋషిపా ♦ దములతోను
తండ్రి యగు రామభద్రుపా ♦ దములతోడు.

సీత—అబ్బ! ప్రమాణమును జేసితివా? ఏదీ! ఇప్పుడు నీవనిన మాటలు తలయెత్తి నామొగము వంకఁ దేఱి పాఱఁజూచి యింకొకసారి యనుము.

లక్ష్మ—(తలవంచుకొని)సదా మీ పాదాంగుష్ఠాగ్రదర్శనమునఁ గృతార్థుఁడనైననేనెన్నఁడయినఁ దలయెత్తి మీమొగమువంకఁజూచితినా? ఇప్పుడు మాత్రమేల చూతును?

సీత—అదిగో! దొంగతనము. అదిగో! మహామాయ! అదియే టక్కరితనము. అదియే మహేంద్రజాల విద్యానైపుణి. నుదురుపైకెత్తి మాటలాడ హృదయములోని కుళ్లు బయటబడును. నిష్కల్మష హృదయుఁడవు. ద్రోహచింత లేని వాఁడవు నైనయెడల నావంకఁజూచి మాటలాడుము. తప్పు లేని వాఁడవై యుండినయెడల నీతలవంపు లేల? దారుణ చింత లేని వాఁడవగు నెడలనీదాఁగుడుమూఁత లేల? ద్రోహబుద్ధి లేని వాఁడవైనయెడలనీదొంగభయమేల? ఈ మోస మేల? ఈ కను కట్టు లేల? ఈముఖ లాఘవము లేల? నిర్భీతిగ నిరంకుశముగ నిస్సందేహముగ నావంకఁ జూచి మాటలాడుము. నిన్ను నమ్మెదను.

లక్ష్మ—నన్నుఁ గూర్చి మీ రేమనుకొన్న సరియె కాని నేను మీ మొగము వంకఁ జూచి మాటలాడను.

**సీత**—హరిహరీ! నీ నోటనే భగవంతుఁడనిపించినాఁడు. నే నేమనుకొని న సరియె కాదా? నే నిట్టులిదివఱకనుమానించితిని. ఇప్పుడు ప్రత్యక్షముగ ననుచుంటిని. రాముఁడక్కడ రాక్షసుని చేఁ గడ తేఱు వఱకు నీ విక్కడ లేని పోని వాక్యము లాడుచు నాల స్యము చేసితివి. ఆతఁడిసరికి కస్తమించు నను ధైర్యము గలవాఁడ వగుట వలన నిఁక బెట్టు బిగిసినన్నుఁ గూర్చి నీవేమనుకొనిన సరి యే యని గర్వాలాపమాడితివి. రామచంద్రుని యనంతరము నన్నుఁ గట్టుకొని నాతోఁ గులుక వలయు నను నాశ నీకుఁ గ లిగినది. నీవు నన్నంట యత్నించు సరికిఁ గాదాది శిరః పర్యంత మొక్కమాఱుగ భగ్గున మండి పోవుదువు.

**లక్ష్మ**—(తనలో) రామ రామ రామా! (ప్రకాశము) ఇఁకఁ జావవలసిన దే. వినఁ దగిన మాటలు పూర్తియైనవి. నిందలకవధి కలిగినది. రామ చంద్ర ప్రభూ! నే నిక్కడ చావనా? నీ యొద్దకు రా నా? రెండును నీ యాజ్ఞా నిరోధక క్రియలే. ఏది చేయుదును. మహాప్రభూ! నీయాజ్ఞకు వ్యతిరేకముగ నడువ వలసి వచ్చిన యీ నిర్భాగ్యుని మొగము నీ కగపఱుచుట కంటె నిక్కడనే మరణమందిన మంచిది. (ఆలోచించి) కాని నేను మరణించిన ని మేషము మొదలు శ్రీరామభద్రుఁడచ్చటకు వచ్చు లోపుగ మాతల్లి యగు సీతా మహాదేవి కే రాక్షసుల వలననైన నే మైన ప్రమాదము సంభవించునెడల రామ చంద్రుఁడు వచ్చి మృతుఁడ నగు నన్నుఁ జూచి నోపద్రవయగు సీతను గని, లేక, కాన లేక మహా వ్యాకుల పరవశుఁడై ప్రాణములు త్యజియిం చు నేమో? ఈ యవ్యక్తుని దుశ్చేష్ట వలన నా యవతారము నకస్తమయము సిద్ధించు నేమో? అట్టిచో నిక్ష్వాకు కుల దీప మార్పిన పాపాత్ముఁడ నగుదును. ఒకవేళ నా మహానుభావుఁడు ధైర్య స్థైర్య పాటవమున జీవములు శరీరమున నిలుపు కొనిన

నేకాకినై యెంత శ్రమపడునో? ఆ ప్రభుని యుపచారములకు నే నుండినఁ గొంత మంచిది కాదా? ఆయనకు లాభము మాట యటుంచుము. ఆ దివ్యమంగళ విగ్రహారాధనము లేని యీ తనువునకు సఫలత యెక్కడిది? అదిగాక సర్వరాక్షస సంహారము తలపెట్టినాఁడు. ధనుస్సునైన మోయుటకు నేనుండవలదా? కాన నాత్మ హత్య కూడదని తోఁచుచున్నది. ఇఁక శ్రీరామ చంద్రుని యొద్దకే పోవలయును. తల్లి చే బలవంత పెట్టఁబడుటచే నిల్లు వచ్చితి ననుటలోఁ గొంత కారణాభాసమైన నున్నది. ఈ యాభాసల కేమి? గుర్వాజ్ఞోల్లంఘన మహా పాపము నా నెత్తిపైఁ బడినది.

హా! రామచంద్రా!

గీ. గొంతుఁ గోసి కొనం దగు ♦ నంత చింత
గలుగు కతన నీ యాజ్ఞను ♦ గడచి నాఁడ
నిదె మొదటిది కడపటిది ♦ యిదిగో! చెంప
లిట్లు కొట్టుకొంటిని క్షమి ♦ యింపుమయ్య!

ంత—నీకు నాపై నింక నాస పోలేదా? నీ విక్కడ నుండి యింకను బోవా? నీవిప్పుడు పోని యెడల నేను గొంతుకకురి పోసి కొని చత్తును.

ంక్ష్మ—అమ్మా! ఇప్పుడే పోయెదను. మీకేమియుఁ గీడు యత్నింపవలదు. "లక్ష్మణుని మనమెడఁబాయుదుమా?,, యని మహానురాగమునఁ గొలఁది దినముల క్రిందట మా యన్న గారి తో మీరను సరికి లక్ష్మణుని నే నెడఁబాయ వచ్చు,నని యాముహూర్తమ్మఁడ నెను. అది నెఱవేఱెను. లక్ష్మణుని నీ వెడఁబాయవచ్చు, నని తిరుగ ననెను. అది యిప్పుడు నెఱవేఱుచున్నది. నిన్ను నే నెడఁబాయ వచ్చు నని కూడ నాసత్య వాచా ధురీణుఁడు పలికి

నాఁడు. అది కూడ సంభవింపక తప్పదు. వీరాలు శ్రీరామ చంద్రుని తో విశ్లేషము నొందు మని దైవము మీ ాఁడు బంతుల మీా నుదుట లిఖించి యుండ నెవఁడేమి సేయఁ గలఁడు! కాని తల్లీ! జాగ్రత్తగ నుండుము. ఎవఁడైన దుష్ట రాక్షసుఁడు మిమ్ము మోస పుచ్చఁ దరిఁ జేర నిదిగో! ఈ గీత దాఁటి రాకుఁడుం-

సీ. నీ యింటి కోడలై ♦ నిర్మల గుణ రాశి
యగు సీతఁ గని పెట్టు ♦ మర్క దేవ!
అల్లుఁడు మారీచ ♦ హరణార్థమై యేగెఁ
గూఁతును గాపాడు ♦ కొనుము ధరణి!
చల్లని దీవనల్ ♦ సాధ్విపైఁ గురియ రే
శ్రీ శతానంద వ ♦ సిష్ఠులార!
కష్టముల్ దొలఁగించి ♦ కావరే దయను వై
దేహిని రఘుకుల ♦ దేవు లార!

పంచభూతము లార! యీా ♦ పరమసాధ్వి
పుణ్య మూర్తిని సుకుమారిఁ ♦ బ్రోవ రయ్య!
జనక దుహితకు దశరథా! ♦ వనిపు స్నుషకు
రాక్ష సాంతక! శ్రీరామ ♦ రక్ష యీా వె.

తల్లీ! జానకీ!

గీ. ఏమి పాపమో కాని నే ♦ నేగు వెనుక
మీాకుపద్రవ మగునని ♦ నాకుఁ దోఁచు
నైన వినియోగ మేమి? నే ♦ నాఁగ లేక
యేప్తుఁ గర్మము ముకు ద్రాట ♦ నీడ్చు చుండె.

గీ. ఎఱిఁగి యుండిన ఫలమేమి? ♦ యెఱుఁగ కున్న
నష్టమే మగు? మన ప్రయ ♦ త్నములు సున్న;

ప్రతిభ లెండమాన్పులగు ♦ ప్రారబ్ధ కర్మ
గతిని బట్టి తుదకుఁ గార్య ♦ కలన జరుగు.

అమ్మా! సెలవు తీసికొందును. దయ యుంచుము. (నమస్కరించి) తిరుగ దక్షిన మెన్నటికో? తల్లీ! భద్రము; భద్రము. ఈ యరణ్యము మాయా శీల బహుభుజ పరాక్రమాన్వితాసుర ప్రకాండ మయమై యున్నది. జాగ్రత్త!

(లక్ష్మణుఁడు నిష్క్రమించును.)

సీత—లక్ష్మణుఁడిట్లు మాటలాడ నేల? మాయా వేష దుష్టరాక్షస కృతోపద్రవ మగునని యాతనికి నిశ్చయమేమో!

(మాయా సన్యాసి వేషియగు రావణుఁడు ప్రవేశించును.)

రావ—(తనలో) ఆహా!

గీ. పృథు మహోల్కా సహస్రముల్ ♦ వెలిఁగి నట్లు
లోక మాఱు శంపా కోటు ♦ లొలసి నట్లు
సీత కనఁబడి దృష్టిని ♦ జెదరఁ జేసె
హా! తపస్వినీ మణి తేజ ♦ మతి తరంబు.

గీ. అర్క వైశ్వానరుల జుట్టు ♦ లంది యాస
డించి యొకనితో నొకని డీ♦ డిక్కి కొట్టఁ
బైకి తేగు నుల్కల తెప్ప ♦ వ్రాల్చు నట్టి
కనుల కిప్పుడు మిఱుమిట్లు ♦ గలిగె నహహా!

ఇట్లుంటకుఁ గారణ మీయశస్విని సౌందర్య మహిమమో, మహా పాతివ్రత్య గరిమమో, నా హానిప్రద దుష్ట ప్రయత్న మాహాత్మ్యమో, లేక యీ మూఁడునో! రావణుఁడొకతె మగనాలి తనమిదివఱకు గణించి నాఁడా? ఇప్పుడేల జంకవలయును!

గీ. పురుషులందు సత్వ గుణము ♦ పోలెఁ బడఁతు
లందు మగనాలి తనముండు ♦ నడఁగి; తగిన

యవసరము రాఁగ రెండు ది♦గంత ములకుఁ
బరుగు వారు వెనుకకును♦ దిరిగి కనక.

ఈ ప్రయత్నము హాని ప్రదమని నా నోటి నుండియే యాదృచ్ఛికముగ బయలు వెడలినది.

గీ. ఒడలి పైని మంద మారుత♦ మొలయుమనసు
చల్లఁబడి శాంతి నొందును♦ సంతతోష్ణ
తా సమన్వితానిలము గా♦ త్రమునఁ దాఁకఁ
జిత్తము తపించి బాధను♦ జెందుఁ గాదె?

గీ॥ మల్లికా చందనాది సా♦ మగ్రి తనువు
నంట మెలమెల్ల స్త్రీవాంఛ♦ యంకురించు
భస్మ రుద్రాక్ష ముఖ వస్తు♦ పాళి చేత
శివ సమారాధనాసక్తి♦ చేరుమదిని.

గీ. అసిత వస్త్ర ధారణముచే♦ నదయ యుదయ
మందు; రక్తాంబరాభ్యంచి♦ తాంగ మందుఁ
దీక్ష్ణ కోపంబు జనియించుఁ♦ దెల్ల నైన
వస్త్రముల సత్వ సామగ్రి♦ పరిఢ విల్లు.

గీ. జనుని పై వేషమిట్లు నై♦ జమును ప్రాయి
కముగఁ దాత్కాలికముగ భే♦ దమును జేయు
నిట్టి యస్పృశ్యకాషాయయు♦ నీకమండ
లువు గోడుగు నామదిని మార్చె♦ నవుర యిపుడు.

ఇందుచేతనే కాఁబోలు నీమె మహాపతివ్రత యనియునా ప్రయత్నము దుష్టమనియుఁ దలంచు చుంటిని. శీఘ్రముగ స్వస్వరూపమును ధరింప వలయును గాని యీ మాయావేషము నన్నుఁ గూడ మాయ సేయుచున్నది. అతి శీఘ్రముగ సఫల మనోరథుఁడనై పోవలయును. (ప్రకాశముగ) బాలికామణీ పు

రుషుల కంటె స్త్రీకభ్యాగత పూజాసక్తి యధికముగ నుండుట సహజము. అందులోనలౌకికసౌందర్యసమన్వితవు, పరమోత్తమ నాయిక వైన నీకట్టి పుణ్యగుణము మఱింత యుండవలయును. బ్రహ్మ బంధుఁడనై పరివ్రాజకోత్తముఁడనైన నేను నీ సన్నిధిని నిలువఁబడి యుండ నేమోయుపేక్షఁ జూచెదవేమి?

సీత—ఓ బ్రాహ్మణోత్తమా! క్షమియింపుము. మనసుమిక్కిలి వికలత నొందఁగొంత పరాకున నుంటిని. ఇదిగో! అర్ఘ్య పాద్యములు గైకొనుఁడు.

రావ—(తనలో) మనస్సు వైకల్యముగ నుండుటకుఁ గారణమేమో? నేను గపట సన్యాసి నని యూహించుచున్నదా యేమి? కానీ! ప్రమాదమేమి?(ప్రకాశముగ)అతిథులగు తపశ్శాలురను నిర్లక్ష్యముగ జూచిన కాంతలకెట్టి యవస్థలుసిద్ధించెనో యెఱుఁగుదువా?

సీత—ఎఱుఁగుదును. నాకట్లు భర్తృవిశ్లేషమును గటాక్షింపకుఁడు. సమీపమునకుఁ గారణాంతరమునఁబోయిన భర్తయింక రాకున్నవాఁడని పరిపరి విధములఁ బరితపించు నన్ను నాభర్తతో నేఁడబాటునొందు నట్లు చేయకుఁడు.

రావ—నీభర్త యంటివి. అతఁడు దాశరథి రాముఁడే కదా?

సీత—ఔను మహాత్మా! మీకెట్లు తెలిసెను?

రావ—అతని తమ్ముఁడిక్కడ లేఁడు. అతనితోడనే యున్నాఁడు కాఁబోలు!

సీత—మీరిక్కడకు వచ్చువఱకు నిటనే యుండెను. ఇంతకు ముందే శ్రీరామ సాన్నిధ్యమునకుఁ బంపఁ బడినాఁడు.

రావ—నాకుఁ జెప్పనక్కఱలేదు. నేను మీవృత్తాంతమును బూర్ణముగ నెఱుఁగుదును.

సీత—మహానుభావా! దివ్యదృష్టి వలననా?

రావ—(తనలో) శూర్పనఖ వలన (ప్రకాశముగ) తపస్సంపన్నుల కసాధ్యమేమున్నది? (తనలో) ఆలస్యమగుచున్నది. రాముఁడింతలో వచ్చునేమో శీఘ్రముగఁ దెమల్పవలయును.

సీత—పరివ్రాజక శిఖామణీ! వెనుక జరిగినవే కాకవర్తమానమునదూరమున జరుగుచున్నవియు ముందిక జరుగఁబోవు నట్టివార్తలు గూడ మీరు గ్రహింప శక్తులగుదురు గదా?

రావ—గోల వలె నట్లేల యడుగుచుంటివి?

గీ. జ్ఞాన మీఁత వంటిది ♦ యీఁదఁ జాలు వాఁడు
ముందునకు నిల్వనను వెన్క ♦ నఁడు నీఁదు
జ్ఞానము కుదురవలయును ♦ గానికుదురు
పిదపఁ గాల భేదము లేదు ♦ ముదితమిన్న!

సీత—(తనలో) జ్ఞానమును గూర్చి యేమో పరిహాసముగ మాటలాడుటచే నీతఁడు లఘుచిత్తుఁడని తోఁచుచున్నది. కానియింకఁ జూచెదను. (ప్రకాశముగ) అయ్యా! నేనొక్క యంశమడిగెదను. దానిని మీదివ్యజ్ఞానమునఁ దెలిసి చెప్పెదరా?

రావ—కాంతా! మమ్ము వేఱె యడుగవలయునా? నీ భర్తమారీచునిచే నేమైన బాధ నొందెనా సుఖముగ నెప్పుడిక్కడకుఁ దమ్మునితో వచ్చునను సంశయము దెలియ నెంచితివి. అంతయేకదా!

సీత—పుణ్యాత్మా! నాకు వారిక్షేమము తెలియక పోవుటకంటె విచారమేమున్నది?

రావ—అంతకంటె విచారము లేదని యెట్లుచెప్పఁగలవు? ఉన్ననుండఁగూడదా?

సీత—అదేమి యతి శిఖామణీ! అట్లుసెలవిచ్చుచున్నారు? నాభర్త యిప్పుడు నిరుపద్రవుఁడై యుండెను గదా? సుఖముగ నిటకువ

చ్చునా? దయఁగలిగి యీ పీటపై సావకాశముగఁ గూర్చుండి సావధానుఁడవై యాలోచించి చెప్పుము.

రావ—అదియొక్క యుపద్రవమే కాదు.

సీత—అయ్యయ్యో! అయ్యయ్యో! అది యొక్క యుపద్రవమే కాద నుచున్నారు. అదియేది? ఏమైనఁ గొంత యైన బాధ గలిగి యున్నాఁడా?

రావ—అది యొక లెక్క గాదు. దానిని నీవు పరిగణింప వలదు.

సీత—అయ్యయ్యో! అట్లాన తీయకుఁడు. నా కాంతుని యాపద యణు మాత్రమైనను నాకుఁ బర్వత సంకాశమైయుండును. నాయనా! అది యేదియో సెలవిండు.

రావ—(తనలో) అసత్య మాడ వలయును. ఈ దిక్కుమాలిన వేష మూని యుండుటచే నందును గుఱించి సంకోచించునంతటిచేఁత గానితనము సంభవించినది.

గీ. పైకి మాయకూనిన ♦ కావి పాత యిట్లు
సత్య కథనము నకు నన్ను ♦ జంకఁ జేయ
నిద్ధ తాపసులందుల ♦ కెంత యేడ్చె
దరో? యభాగ్యులై యెటు మనె ♦ దరో? హర హర!

(ప్రకాశముగ) సీతా! నీకుఁ బ్రస్తుతమందు విచార మక్కఱ లేదు. మారీచుని గదాఘాతమున నీభర్త యిప్పుడు మూర్ఛా గతుఁడై యున్నాఁడు.

సీత—అయ్యో! రామభద్రా! అయ్యో! నాథా! చతుర్దశ సహస్రా సుర సమన్వితఖరదూషణుల నెప్పపాటుకాలములోఁ జంపిన మహావీరుఁడు, సర్వరాక్షస మారణయజ్ఞదీక్షాబద్ధకంకణుఁడై న సత్యవాచాధురీణుఁడు, నేఁడిట్లు తుచ్ఛమాయానిశాచర గదా ఘాతమున మూర్ఛనొందినాఁడా? అయ్యో! శ్రీరామ చంద్రా! నన్ను—

రావ—ఆఁగుము. వృథగఁ దొందరయేల? (తనలో) దూరదృష్టి శూన్యముగఁ బ్రశంసించితి నేమో? ఇట్లు రోదనము సేయుచు నీమె యిటఁగాలయాపనము సేయు నెడల రాముఁడే వచ్చును. అంత నేఁజేయునదేది? (ప్రకాశముగ) కాంతామణీ! విచారమువలదు. లక్ష్మణుఁడాతనిని సేదఁదేర్చుచున్నాఁడు. కొలఁదిసేపటిలో సంపూర్ణ ప్రజ్ఞుఁడగును.

సీత—పోనిండు. మహాత్మా! మీ యాశీర్వచనము వృథపోదు. ఆట్టి యిన శ్రీఘుమిటకు వచ్చునా?

రావ—నీవిచ్చట లేనిసమయమున నాతఁడిచ్చటకు వచ్చునని నానమ్మకము.

సీత—అదియేమో నాకుఁ దెలియకున్నది. కటాక్షించి యనుజ్ఞయిండు. సఁగుఁడు.

రావ—ఉన్న పుట్టిమునుకే యది. రాఁదలఁచినయశనిపాతమే యది! అందుకొఱకే నేనిచ్చటకు వచ్చితిని.

సీత—నా కేమియు బోధపడ లేదు. అదియేమోయని నాకు దేహము కంపమెత్తుచున్నది. నాభర్త కింతకంటె నాపద రాదుగద!

రావ—నీకు రాఁగ నట్టి యాపద నీభర్తకుఁ గాదా? ఇప్పటి వఱకుఁ బుణ్య వశమునఁ గలిసి యుంటిరి కాని యిఁక ముందట్లుండు రని నేను నమ్మను.

సీత—అది యేమి? అదేమి?

రావ—ఏమియో చెప్పుటకే వచ్చితిని గాదా? నీ యందలి మహానురాగమున వచ్చితిని. నీవు మహాపదలలోఁ బడి శ్రమ పడకుండఁ గాపాడ వచ్చితిని. నిన్ననురూప భర్తృసమన్వితను జేయ వచ్చితిని. నీకష్టములఁ జూడ లేక నిన్ను సుఖపెట్టఁ దలఁచి వచ్చితిని.

సీత—మహానుభావా! అనుగ్రహింపఁ బడితిని. ఇట దిక్కు లేక యే కాకినినై యుంటిని గటాక్షింపుము.

రావ—నేను రాఁగ నీకేకాకినీత్వబాధ లేదు. కటాక్షించుటకై వచ్చితిని. దేవ గంధర్వ యక్ష పిశాచ మారకుఁడును, బహు యజ్ఞభంజనుఁడును రాక్షస సార్వభౌముఁడును, పరమమాయాస్వభావుఁడును నగు రావణు నెఱుఁగుదువు గదా?

సీత—వినికి వలన—

రావ—వినికి వలన వెనుక నాతని నెఱుఁగుదువు కాని యొక్కపది విఘడియలలోఁ దద్దశగ్రీవ వింశతిభుజ సమాక్రాంత ప్రచండ స్వరూపమును జూచుటచే నెఱుఁగఁ దలఁచి యున్నావు.

సీత—అదేమి? ఆతఁడు నాయొద్ద కేల రాఁ దలఁచెను?

రావ—రాదలఁచినాఁడు కాదు. వచ్చియే యున్నాఁడు. ఈ సమీపముననే తగు సమయమునకై పొంచి యున్నాఁడు.

సీత—వచ్చియే యున్నాఁడా? పొంచి యున్నాఁడా? ఏల? మహాత్మా! ఏల?

రావ—ఎందు కొఱకని చెప్పఁ గలను? నా నోరు రాదు.

సీత—నన్ను వధించునా?

రావ—ఇంత దివ్య మంగళ విగ్రహవై నవనవప్రాయమునఁ బరమ శోభాన్వితవై పరిఢవిల్లుచు విరాగులకు నైన రాగమొదవఁ జేయఁ జాలి యున్న నిన్ను వృథగ వధించునా?

సీత—అయ్యయ్యో! అపహరించునా?

రావ—మానునా?

సీత—అలాగా? అయ్యయ్యో! పుణ్య పురుషా! తపశ్శీలా! నేను నీకు నమస్కరించు చున్నాను. నన్ని మహాపదనుండి యెట్లు దరిఁ జేర్చెదవో? తండ్రీ! మాయ లేడిని దెమ్మని బలవంతముగ

భర్తను బాపినాను. పరమ సుగుణ రాశి యైన మండోదరిని బలా దిట్టి గెంటినాను. నాకు దిక్కెవ్వరును లేరు. తపస్సంపన్నుఁడవైన నిన్నుఁ జూడ నా తండ్రినిజూచి నట్లున్నది. కటాక్షింపుము. దశగ్రీవుని బాధ నాకు లేకుండునట్లనుగ్రహింపుము.

రావ—ఇట్లు నేను నీసన్నిధినుండఁగ నీకు భయము లేదు.

సీత—ఇఁకఁ గావలసిన దేమి?

రావ—నారూపు నాతఁడు మాపునేమో? నాభార్యల నెందఱినో యాతఁడపహరింపఁగ నేను గాంతాసక్తిచే నిట్టి విరాగినైతిని.

సీత—నాకీ రాక్షస బాధ లేకుండ నెట్లు కటాక్షింతురో సెలవిచ్చి నా యాందోళనమును బాపఁ గోరెదను.

రావ—నీవు దశగ్రీవుని కంటఁ బడిన వెనుక నిన్ను ఫాలాక్షుఁడు రక్షింపలేఁడు. ఈ లోపుననే నీవు.

సీత—నాయనా! నన్నేమి చేయుమంటిరి?

రావ—నా సాహాయ్యము లేనిదే నీవొక్కతెవేమి సేయఁ గలవు? నీవు గట్టిగ మాటలాడకుండఁ బాద విన్యాసమైన గట్టిగఁగానీక నా వెంట వచ్చిన యెడల—

సీత—నేను నదియేగతి యని యెంచు చున్నాను. నన్నీ చెట్లమాటున నుండియు నీపాదల చాటున నుండియుఁ దీసి కొనిపోయి భర్తతోఁ గలిపెదరా?

రావ—నీకు భర్తృసమావేశము చేయుటకేకదా యింత ప్రయత్నము?

సీత—అటులైన శీఘ్రముగఁ బోవుదము. (సీత గిరి దాఁటుచున్నది)

రావ—(తనలో) లక్ష్మణుఁడు గాఁబోలు గీఁచిన యీగీత నీమె బుద్ధిపూర్వకముగ దాఁటుటకీ పాట్లు పడవలసి వచ్చెను.

గీ. మునులఁ జంపించి తన్మాంస ♦ ములను వేఁట
కుక్కలకును బెట్టించు న ♦ కుంఠ తేజుఁ
డింక నిర్భాగ్య తాపస ♦ కృపణ వేష
వర్జనము సేసి స్వస్వరూ ♦ పమును దాల్చు.
(ప్రకాశముగ)

సీతా! ఏవైపునుండి దశకంధరుఁడు వచ్చునో యని నిష్ప్రమాదవై యి టునిటుఁ జూచుచుండుము.

(సీత, వెనుకవైపునఁ జూడఁగ నాత్మ స్వరూపమును దాల్చి యెదుట నిలువఁబడి సీతను గేశములచే గ్రహించుచున్నాఁడు.)

రావ—(తనలో) ఈమెకనంగీకారముగ నీమె తనువును నే స్పృశింపఁ గూడదు. కావున శిరోజముల గ్రహించినాఁడ.

సీత—(తనలో) అమ్మయ్యో! అమ్మయ్యో! దశ శిరస్కుఁడగు రావణ హతకుఁడు వీఁడే కాఁబోలును. అయ్యయ్యో! ఇఁకనేమున్నది? ఇఁకనాకునాథుఁడగు శ్రీరామచంద్రుని దివ్యదర్శనమీజన్మమున నింతేనా? ఎంతపాపాత్మురాలను! ఎంతనిర్భాగ్యురాలను! ఆహా! ఆహా! నాథుని నేనెడబాయుటయే కాక యీరాక్షసాధమునిచే తిలోఁ గూడఁ బడితినా? ఎంత యుపద్రవమయ్యెను! హా! రామ చంద్రా!

(మూర్ఛనొందును.)

రావ—సీతా! ఊటుడిల్లుము.

సీత—(తెలివినొంది) రాక్షసేశ్వరా! నీకిదియేటిపని? పవిత్రమైన బ్రహ్మ వంశమునఁ బుట్టిన వాఁడవు; గుణసంపన్నుఁడగు కుబేరుని సోదరుం డవు; వేదవేదాంగ విజ్ఞానధురీణుఁడవు. జాలిమనివ లెనధమాధము నివలె దొంగవలె నానాథుఁడు లేనిసమయమున నీవిట్టు లాచరిం

చుట యేమిపౌరుషము? ఏమిప్రతాపము? చాలు! చాలు! (అటు నిటుజూచి) ఓపరివ్రాజక శిఖామణీ! ఎక్కడనుంటివి? ఓసన్యాసీ!

రావ—భార్యల నపహరించి యనేకుల సన్యాసులుగఁ జేసిన సర్వలోక సంసారినగు నేను సరసనుండనింక 'సన్యాసీ!', యని పిలుతు వేల? ఆసన్యాసియే యిప్పుడిట్టి యపూర్వసుందరీ సహిత సంసారి యయ్యెను. తెలిసినదా? కపటసన్యాసము నీ కొఱకు ధరించి రామునకీరీతిగ సన్యాసమిప్పించి యాతని సంసారమును నామీఁదఁ బడవైచుకొంటిని. మారీచుని మృగరూపమును ధరింపఁ జేసి రాముని నినుఁ బాయఁ జేసితిని. ఆతనిచేత నే 'హా! సీతా! హాలక్ష్మణా!', యని యఱపించి లక్ష్మణుని నిన్నెడబాయఁ జేసితిని. ఇప్పుడు నిన్నిట్లు మోసపుచ్చితిని.

సీత—హారి హారీ! ఎంతపనిఁ జేసితివి! నన్ను హరింపఁ గలిగితి నని [illegible]ం గుచుంటివా? నేను నీకుఁదక్కను. నీవుపుత్త్రసహితముగ నశిం తువు.

రావ—నేను నీతో సంసారముజేసి పుత్త్రసహితముగ సుఖమున వసిం తునో లేకనశింతునో? ఇంటికిఁబోయిన తరువాతఁ జూచుకొంద ము. ఆలస్యమగుచున్నది. అదిగో మన పుష్పకము. పోవుదము రమ్ము.

సీత—హా! రామభద్రా! నమస్కారము. హా! లక్ష్మణా! నీయెడమహా పాపాత్మురాల నైతిని క్షమింపుము. ఓ మునీశ్వరులారా! రా మునకీవార్తఁ జెప్పుఁడు. ఓ మృగపక్షులారా! నేనుబోవుచున్న దారిని రామునకుఁ గనుబఱచుఁడు. భగవతీ! గోదావరీ! నమ స్కారము. రామభద్రా! ఇంక నీ దర్శన మెప్పుడయ్యా? (ఏడ్చుచున్నది.)

(నేపథ్యమున) చీ! దురాత్మా! ఆఁగు! ఆఁగు! ఇదిగో! వచ్చుచున్నాను.

రావ—ఓహో! జటాయువా? రావోయి ముసలిపక్షీ! చత్తువుకాని రావోయి.

(నేపథ్యమున) ఇదిగో! ఎదురుగ వచ్చుచున్నాను.

రావ—ఇదిగో! వెళ్లుచున్నాను.

(నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.

శ్రీ

# వనవాసరాఘవము.

## తృతీయాంకము.

ప్రదేశము జనస్థానము.

ప్రవేశము. అకంపన ధూమ్రాక్షులు.

అకం—ఓహోహో! ధూమ్రాక్షుండా! పునర్దర్శనము!

ధూ—నీకు నాకనన్యోన్య పునర్దర్శనమైన విచారము లేదు కాని సీతకు రామునిపునర్దర్శన మగునేమో యని—

అకం—కాకేమి?

ధూ—ఎప్పుడు?

అకం—స్వప్నమందు—

ధూ—స్వప్న మగుట కట్టి పతిని బాసి యామె నిదుర నొందునా?

అకం—మన మనేకపర్యాయములు కాంచితిమి కదా! అట్టిసతిని బాసి రాముఁ డేల నిద్రించినాఁడు?

ధూ—రామునిది మూర్ఛ.

అకం—దాని పేరే నిద్ర. సుఖముచేఁ గలిగినమైమఱపు నిద్ర యందురు. దుఃఖముచేఁ గలిగినది మూర్ఛ యందురు. త్రాగుడెక్కువగుటచేఁ గలిగినయొడలుదెలియమి మైక మందురు. ఈ మూఁడిఁటితత్త్వ మేకమే.

ధూ—నీవు త్రాగుడనిన నాకు నోరూరుచున్నది.

అకం—(పీల్చుట నభినయించి) కమ్మని వాసన గొట్టుచున్నట్లు లేదా? అది యేదో యెఱుఁగుదువా?

ధూ—పక్షంతువైనఁ బచ్చి కుళ్లినదేమో?

అకం—కాదు. రావణాహతుఁడగు జటాయువును రాముఁడు దహనము సేయుచున్నాఁడు.

ధూ—(పిల్చుటఁ నభినయించి) ఔను సుమా? మేలైన వాసన కొట్టుచున్నది. కమురు మఱింత కమ్మదనముగ నున్నదేమి? కాని రాముఁడీపక్షిని దహింపనేల?

అకం—ఉత్తరగతి కొఱకు—చూడుము! అగ్ని పాకరుచి మనకుఁ దెలియక పోవుటచే మునుల పచ్చి మాంసము నిదివఱకారగించితిమి; కాని యిఁక ముందునుండి జడలతోను గడ్డములతోను సమూలముగ నీ మునిముండకొడుకులను బట్టి బ్రదికి యుండఁగనే లేఁత మునుము పాక మెక్కఁగ యుడుగు మాడకుండ నటు నిటు ద్రిప్పుచు గమ గమ లాడు పరిమళము పైకిఁ బ్రాణము లేచి వచ్చు నట్లు కొట్టు వఱకేరుపిడకల నిప్పుపై దోరగ వేయించి కబళించినమొదల మనకు రుచికా మంచి మేలుగ నుండును. మనచే దహింపఁబడుటచేత నాదిర్భాగ్యుల యుత్తరగతికా లోప ముండదు. ఉభయ తారకమగు నీ మహాకార్యమేల చేయఁగూడదు?

ధూ—కాని రామలక్ష్మణులీ యడవియుండఁగ మనకు ఋషి మాంసమెట్లు సంభవించును?

అకం—ఎల్లప్పుడిక్కడఁ గూరుచుండు రనుకొంటివా? రావణుఁడు సీతను హరించి దక్షిణముగఁ బోయినాఁడని జటాయువు చెప్పిన మాటలవలననుండియు, నాశ్రమ మృగములేమి యాటవిక జంతువులేమి కనుల నీరు పెట్టుకొని రామునిముందు దక్షిణ దిఙ్ముఖములై పోవుచు గనుబఱుచు సంజ్ఞల వలన నుండియు రామ

లక్ష్మణులు వేగ దక్షిణాదిశోన్ముఖులై తరలెదరు. వీరి బాధ మనకింక నుండదు.

(నేపథ్యమున) హా! లక్ష్మణా! లక్ష్మణా! ఎచ్చటనున్నావు?

అకం—అదుగో. రాముడు ఎట్టిమతి లేక తిరుగుచున్నాడో! రాముని మొగముచప్పబడినది కాని లక్ష్మణు మొగ మింక భయంకరము గనే యున్నది. పద; పద!

(ఇద్దఱును నిష్క్రమింతురు)

ఇది విష్కంభము.

[ప్రదేశము — జనస్థానసమీపారణ్యభాగము.]

(ప్రవేశము — రాముఁడు)

రాము — లక్ష్మణా! లక్ష్మణా! ఎచ్చట నున్నావు?

లక్ష్మ — (ప్రవేశించి) మహాప్రభూ! వచ్చితిని.

రాము — మహాప్రభూ! యని యేల పిలిచెదవు?

గీ. ప్రభు రమాదేవి మున్నె తా ♦ వదలె నన్ను;
తను మహాలక్ష్మి యైనట్టి ♦ ధర్మపత్ని
యిట్లు లెడఁబాసె; నింక నా ♦ కెట్టి ప్రభుత?
బ్రదికి యుంటిని భువికి భా ♦ రంబు కాఁగ.

వచ్చితి వంటివే? ఎచ్చట నుండి వచ్చితివి?

లక్ష్మ — అయోముఖి యను రాక్షసకన్య మోహావిష్టయై నాపైకి రాఁగ దానికిఁ గర్ణనాసికాచ్ఛేదంబు గావించిన తావునుండి—

రాము —

గీ. మానము శూర్పణఖకు నాసి ♦ కను చెవులను
గోసితిమి; కాని యాతఁడు ♦ గోసి కొనుచు
నేగె నాగాత్రమున సర్ధ ♦ భాగ; మొకని
యపకృతి ద్విగుణమై క ♦ ర్తనంటుఁ బుదకు.

గీ. ఇపుడయోముఖి కీవ్రొన ♦ రించు శిక్షఁ
గనలి తద్భ్రాత మిగులు నా ♦ తనువు సగము
దీసి కొని పోవ నాబాధ ♦ తెల్ల వారు
దాని కపకృతి యైన నా ♦ కౌను సుఖము.

లక్ష్మ — ఆ యిద్దఱు కాంతల కపకారమును జేసిన వాఁడను నేనై యుండవిధినన్నుఁ బ్రదుంచుకొని పోక మీాకు బాధల నిచ్చుచున్నది. నిజముగ మీా బాధలకు నేనే కారణ మైతిని. మహాత్మా!

రా ఘు—తమ్ముఁడా! ఏల?

లక్ష్మ—వైదేహి మాటలను విని మీ సన్నిధికి నేను రాక యుండిన యెడల—.

రాము—అట్టి సంకోచము నీవు మనసునందుంచుకొనిన నాతో డే.

సీ. దాసిమాట వినిన ♦ తల్లిని దూఱనే?
తల్లిమాట వినిన ♦ తండ్రి గారి
నననె? వారి పలుకు ♦ వినిన నన్ దూషించు
కొననె? మారుని యాజ్ఞ ♦ వినిన శూర్ప
ణఖను దిట్టనె? శూర్ప ♦ ణఖ మాట వినిన రా
వణుని దిట్టుదునె? రా ♦ వణుని మాట
వినిన మారీచు దూ ♦ ఱనె? వాని పల్కు న
మ్మకమున వినిన నా ♦ మగువ ననెనె?
ఆమె మాటను వినిన ని ♦ న్ననెనె? తండ్రి!
బాపమనుచు నేడ్చుచునె లో ♦ పలనె కుమిలి
కుళ్ళుచునె ప్రాక్కృతి ఫలంబుఁ ♦ గుడువ వలయు
నొకని ననినఁ బాపమె కాని ♦ యొండు లేదు.

హా! జానకీ!

గీ. పిల్లి నోటను బడు చిల్క ♦ పిల్ల వ్రాలె
వ్యాఘ్ర నఖ ముఖ గత మృగ ♦ బాల వలెను
మర్కటము చేతఁ బడు పూల ♦ మాల వలెను
రావణుని బారి నుంటివా? ♦ ప్రాణ కాంత!

గీ. సరస నేనుండ మఱఁది న్నో ♦ సలను నిల్వ
రాక్షసాంగన మీఁదికి ♦ రాఁగ పాహి
యనుచు నామీఁద వ్రాలిన ♦ యట్టి దాన
వసుర వరుఁడు గొంపోవ నే ♦ మైతి? వకట!

లక్ష్మ—మహాపురుషా! విచారించిన లాభమేమున్నది? ఆశ్వాసిల్లుఁడు.

రామ—లాభమేమి యనుచుంటివా?

గీ. కుక్షిలో వేఁడియావిరి ♦ గుండెఁ గ్రమ్మి
యఁట ఘనీభవించుచు బరు ♦ వగుచుఁ దలకు
నెక్కి గ్రుడ్లు మండఁగ నేడ్వ ♦ నేగు దుఃఖ
మబ్దముజిమి కురిసి మాయ ♦ మైన యట్లు.

గీ. కడుపులోని మంటలు పొగ ♦ గాలి తాఁకి
నీరు, లో నిముడఁగ లేక ♦ నోరు వెంట
వెగసినను గాని శాంతించు ♦ నెట్టు లగ్ని
పర్వతము లేచ్చుచుఁ జింతఁ ♦ బాయు నరుఁడు.

గీ. అంటుకొనిన శతఘ్నిధా ♦ మ్మునక యాఁగు
నెట్లు? కదలఁ బారిన వార్ధి ♦ మొగసి యొచ్చి
పొంగినను గాని శాంతతఁ ♦ బొందు నెట్లు?
లూరటకు రోదనమె యొక ♦ కారణంబు.

హా జానకీ! అవిగో! పర్ణశాలలో నీవు పెంచిన మృగములు మయూరములు నన్ను వదలకుండఁ గూడ వచ్చుచున్నవి.

గీ. నిన్నుఁ జూపింతు నని నమ్మి ♦ నన్ను వెంబ
డించె నమ్మా యనుచు విల ♦ పించు చకట!
ఎట్లు భరియింతు వానికి ♦ నేమి చెప్ప
మంటి? వేమి చెప్పెదవు నా ♦ కయ్యొ? సీత!

గీ. ప్రతిభ లేని తిర్యగ్జంతు ♦ పక్షులల్ప
పరిచయంబున నినుఁ బాసి ♦ బాధ పడఁగ
సప్తపాదాల మొదలు నిక ♦ క్షణము నైన
వదలి యుండని నన్నెట్లు ♦ బ్రదుకు మంటి?

హా జానకీ! హా సుగుణ రా! హా సీతా!

గీ. స్వర్ణ వర్ణవు నీవు; నా ♦ చాయ నలుపు;
నేను బుట్టితి; నీవయో ♦ నిజవు; నేను
నీకుఁ దగనంచు నెంచితి; ♦ నాకు తుదకుఁ
దక్కకయె పోతి ప్రారబ్ధ ♦ తంత్రమునను.

లక్ష్మ—(తనలో)

గీ. అబ్ధుష్యామసుందరుఁడగు రాముఁ ♦ డబలఁ బాసి
నీరసుండయి వెలవెల ♦ బారె నకట!
విగత లసిత విద్యుల్లత ♦ యగుచు నీర
సంబగు శారదాభ్రంబు ♦ సరణిగాఁగ.

రాము—హా! విదేహ రాజ పుత్రి!

గీ. సరస గోదావరీ నదీ ♦ సైకతముల
నాడుచును గన్మొఱంగి నవ్వ ♦ లాటకొఱకు
రెల్లు దుబ్బుల దాఁగిన ♦ ప్రేమమునను
దహతహంబడి, సీత సీ ♦ తా, యటంచుఁ
బిలువఁ బరగు నవచ్చి కౌఁ ♦ గిలినొసంగి
“నిన్నుఁ బాసి నేమాత్రము ♦ నిలువఁగలనె,,
యంచుఁ బలికితి విపుడు, సీ ♦ తా, యటంచు
నార్చినను బల్కవేమి రా ♦ వైతి వేమి?

హా! సీతా! హా! సీతా! (కేకలిడఁ బ్రతిధ్వనియగును)హా! సీతా! (ప్రతిధ్వని యగును) హా! లక్ష్మణా! (గట్టిగనఱవఁ బ్రతిధ్వనియగును.) (తొందరతో) సౌమిత్రీ! ఏదీ! ధనుస్సు! ఏదీ ధనుస్సు!

లక్ష్మ—రామభద్రా! ఏల?

రాము—“హా! సీతా! హా! లక్ష్మణా!,, యని నాకంఠ రవముతో మఱల నెవ్వఁడో యొఱల్చుచున్నాఁడు. వేగఁ జాపమిమ్ము లెమ్ము.

లక్ష్మ — రామచంద్రా! క్షమియింపుము. సమీపముననుండు పర్వతము లట్లు మాఱు మ్రోయుచున్నవి.

రాము — పర్వతముల ప్రతిధ్వనియా? కాదు సుమా?

లక్ష్మ — మహాత్మా! ఔను.

రాము — నాయభాగ్యవైఖరిఁ జూచి యవి నన్ను వెక్కిరించుచున్నవి.

లక్ష్మ — అటులెంచఁదగదు.

రాము — ఎంచవచ్చును.



గీ. ఉన్నత దశనుండి మనుజుఁ ♦ డూడిపడఁగ
హానిఁ బరిహాసించుట నరు ♦ ప్రకృతి సుమ్ము;
వ్రాలు భానునిఁ గాంచి య ♦ వస్తువైన
ఛాయయును బృష్ఠముం ద్రిప్పు ♦ సవిత వైపు.

గీ. అట్లుకాఁగఁ గఠిన హృద ♦ యములు నిశ్చ
లములు దుర్భేద్యములు విష ♦ మములు నైన
పర్వతంబులు ననుఁగాంచి ♦ పరిహసింపఁ
జిత్రమే? యైనఁ దగదని ♦ చెప్పవయ్య!

లక్ష్మ — (తనలో) ఈమహానుభావునికతివ్యాకులతచే మనస్సు చెదరఁ జున్నదేమో కదా! (ప్రకాశముగ) రామచంద్రా! రఘువీర కటాక్షింపుము. శోకముపసంహరించుకొనుఁడు. అవి నిర్జీవ పదార్థములు.

రాము — అట్లుకాదు.

గీ. అగముఖాదుల కొకరీతిఁ ♦ బ్రాణవ
దేడము లేకుండ జీవులీ ♦ సృష్టి
వెలయుచుండు; జీవనిర్జీవ ♦ విభ
సృష్టసర్వజగత్తుతిఁ ♦ గృత్రివ

లక్ష్మ—అట్టులైన నవియన్నియు మీదుఃఖమును సహింపలేక కూడ విలపించుచున్న వేమో?

రాము—అలాగా?

సీ. కలసి యాడిన మమ ♦ కారంబుచే లేళ్లు
లక్ష్మ యన్మా యని ♦ యఱచి యేడ్చు
భయద జంతువులైన ♦ వైదేహి వోయిన
దారిఁ జూపెను నేత్ర ♦ వారి గురిసి
జీర్ణ పురాణ ప ♦ క్షిశ్రేష్ఠమభిమాన
పటిమచే నసువులే ♦ వదలినైచె
జన్మమాత్రమున రా ♦ జను బహిష్కృతుఁడనౌ
ననుఁగూర్చి యామహా ♦ వనము నందు

గీ. ప్రాణులిట్లు నిర్హేతుసం ♦ భవ కటాక్ష
సఱచుచుఁ బ్రకృతియె యేడ్చు ♦ నట్టి చింత
నాకుఁ గలిగెను; గనిపెట్టి ♦ నావు లేదా?
అపరిమిత చింత వింత సౌ ♦ ఖ్యంబు నిచ్చు.

లక్ష్మ—చిత్తము.

రాము—చిత్తమనెద వేమి? దుఃఖముచే నొడలు తెలియక నన్నధికము గ బహుమానించుకొనుచున్నాను. నాకొఱకేమియు నేడ్చుట లేదు. ఓ జానకీ!

తె. ధరణి జాతవీవు; ♦ ధరణిజాతములివ్వి;
సోదరత్వ జాత ♦ ఖేద గరిమ
యేడ్చుచుండె ♦ సీత! నీబాధకై;
చి యేడ్చు ♦ నిన్నుఁ బట్టి.

!

రాశన ♦ మాచరించి
నంటి ♦ సాధర్మ పత్ని

నిట్టులసురుఁడు గొంపోవ ♦ నేడ్చుచున్న
యేను శపథము నెట్లు చె ♦ ల్లించుకొందు?

లక్ష్మ—మీ రెప్పుడు మిథ్యాప్రతిజ్ఞులరు కారు. రావణ హరణము మఱింత శీఘ్రముగ నగుటకు సీతాపహరణ మొకకారణమైనది. మీ రుమనసు శాంతిపఱచుకొని లెండు. పోవుదము.

రాము—ఎట్లు?

లక్ష్మ—దక్షిణాశకై—

రాము—బాహ్యప్రపంచమందలి యాశకు నాంతరప్రపంచమందలి యాశకు మేరగలదా? ఎంతవఱకని పోవుదము.

లక్ష్మ—ఇంతవఱకని యిప్పుడు నిర్ధారణ పఱచుట కవకాశము లేదు. పోఁగఁ బోఁగఁ మఱికొన్ని నిదర్శనములు దొఱుకఁగలవు. రావణు స్థానమేదియో గూడఁ దెలియఁగలము.

రాము—సరే. రమ్ము.

లక్ష్మ—ఇదిగో! వచ్చుచున్నాను.

రాము—నీవెక్కడఁడవే వచ్చెదవు? నాసీతయో! హాసీతా!

గీ. అడవి కేతెంచు - ...లుగా ♦ ననవరతము
చేరియుండుట ... మ ♦ చ్చిక యయోధ్య
యందు నుః యప్పటికంటె ♦ నధికతరము
గాఁగనరాను బ్రదుకంగఁ ♦ గలమె యిట్లు.

సీ. కలిసి గోదావరీస్నాన ♦ ములను జేసి
కలిసి భుజియించి నిద్రించి ♦ కలిసి యాడి
కలిసి మునులను సేవించి ♦ కలిసియుండ
భ్రాతతోఁగూడ నావెంట ♦ రావదేమి?

త్వచ్చరణ పద్మ కింకరా ♦ ధముఁడఁ గానె!
ననుఁ గటాక్షింపు నేముందు ♦ నడతునయ్య!

రాము — నీయిష్టానుసారమే కానిమ్ము. నీమాటలు నాయందలిమహా
నురాగమును సూచించుచున్నవి. కాని,

సీ. మకుట కేయూరసం ♦ పదను రాజైన శై
లూషుని కంటె వి ♦ శేష మేమి?
నరసంఘు పరివేష్ట ♦ నమె భూపుఁ జేయుచో
మతిలేని ద్రిమ్మరి ♦ గతియు నదియె
కరినెక్కి యూరేగ ♦ కయె రాజుగాఁడన్న
మావటీనికి నట్టి ♦ మహిమగలదు
ప్రభుఁడను వాచ్యాళిచేఁ ♦ బరిఘవిల్లుననంగ
మృతశైవుఁడట్టులూ ♦ రేగఁడొక్కొ..?
ప్రాభవాంకములివికావు ♦ పరసతీప
రాఙ్ముఖత సత్య మాశ్రిత ♦ రక్షణంబు
సర్వభూతసమత్వంబు ♦ శాంతత పర
మాత్మ చింతయు రాజచి ♦ హ్నంబులగును.

లక్ష్మ — చిత్తము. అట్టి సమస్త సద్గుణసంపత్తి మీయొద్దనుండుటచేత
రాష్ట్రమున లేక కాననున్నను మీరే ప్రభువులరు. ఆశ్రిత పరిర
క్షణము ప్రభుగుణమని చెప్పితిరి. సీతమిమ్మాశ్రయించుజీవులలో
సర్వోత్తమ. తత్పరిరక్షణము తమకు శీఘ్రమవశ్యకర్తవ్యము.

రాము — సీత యెటులున్నదో యామెజాడలింకఁ దెలియనిమ్ము. అల్లె
మో నిశ్చలముగఁ జూచెద వేమి?

లక్ష్మ — అదిగో! అచ్చటసమభూమియంతయు విషమమై కర్కశతను
వదలి మృదుపాంసులమైయున్నది. ఏలయో? (సమీపించి)
మహాత్మా! ఇచ్చటఁ బెద్దయడుగులజాడలు కొన్ని కనఁబడుచున్నవి.

**రాము**—(సమీపించి) ఇది జటాయువు, రావణునితోఁ బోరినస్థలము. కాంబోలు! అప్పుడుల చరణాంకములు రావణునివి. అదిగో జటాయువుచే విరుగఁ గొట్టఁబడిన రావణ పుష్పకముయొక్క తునకలు. హా! జటాయూ!

గీ. తియ్యనగు మాటలనె ప్రేమఁ ♦ దెలుపునతఁడ
ధముఁడు; ధనమిచ్చి తెలుపమ ♦ ధ్యముఁడు; కాయ
కష్టము నొసంగి తెలుపును ♦ తక్కృష్టుఁ; డిట్టి
ప్రాణములనిచ్చునాఁ డెట్టి ♦ వాఁడో యహహా!

గీ. మాపయిని గల్గు నభిమాన ♦ మహిమమునను
ప్రాణమిచ్చితివనుకొన్న ♦ నద్ది కాదు
కాలగతుఁడైన మాతండ్రి ♦ గారి పైనిఁ
బ్రేమమునని చ్చితివి యింత ♦ వింత కలదె?

లక్ష్మణా!

గీ. స్వపరతఁ బరాపకృతి సేయు ♦ బ్రహ్మబంధుఁ
డైన దుర్మాంస భోజియా ♦ స్వాపదలను
దలఁపక పరోపకారకృ ♦ త్యమునకుఁ దలఁ
పడుగుణపభుక్కయిన బ్రహ్మ ♦ బంధుఁడగును.

చూచితివా? తమ్ముఁడా?

గీ. తాను నశియించుచును శాంధ ♦ తతికి ముందు
పథముఁ జూపించు వీథి దీ ♦ పంబు కరణి
ముక్కు తుదనుండు నూపిరి ♦ పోవుచుండ
ముందు దారి మనకుఁ జూపెఁ ♦ బుణ్యతముఁడు.

**లక్ష్మ**—మహాత్మా! ఖండింపఁబడిన యాపుణ్యాత్ముని ఱెక్కల తుదలు నేలఁ బడి యున్నవి.

**రాము**—ఆహా! మిగుల కరుణముగ నున్నవి.

గీ. భస్మ పతిత గరుదంచల ♦ ఖండములను
గాంచి విలపింతు తన్మూర్తి ♦ జ్ఞప్తి రాఁగఁ
దండ్రి మరణింపఁ దద్వస్త్ర ♦ తతిని పాదు
కలను తలపోసి కొనియేడ్చు ♦ కొడుకు వలెను.

గీ. పెద్దకొడుకు చేమీఁదుగా ♦ వెడలవలయు
ననుచు నెంచుచు వార్ధక ♦ మునను బోవు
పితకుఁ బనికిరానైతి; మున్ ♦ బేరునైన
పిసని యితనికిఁ గొడుకనై ♦ తిని వనమున.

ఆ. వె. ఎవని కెప్పు డేమి ♦ యగును? యెవ్వని కెవ్వఁ
డేమి యగును? యెప్పు ♦ డేది యెచట
నెట్లు జరుగఁ దగును? ♦ మెవ్వఁ డెఱుంగును?
మనుజు తంత్రపాళి ♦ పనికి రాదు.

లక్ష్మ—రామచంద్రా! అమ్మవారి పాదచిహ్నములిచ్చట నగపడుచున్నవి. ఇట్లు దయ చేయుదురు గాక!

రామ—ఆ. వె. సీత నాకు బంధు ♦ వీతఁడో మనతండ్రి
ప్రాణబంధు వందు ♦ పైని మనకుఁ
బ్రాణ మిచ్చినట్టి ♦ పరమబంధుం డయ్యెఁ
గాన నితని వెనుకఁ ♦ గాదె సీత.

లక్ష్మ—(తనలో) ఆహా! రామభద్రునిపూర్వబంధ్వాదరణవైఖరి!

రామ—

ఆ. వె. తండ్రిహితముకొఱకుఁ ♦ దల్లుల బంధులఁ
దలఁప కిటకు వచ్చి ♦ తండ్రిహితుని
దృష్టి సేసి పితకు ♦ హితము సేయుటయందు
భార్యచింత క్షణము ♦ నాయవలదె?

కాని తమ్ముఁడా! బాగుగఁ గనిపెట్టితివా? అవి సీతాచరణచిహ్నములే కద! ఏమో! అనాలోచనముగ నడిగితిని. అవి భర్తుఁడవగునీకే తెలియకుండునా?

గీ. నిర్గుణధ్యాననిష్ఠను ♦ నిలుచువాని
దృష్టి తననాసికాగ్రంబు ♦ నెనసియుండు
సగుణపూజాపరుని దృష్టి ♦ స్వపరదైవ
లలితచరణాబ్జములయందె ♦ నిలుచుఁగాదె?

లక్ష్మణా! జానకీచరణాంకము లేవి?

లక్ష్మ— ఇవిగో!

రామ— జటాయూ! నమస్కారము. (సమీపించి) హా! జానకీ!

గీ. పరమమంగళరేఖలు ♦ పదములందు
వెలుఁగుచున్న నీదుర్గతి ♦ గలిగె నెట్లు?
లెట్టులన నేల పతి భాగ్య ♦ హీనుఁడైన
కాలమున నవ్వి ఫలమీయఁ ♦ గలవె యకట!

జానకీ!

గీ. సార్వభౌమప్రథమపుత్త్రు ♦ చానవైనఁ
బతియభాగ్యత నిన్నూడఁ ♦ బాడు సేసె
నెంతయందెగా నేమి గు ♦ ణించు నద్ది
నున్నయైనప్పు డింక నే ♦ మున్న దకట!

తమ్ముఁడా! చూచితివా? రావణునిపదములు దక్షిణాగ్రములై యున్నవి. జానకీచరణాంకము లుత్తరాంచలములై యున్నవి.

పాపము!

గీ. అసురుతో జటాయువు పోరు ♦ నంతలోనె
మనము వచ్చి కాపాడుదు ♦ మనుచుఁ బ్రబల

సంభ్రమోద్ధతి మనమున్న ♦ చాయనైన
కన్నులకులఁ బ్రాణములతోఁ ♦ గాంచియుందు.

లక్ష్మ—రావణుని మీరు యమసదనమునకంపుదురు కాన నాతఁడు దక్షిణాభిముఖుఁడై యున్నాఁడు. సీతాదేవి నుద్ధరించి యయోధ్యకు మీరు గొనిపోయి యథోన్నతస్థితి నుంతురు గాన నామెయుత్తరముఖియై యున్నది.

రాము—ఆహా! ఆమె మస్తకె మహాందోళనమున నెల్లు చూచియుండునో!

గీ. ఎత్తు మనసునాశ, రాముని ♦ తి త్తరంబు,
వస్తుమో రాము యనుశంక, ♦ వచ్చియుండ
మనసుచింత, రామునుకోప ♦ మెనయుచూపుఁ
దలఁచుకొనఁ జింత బ్రహ్మారం ♦ ధ్రంబు వ్రచెచె.

హా! సీతా! హా! సీతా! (ఏడుచుచు)

గీ. గుండె లప్పుడు నీ కెల్లు ♦ కొట్టుకొనెను?
యొడలు నీ కెల్లు వడఁకెను? ♦ కడుపులోన
మంట లెట్లుగ మండెను? ♦ కంటికాల్వ
లెట్లు ప్రవహించెనో చెప్ప ♦ వేమృగాక్షి!.

గీ. శిబి కిలటు తిన్నదయి యు ♦ చ్చింతపండ్ల
వలెఁ దుదలు గిల్లి సన్ననై ♦ నడుమ నెడము
లేని వేళులఁ దగి భూమి ♦ పైని సరిగ
మోయునీపదములఁ దల ♦ పోసి యేడ్తు.

లక్ష్మ—ఈచరణాంకము రెండవదానివలె భూమిపై బాగుగ మోపి విస్పష్టముగ నుండలేదు. అచ్చటిప్రదేశ మల్పపాంసుల మగుటచేఁ గాఁబోలు!

రాము—తమ్ముఁడా! అట్లు కాదు.

ఆ. వె. నడచునపుడు తప్ప ♦ నిలుచుండి కూర్చుండు
నపు డొకయడుగె తలఁ ♦ చు పని సేయుఁ
బిల్చునపుడు తప్ప ♦ వేఱువేళలఁ బని
కొక్కముక్కరంబె ♦ యొప్పునట్లు.

హా! సీతా!

ఆ. వె. అపుడు సన్నకంటి ♦ యందు నీవ్రేళ్ళకేఁ
జుట్టు లూడ్పఁబోవఁ ♦ జట్టున గిలి
గింతచేత నుంచ ♦ నీయక వెన్కకు
నిట్టె పెట్టునడుగు ♦ లివియ కావె?

హా! విధి! ఎంతగతిపట్టించితివి! హా! సీతా! హా! సుగుణాఖనీ!
హా! జనకనందనీ! (ఏడ్చును.)

లక్ష్మ—రాఘవేంద్రా! దుఃఖ ముపసంహరించుకొనుము. ఇఁకముందు
పోవుదము దయ సేయుఁడు.

రాము—ఆనాఁటిరాత్రి—

సీ. అన్యోన్య మెదురుగా ♦ నాసీనతను జెంది
లత్తుక సీకాళ్ళ ♦ లకును బెట్టు
నపు డొక్కకాలికే ♦ యలఁది పరామున
హస్తమార్జనము నే ♦ నాచరింప
నవ్వినపుణ్యాంగ ♦ నలఁజూచి గ్రహియించి
సహజరక్తిమ గల ♦ చరణములను
బెట్టినకా లేదొ ♦ వేగ నెఱుఁగ లేక
పెట్టినకాలికే ♦ పెట్టుచుండ
నతివలు మఱింతహాసియించి ♦ రపుడు నీవు
విన్నఁబోయి పెట్టినకాలు ♦ వెనుక పెట్టి

కెంపవదిముందుఁబెట్టి సన్ ♦ ప్రేమఁజూచి
వ్రేల మీటితి వట్టిపా ♦ దాలె యివ్వి?
ఓసీతాపదములారా!
గీ. ఆమెపుణ్యసన్నిధిఁబాయు ♦ నార్తివలన
మాంసలతఁ దక్క రక్తసా ♦ మర్థ్య మెడసి
నీడవలె రూపమాత్రంబు ♦ తోడ నుంటి
రకట! యిట్లు సుఖించునా ♦ యట్లు మీరు.

లక్ష్మ — మహాత్మా! మనసును గుదుటఁబఱుచుకొనుఁడు. అవి జానకీ చరణములు కావు. తత్స్మరణాంకములు. వట్టిప్రతిబింబములు.

రాము —
గీ. ప్రకృతిలోపలఁ బరమాత్మ ♦ ప్రతిఫలింప
నయినజీవులు సత్యంబు ♦ లనుట లేదె?
అన్ని ప్రతిబింబములె; మాయ ♦ నున్నవఱకు
నన్ని సత్యంబులే యగు; ♦ నట్లె యివియు.
అది గాక, నాయనా!
గీ. ప్రతినరుఁడు ధరామండల ♦ ప్రతిమపైని
గంగ, యిది యని గీతను ♦ గానఁబఱుచు;
సర్వశాస్త్రాళి సంకేత ♦ సంప్రభూత
ముకురము లంకెలును సంజ్ఞ ♦ లగునుగాదె?
గీ. వస్తుయాథార్థ్య మెఱుఁగక ♦ వస్తువునకు
నేదొ సంజ్ఞను మన ముంచి ♦ యెఱిఁగినట్టు
లల్లలాడుదు మిది యంత ♦ యైంద్రజాల
మందు దుముకులాడెడు బొమ్మ ♦ లాటగాదె?
గీ. స్వప్నమునకంటె స్వప్నమై ♦ సత్యముగను
మాయకును మాయయగుచు న ♦ మ్మకముగాఁగ

శూన్యములకంటె శూన్యమౌ ♦ సుస్థిరముగఁ
గనఁబడెడునది యేమని ♦ యనఁగవచ్చు.

లక్ష్మణా! ఏమో చెప్పితినిగాఁబోలు! ఈయనవసరమైన యుపన్యాసమిప్పుడేసందర్భమున సంభవించెను? జ్ఞప్తి లేదు. మన సత్యాంతమైన యూరాట మొదలుచున్నది. తనుప్రసందుఁ దాప మధిక మగుచున్నది. గాలి బాగుగవీవకున్నది.

లక్ష్మ—మహాత్మా! పవనాగమనమునకు గుహవలెఁ బెరిగిన యీయామ్నాక్షు మభ్యాంతరముగ నున్నది. దక్షిణమునుండి మనకు సీతావార్త లేవియు లేవు సరేకదా! కొంచెముగాలి బాగుగ రాకుండఁ జేయుచు నీవృక్షముగూడ రావణునికే సాహాయ్యము సేయుచున్న ట్లున్నది.

రామ—అదేమి వృక్షము?

లక్ష్మ—మధూకము.

రామ—కాదేమో సుమా!

లక్ష్మ—రామభద్రా! సందేహము లేదు.

రామ—అట్లయిన మధూకమునుండి దివ్యనానాకమలపరిమళ మేలకొట్టుచున్నది? నీకుఁగూడఁ గొట్టుట లేదా?

లక్ష్మ—నాకుఁగూడ నట్టివాసనయే కొట్టుచున్నది. కారణ మేమో చూచెదను. (పోయి మధూకవృక్షమును గలయఁజూచి) రామభద్రా! సరోజమాలికయొకటి యీచెట్టుదగుర కొమ్మను వ్రేలాడు చున్నది.

రామ—ఆహా!

గీ. రక్తమిశ్రితసిలవ ♦ ర్ణమును గలిగి
వెగటుతీపియుమదగంధ ♦ విశదతయును...

గనిగినమధూకమునను౦డు ♦ కమలమాల
రావణాంకస్థజనకజా ♦ రమణిఁబోలె.

ఆమాలిక నిటు తెమ్ము.

లక్ష్మ—(తీసికొనివచ్చి)

గీ. రావణునిజంపి యిట్లు సీ ♦ తావధూటి
మీరు గైకొందురుగాక! యూ ♦ మీఁద విగత
రాజ్యలక్ష్మినిగూడి స్థి ♦ రంబుగాఁగ
సుఖసుఖాన్వితులై మెల ♦ యుదురుగాక.

రాము—అన్నగారి కాశీర్వాదములా?

లక్ష్మ—(నమస్కరించి) శుభముంపుఁడు.

రాము—(మాలికను గ్రహించి) ఆహా! తమ్ముఁడా! ఇది జానకీధరించు నకమలమాలయే సుమా? నీకుఁగూడ నట్లేతోఁచుచున్నదా?

లక్ష్మ—ఆసంగతి నే నెట్లు చెప్పఁగలుగుదును?

రాము—సరే! ఓయవనిజావనజమాలికా!

గీ. నిన్ను వాసనఁగని నవ ♦ నీజముఖము
మూర్కొనినయట్టు లుండె నిం ♦ ముట్టుకొనఁగఁ
జెలి కరస్పర్శమునట్లు ♦ తలఁతు నినుధ
రింప సతిఁ గౌఁగిలించిన ♦ రీతినుందు.

ఓమాలికాసుమములారా!

గీ. ముద్దుకరముల మిమ్ముఁ దా ♦ పుడికి ముద్దు
లాడి తనమంచిగుణ మిచ్చి ♦ యైకమత్య
రీతి మిముఁగూర్చి మెపుడు భ ♦ రించియుంట
నవనిజాతనుఁబోలితి ♦ రహాహా! మీరు.

లక్ష్మణా!

గీ. సీత నెడఁబాసి చింత చేఁ ♦ జివుకునేను
యీజలజమాలఁ గని భరి ♦ యింపలేను

లలనఁ బాసి యేడ్చుచుఁ బిల్ల ♦ లను గడుపున
దాపుకొని మఱింతగ నేప్పు ♦ తండ్రిఁబోలె.

లక్ష్మ—రామచంద్రమూర్తీ! కటాక్షించి యాశ్వాసిల్లుఁడు.

రాము—హా! నీరజహారమా!

గీ. జానకిని బాసి చింతచేఁ ♦ జాల నీవు
నావలెనె వాఁడియుంటివే ♦ నాతి నిను భ
రింపలేక నా కిటు లప్ప ♦ గించి మఱి వి
డాకు లిచ్చి పోయెనె? దిక్కు ♦ హా! యికేద?

హా! పద్మమాలికా!

గీ. నన్నుపుడెటులు తలఁచుకొ ♦ న్నదియొ? ముందు
తనదుగతి యేమి యగునని ♦ తలఁచుకొనెనొ?
ఆమెహృదయస్థ వగుటచే ♦ నడుగుకొంటి
నెఱుఁగుదువు నీవు చెప్పవే ♦ యేల తడవు?

గీ. బ్రదికియున్నదొ? లేక ప ♦ రమపదంబుఁ
జేరియున్నదొ? యిఁక ముందుఁ ♦ జేరఁదలఁచి
యున్నదియొ? నాకు నెదియైన ♦ నిన్నుఁ జెప్పు
మన్నదియొ? దాచ కిఁకఁ జెప్పు ♦ మబ్జమాల!

హా! సీతా! హా! సీతా!

లక్ష్మ—(తనలో) ఈమహానుభావుఁ డతికరుణముగ దుఃఖించుచున్నాఁడు. మూర్ఛ నొందునేమో కదా! హా! దైవమా!

రామ—

గీ. కను లదరఁజొచ్చె; గాత్రంబు ♦ కంప మొందె;
మునిఁగి కెక్కురుమనువానిఁ ♦ బోలె నుంటి;
నది రహస్యమైనను జెవి ♦ ననుము మెల్ల,
నరగుననుజెప్ప వేల హా! ♦ జలజమాల!

హా! సీతా! హా! సీతా! (కనులు మూసికొని నేల శయనించును)

లక్ష్మ—మహాత్మా! రామభద్రా! రామచంద్రా! రఘువీర! రాజీవలోచనా!

రాము—ఏల పిల్చుచుంటివి?

లక్ష్మ—అయ్యా! కన్నులు మూసికొనన నేల? విప్పుండు.

రాము—ఏల?

లక్ష్మ—మీరు బాధనొందుచుంటి రేమో యని నే నాందోళన మందుచుంటిని.

రాము—బాధ లేదు కాని యది యేమి?

లక్ష్మ—ఏది?

రాము—అదిగో! అది యే.

లక్ష్మ—పర్వతముల బారు.

రాము—అది కాదోయి! దానిపై నుండునది.

లక్ష్మ—ధరణీజాత—

రాము—లే—లే! పోయి తీసికొనివత్తము. హా సీతా! సీతా! ఇదిగో! వచ్చుచుంటిమి.

లక్ష్మ—వృక్షసమూహ మని చెప్పఁబోయితిని.

రామ—దానిమాట కాదోయి! దానిపై నున్నదాని నడిగితిని.

లక్ష్మ—దానిపై నున్న దేమున్నది? ఇఁక నాకాశమే—

రాము—ఆలాగా! ఈయాకాశము మనపైఁ బడకుండ నేమియూ ధారమున్నదని యెంచితివి?

లక్ష్మ—(తనలో) అయ్యో! ఇట్లు మాట లాడుచున్నాఁ డేమి? (ప్రకాశముగ) మహాత్మా! ఆధారమున కేమున్నది?

రాము—ఆలాగా! మనవలె నిరాధారస్థితి నున్నదా?

లక్ష్మ—రామభద్రా! లేనిదాని కాధార మేల?

రామ—లేనిది కావుననే యాధార ముండవలయును. కాని యిదివఱకున్నది యిప్పుడు లేకపోవు టేల? రావణుఁడు హరించినాఁడా? అదియు సీతయుండుతావుననే యున్నదా?

లక్ష్మ—మహాత్మా! మనస్సు వికలమగుచున్నట్లున్నది. కటాక్షించి కుదుటఁబఱచుకొనుఁడు.

రాము—సరేకాని యున్నదానిని లేదనెద వేల?

లక్ష్మ—రామభద్రా! ఉండుటయె యసత్యము.

రాము—ఉండని దేల కానఁబడుచున్నది?

లక్ష్మ—మహాత్మా! కనఁబడుట వట్టిభ్రమము.

రాము—కనఁబడుట వట్టిభ్రమమేనా? హా సీతా! హా సీతా! నీవింకఁ గనఁబడవా? సీమంతిని నిరాశుఁడనై విలపించుచున్నాఁడను.

లక్ష్మ—మహానుభావా! మనసు మెట్లుచెదరినవీణవలె నుండి సందర్భమగునాద మీయకున్నది. కటాక్షించి సర్దుకొనుఁడు.

రాము—తలపై మేరువున్నను మెడలో నానపకాయఁగట్టుకొనినయంతఁ జెడుదు?

లక్ష్మ—(తనలో) వీణాప్రశంసాసందర్భమున నాతనిమనసు నావంక కట్టె పర్వెత్తినది. మనసు హేతుసక్తినిరుద్ధము గాక యూరకే కల్పనగంతులు వైచుచున్నట్లున్నది. (ప్రకాశముగ) కరతలగతమహావైభవసమృద్ధి నుండియు నైహలంపటత్వశూన్యతచే మహావిజ్ఞానపటిమచే యథార్థవిరాగశిఖామణు లగునట్టిపుణ్యపురుషులు మీరు తప్ప మఱెవ్వరున్నారు?

రాము—అబ్బ! నామాట నేల చెప్పెదవోయి? నాకు మహారాజ్యసంపన్నతయు లేదు. మహావిరాగతయు లేదు.

లక్ష్మ—అట్టులైన నట్టివాఁడు కపటసన్యాసియై—

రాము—ధనుస్సేదీ? ఏదీ?

లక్ష్మ—రామమూర్తీ! శాంతిల్లుఁడు. ఇప్పు డట్టియుపద్రవ మేమియులేదు. (తనలో) సీతవలన వినినజటాయు వీతనితోఁ జెప్పినవృత్తాంత మస్మత్స్మృతికి రాఁగ నిట్టు లాందోళన మొందినాఁడు. (ప్రకాశముగ రామభద్రా! రామచంద్రా!

రాము—(పలుకకుండును.)

లక్ష్మ—మహాత్మా! రాఘవా! రఘువీరా! పలుక వేమి?

రామ—లక్ష్మణా! పిలుచు చుంటివా? కొంచెము నిదుర వచ్చుచున్నట్లున్నది. నీవిచ్చటనే యుందువు కాదా?

లక్ష్మ—అయ్యయ్యో! ఎప్పు డననిమాట యిప్పు డనుచున్నా రేమి?

రామ—ఎప్పుడువంటిది కాదిప్పుడు. నిన్నిచ్చట నుండవల దని చెప్పుచున్నాను.

లక్ష్మ—ఉండనా?—

రామ—అయోధ్యకుఁ బొమ్ము.

లక్ష్మ—హరిహరీ! ఎంతమాట నాడితిరి! రామచంద్రా! రామచంద్రా! రామచంద్రా! (తనలో) వైదేహిచే నన్నిమాటలఁ బడితిని గాని యవి యన్నియు నీమాటవలనఁ గలుగుబాధలో సగముబాధ నైన నీయలేదు. (ప్రకాశముగ) మహాత్మా! అంత కఠినమైన యాజ్ఞ నేలయొసఁగితిరి?

రామ—నీ విచ్చట నున్నంతకాలము నన్ను రక్షించుచు నే యుందువు. నా కొకనిరక్షణ మనావశ్యకము. నన్నుఁగూడ నేరాక్షసుఁడైన హరించుకొనిపోవ నాకుఁ గష్టములు వదలి సుఖమార్గము దొరుకఁగలదు. నీవిఁకఁ బొమ్ము.

లక్ష్మ—నన్ను మీరు పొమ్మనునెడల నేను మీసన్నిధిని ప్రాణత్యాగము సేయుదును.

రామ—సరే. ఉండుము. (నిద్రించును.)

లక్ష్మ—సీ. బంగారుపట్టెలు ♦ పవడంపుఁగోళ్ళులు
పట్టుపట్టెడయును ♦ వజ్రపాళి
నమరినపఁదిరి ♦ హంసతూలికతల్ప
మునుగలమంచంబు ♦ న నిటులటుల
జాళువాబొమ్మలు ♦ చామరంబులు వీవఁ
బన్నీరుతుంపరల్ ♦ పైని జిలుక
జానకి తనపాద ♦ జలజంబు లొత్తఁగఁ
బవళింపఁ దగుసార్వ ♦ భౌమవరుఁడు
కాఱడవిలోన ముండ్లలోఁ ♦ గఱకునేలఁ
జాన నెడఁబాయుచింతచేఁ ♦ జాలసొలసి
నక్క లఱవఁగఁ గన్మోడ్చె ♦ నక్కటకట!
యంతవానికి నొదుల ♦ కింతయయ్యె?

సీ. చక్రవర్తులు సర్వ ♦ సంపదలంబాసి
పరితపించుచుఘోర ♦ వనములందొ?
తత్పాదుకల నైనఁ ♦ దలమోయఁదగనట్టి
యధము లీశులయి రా ♦ జ్యంబులందొ?
మగనాంద్రహృదయముల్ ♦ మండిపో నేడ్చుచు
నసువులకారాగృ ♦ హంబులందొ?
సుతులఁ గాటికిఁ బంపి ♦ పతులగొంతులఁ గోయు
ధూర్తులు బంగారు ♦ తొట్టెలందొ?
శమదమాఢ్యులౌ మునులు రా ♦ క్షసులనోళు
లందొ? పరమచండాలు రౌ ♦ నసురహాతకు
లామునులమగువలప్రక్క ♦ లందొ? యకట?
దైవమా! మంచిచెడ్డలు ♦ లేవె నీకు?

సీ. సత్యసంధులు కష్ట ♦ చయముల మునుఁగుటో?
దొంగ లుప్పొంగుచుఁ ♦ బ్రుల్లిపడుటో?
తల గొఱిగించుకో ♦ దాతకు లేకుంటో?
కృపణుఁడు లక్ష్మిన ♦ వృద్ధిఁ గనుటో?
విద్వాంసు లుదరముల్ ♦ వెన్నంటి యేడ్చుటో?
మూఢులపొట్టలు ♦ పొణకలగుటో?
కాసు గల్గినవాని ♦ బాస వేదం బౌటో?
బువ్వ లేనతనివి ♦ బూతులగుటో?
త్వత్పదారాధకులు ముష్టి ♦ దాసరయ్య
లగుటో? నాస్తికుల్ వారల ♦ మొగములందు
నుమియుటయో? యేమి యిది? కన్ను లున్న వె? మతి
యున్న దే? యుంటివే? చేయు ♦ చున్న దిదియె?

గీ. కనఁబడవు హేహా! యనుచుఁ బిల్వ ♦ వినుచు వినవు
కాననే యింతకాలంబుఁ ♦ గడపినావు
కాక నాకిప్పు డొకసారి ♦ కానఁబడిన
నీదుపసఁ జూతుఁ జూపింతు ♦ నాదుపసను.

గీ. నన్నుఁ జంపుటకంటెను ♦ నరకమునకు
నీడ్చి నన్ దహించుటకంటె ♦ నెక్కు వేమి
సేయఁగల వీవు సేయునే ♦ చేతలైన
నిట్టిబాధలో సగమైన ♦ నీయ లేవు.

ఇట్టినీతో నా కేమియుఁ బని లేదు. నీవు లోకము మవేకావచ్చును. నాకుమాత్ర మీమహానుభావుఁడే దైవము. ఈతఁడు యథార్థముగనే యిట్టిబాధలఁ బడుచున్న వాఁడో విలాసార్థమే పడుచున్నాఁడో యెట్లైన నగుఁగాక — ఈతనిని గొల్చెదను. అట్లుపోయి యీమహాత్ముని కొకపూలసురటిని నిర్మిం

చి విసరెదను. (కొంచెముదూరము పోయి) ఓయసురాధమా! ఎంతపని చేసితివిరా! నేనచ్చట లేకుంటచే నీ వట్లు చేయఁగలిగితివి. (పూలఁగోయును.)

(కబంధుఁడు ప్రవేశించును.)

కబం—(రాము నెత్తికొని) అంతకంటె నెక్కువపనిని నీవిచటనుండఁగనే చేసితిని. చూచుకో! (రామునితో నిష్క్రమించును.)

లక్ష్మ—ఆహా! ఆహా! ఆదేమి! అదేమి? ఓరామప్రభూ! వచ్చుచున్నాను. (పోఁబోవును)

(నేపథ్యమున) రావలదు. ఆఁగుము. అచ్చటనే సీతాచరణసాన్నిధ్యమున నుండుము. వెనుకటివలెనే తత్సన్నిధిని వదలకుము. ఈ రాక్షసునివధించి నే నిప్పుడే వచ్చెదను.

లక్ష్మ—చిత్తము. విజయులై త్వరగ దయచేయఁ బ్రార్థింతును. (తనలో) అన్నగారిట్లు లాజ్ఞాపించుచుండ నింకఁ జేయున దేమి? హా! ఇది యేమి?

గీ. ఎదుటఁ బడునెడి దేవునే ♦ యీశ్చి యొకటి
గొట్టుము నటంచు రజ్జులు ♦ గొట్టినాఁడ
నెదుటఁ బడి యింత సేసిన ♦ యిట్టియసుర
హాతకునింత్రైన నాఁపలే ♦ నైతి నకట!

కాని, యిచ్చటకు వచ్చి పూలు కోయక యచ్చటనే యుండిన నెట్లుగ నుండునో? మాయన్నగారు మేలుకొనియుండఁగనే నే నీదైవదూషణమును జేసియుండిన యెడలఁ దల వాచునట్లు నన్ను జీవాట్లు పెట్టియుండును. అటులజరుగక పోవుటచేత మంచిపనియే జరిగినది. చీవాట్లు పెట్టినందువలనఁ దప్పు లేదు. నీతిబోధన మగును. శ్రీరామభద్రుఁడు నా కీతప్పునుగూర్చి తిరిగి బోధింపవ

లయునా? నేనుమాత్రము దైవదూషణ తప్పని యెఱుఁగనా? అయిన నేమి? తెలివి వేఱు. ఆచరణము వేఱు. (తొందరతో) ఇప్పుడు వృథా యోజనయేల? ఆహా! ఈసరికి రామభద్రుఁడా రక్కసుని హింసించెనో లేదో? ఆహా! అదిగో! ఆమహానుభావుఁడాతనికరచరణములు ఖండించినాఁడు.

(నేపథ్యమున). మహాత్మా! రామభద్రా! నేను నీబాణఘాతమునఁ బవిత్రుఁడనైతిని. నాకు శాపవశమున రాక్షసజన్మముకలిగెను. దీనినుండి నన్ను విముక్తునిఁ జేసితివి. నాప్రాణావసానమున నీతోఁగొన్నిమాటలు చెప్పవలయును. వినుము.

లక్ష్మ—విచ్ఛిన్నపాపుఁడగు రాక్షసుఁ డిట్లు పలికినాఁడు. ఇఁకముందేమి చెప్పునో?

(నేపథ్యమున) మహానుభావా! రామచంద్రా! మీరుఋశ్యమూకమున నున్నసుగ్రీవుని గలసి యాతనితో సఖ్యమొనర్పుఁడు. ఆతనివలన సీతాన్వేషణకార్యము జరుగును. వానరసైన్యపురస్సరుఁ డగుసుగ్రీవునితోఁ జేరి మీరు రావణుని వధించి జానకిని గ్రహింపఁగలరు.

లక్ష్మ—ఆహా! వినఁదగినమాటలు వినవచ్చినవి. ఈరాక్షసుఁడు శత్రురూపమున మాకు మహోపకార మొనర్చెను.

(నేపథ్యమున) నేనింకఁ బరలోకమున కేగెదను. నమస్కారము.

(నేపథ్యమున) మఱియొకధ్వనితో) సరే.

లక్ష్మ—అదుగో! రామభద్రుఁడు వచ్చుచున్నాఁడు!

(రాముఁడు ప్రవేశించును.)

రామ—లక్ష్మణా! వింటివా?

లక్ష్మ—కర్ణపర్వముగ—మహాత్మా! ఆరాక్షసుఁ డెవ్వఁడు?

రాము—కబంధుఁడు. ఆతనిఁగూర్చి సావకాశముగఁ దరువాత ప్రశంసింతును. రమ్ము. ఋశ్యమూకమునకై పోవుదము. ఓసీతాచరణాంకములారా! మిమ్ము విడిచి పోవలేక పోవుచున్నాను. దయ యుంచుఁడు.

లక్ష్మ—ఓజానకీచరణాంకములారా! నమస్కారము. రామభద్రా! ఋశ్యమూకమునకు దారిఁ గనుఁగొంటిరా?

రామ—మహారణ్యమున మహావిపత్తున దారి యేమి? నడువ నడువ నది యేదో యగును; పద—

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.

శ్రీ

# వనవాసరాఘవము.

## చతుర్థాంకము.

ప్రదేశము—కిష్కింధానగరసమీపస్థానము.

ప్రవేశము—శరభుఁడు, నంశుమాలియనునువానరులు.

శర—(విచారము నటించుచు,) ఓహో! అంశుమాలీ!

అంశు—ఓహో! శరభా! దాదాపుగ నారైదుమాసములనుండి కనఁబడుట లేదేమి?

శర—హిమాలయప్రాంతదేశమున కేగినాను.

అంశు—ఏల?

శర—ప్రారబ్ధవశముచేత! నాబ్రదు కేమని యడుగుదువు? (ఏడ్చును.)

అంశు—విచార మేల?

శర—విచారము నాకుఁగాక నీకేమి? గొంతుకకోఁతవలె నున్నది.

అంశు—దూరముఁ జూపానకపోవుటచేఁ గనిపెట్టలేకపోయితిని. అబ్బో! చాలఁ జిక్కితివే? కొండచిలువవలె నిండుగ నుండువాఁడవు వానపాముపలె నున్నావు! దున్నపోతువలె నుండువాఁడవు దూడవలెనుంటి వేల?

శర—నాకర్మము! నాప్రారబ్ధము! నాపాపము! నాదుర్గతి! నానిర్భాగ్యత! నా—

అంశు—ఆఁగు! ఆఁగు! అశ్లీల దూషించుకొందువు? క్షయవ్యాధికలిగె నా యేమి?

శర—లేదోయి! నావ్యాధి యక్షయమైన దయ్యా! (ఏడ్చును.)

అంశు—నాకుఁ దెలియ లేదు.

శర—అనుభవించువాఁడనునేనైనప్పుడు నీ కెట్లు తెలియును? (ఏడ్చును)

అంశు—అంతయేడ్చువునకు నీ కిప్పుడు కలిగిన ప్రమాద మేమి?

శర—అది ప్రమాదము కాదయ్యా! బుద్ధిపూర్వకముగ—కాదు—బుద్ధి లేక—దూరదృష్టి లేక—ఇప్పుడు కాదయ్యా! మున్ను మాసములక్రిందటనే మెడకుఁ దగిలించుకొంటిని.

అంశు—ఎవరిని?

శర—ఎవరిని గాదోయి! ఆదిక్కుమాలిన మామగారుముండకొడుకు మాటవిని—

అంశు—మామగా రనుచున్నావు. పెండ్లి యైనదా?

శర—జరిగినయుపద్రవ మదేనోయి బాబూ! (ఏడ్చును)

అంశు—ఓరి నీపెండ్లి కాలిపోను. ఇందుకొఱకా యేడ్చి యేడ్చి సగమై చావునకు సిద్ధముగ నున్నావు? ఇంత యేడ్చువాఁడవు పెలవివాహ మాడవలయును?

శర—సుఖపడుదు నేమో యనునాసచేఁ జేసికొంటిని.

అంశు—సుఖపడకుండ నీ కిప్పుడు కలిగినలోప మేమి? నీభార్య బాగుగ నున్నదా?

శర—అన్యథా జరిగినయెడల నాకింత యాందోళన మెందులకోయి నాయనా! (ఏడ్చును)

అంశు—ఆలాగా? పరాపేక్ష కలిగిన దయ్యోనా యేమి?

శర—ఆలాగే యైనయెడల నా కంతకంటెఁ గావలసిన దేమి?

అంశు—ఛీ! ఛీ! భార్య చావలే దయ్యెను. యోగ్యురా లయ్యెను. ఏడు పెంపులకురా? నీవంటి నిర్భాగ్యునకు భార్య యేలరా?

శర—నాయనా! నాకొఱకు నేను వివాహము చేసికొనలే దయ్యా? (ఏడ్చును)

అంశు—ఓరి తుచ్ఛుఁడా! మఱెవనికొఱకు నీవు చేసికొంటివి?

శర—దానినిబట్టి సముద్ర మీఁదవలయు నని, దానినిబట్టి కొండ మెక్కవలయు ననిపెద్దయాస పెట్టుకొని తుద కుభయభ్రష్టుఁడనై పోయితిని. (ఏడ్చును.)

అంశు—నీవు చెప్పినమాటలు నాకు బోధపడలేదు. దానినిబట్టి సముద్రము నీఁదుటకుఁ గాని కొండయెక్కుటకుఁ గాని యిప్పుడు గలిగిన యుపబోధ మేమి?

శర—ఇంతకంటె నేమి కావలయును? మహాప్రభుఁడు వాలి పరలోకగతుడయ్యెనఁట!

అంశు—అవునే! నీభార్యను వాలికి సమర్పింపఁ దలఁచితివా?

శర—సమర్పించుటలోఁ బ్రతిఫలాపేక్ష లే దేమో! అట్లు దలఁచితిని. పెద్దబేరము ధ్వంసమైనది. నోటిలో మన్ను పడినది. రేఖ తుడుచుకొనిపోయినది. పాపము పండినది. (ఏడ్చును.)

అంశు—ఓరి దురాత్ముఁడా! వాలికి నీవు నీభార్య నిచ్చి యేమిప్రతిఫలము పొంద నెంచితివి?

శర—గౌరవము—ఖ్యాతి—

అంశు—ఇట్టి యగౌరవమైనపనిఁ జేసిననీకు గౌరవ మెట్లు కలుగును?

శర—అయ్యో! వెఱ్ఱివాఁడా! బ్రదుకుతెరువు తెలియక యేమి చెప్పితివి? రాజుగారిపడ్డకుఁ దనిపించుకొనుట గౌరవము కాదా? రాజుగారి చెవిలో గుసగుసలాడుట గౌరవము కాదా? మనభార్య కిష్టుం

ధారాజ్యమునకు రాణి యనిపించుకొనుటకంటె మహారాజయో
గ మున్నదా?

అంశు—నీమహారాజయోగము మండినట్లే యున్నది. కాని మనభార్య
యనెద వేమి? సిగ్గులేనివాఁడా?

శర—అదివదలినఁగాని ధనాకర్షణ మెట్లు? ఐశ్వర్యమున కున్నప్రతిబం
ధ మదే. ఆహాహా! నిక్షేపమువంటిమహారాజు. ఎందఱువానర
కాంతలను బలిగ్రహించి తద్భర్తలను బాగుచేసినాఁడు! ఆహా
హా! అట్టిమహాపురుషుఁడు!—అట్టిజారశిఖామణి—

అంశు—వాలిచేసినతప్పు భ్రాతృభార్యను బలిగ్రహించుట—నీ విప్పుడు
బాహాటముగఁ జెప్పుచున్నంతజారుఁ డని వానికి లేదు.

శర—ఒకచోటఁ దప్పగఁ దిరిగినవాఁడు మఱియొకచోట మానునా?
అట్టినవరసరసికుఁడు నానోట తొమదేవతయుండ, నాభార్యప్ర
క్కలో నభాగ్యదేవత యుండ, మానెట్లు దక్కును?

అంశు—నీకంటె నభాగ్యదేవత యెవఁడు? పురుషజన్మ మెత్తి, దేహ
దార్ఢ్యము గలిగి, పెండ్లాడి, దానికొఱకు ముందు నీవు సంక
ల్పించుకొనినయుపభర్త చచ్చెనని సిగ్గు లేక—మొండిముండ
కొడుక!— పైకే చెప్పుచుంటివా? ఏడ్చినయెడలనోటిమీఁదఁ బ
న్నుదును.

శర—పైకేడ్చితి నని యధిక్షేపింతువా? నా కొక్కయుపకారముఁ జేసిన
నేను బైకి లోపలఁ గూడ నేడువను. చేసెదవా?

అంశు—ఏదది?

శర—రాముఁ డఁట. ఆతనిని నీ వెఱుఁగుదువా?

అంశు—ఆ.

శర—మనకు వాలియేయన్నమాట యేమి? ఆతఁ డేమి నెత్తిమీఁద
వాఁడా? మనప్రబలుకు గౌరవముగఁ జరుపఁదగుదా? జెవఁడైనఁ

జారుఁడు. ఈతఁడు—అనఁగ నేను—రాజుగారికి విధముగ రక్త సంబంధి యని లోకు లనుకొనుచుండఁగ నాకు దినములు దొరలిపోయినఁ జాలు.

అంశు—ఓరి నిర్భాగ్యుఁడా! రామునికి సతి నంటింపఁదలఁచుచుంటివా?

శర—నాయనా! రాముని నే నెఱుఁగను. ఈ బేరము నీవు పొసాయించి పొత్తుపఱుపవలయును.

అంశు—ఓరి పరమనీచుఁడా! నన్నుఁగూడ నీ యధమాధమప్రయత్నమునఁ దోసుపఱుప నుంటివా?

శర—ఊరకే త్రోసిపుచ్చెదవా? ఏదో అంతటఁ దగినపొసఁగుడు—

అంశు—నీవింక నోరు మూసికొనుము. పరమతుచ్ఛమైనప్రసంగముచేఁ గాలమువృథగాఁ జేసితివి. విను. రాముఁడు పరసతీదూరుఁడు.

శర—ఇప్పుడు స్వసతీదూరుఁ డగుటచే నాగపడితిని. పోనీ—నాకర్మ మేదో నేను జూచుకొందును. చూడు! వాలిని సుగ్రీవుఁడే చంపెనని కొందఱు, రాముఁడు చంపెనని కొందఱు, నాత్మహత్య చేసికొనె నని కొందఱు చెప్పుదురు. దీనియథార్థ మేదియో నాకుఁ జెప్పుము.

అంశు—నీ వీగ్రామమున కెప్పుడు వచ్చితివి?

శర—ఎప్పుడు? ఏదయ్యా! అరగడియ కాలేదు. నాభాగ్య నావంక నింటిలోఁ బృష్ఠముఁ ద్రిప్పుటయు నే నీమొగము చూచుటయు నొక్కసారి సంభవించెను.

అంశు—ఏప్పిన ట్లే యున్నది. వాలిమరణమునుగూర్చి యడిగితివి కాదా?

శర—ఔను. ఆమూఁటిలో నేది సత్యము?

అంశు—మూఁడును సత్యములే—

శర — అదెట్లు?

అంశు — సుగ్రీవునితో యుద్ధము సేయుచుండఁగ, రామచంద్రునిచేత, స్వకృతఘోరపాపఫలముగ నాతఁడు మరణించెను.

శర — అట్లయిన రాముఁడుఁ గూడ వాలినిఁ దాఁకినాఁడా?

అంశు — లేదు.

శర — విషము పెట్టి చంపెనా?

అంశు — లేదు. చెట్టుచాటున నుండి బాణమొకటి యొసఁగి—

శర — నాకీగాథ వినుటను నారంభించుటచేఁ దల యెట్లో, శోకమెట్లో తెలియకున్నది. నాయనా! దయయుంచి మొదటినుండియుఁ జెప్పుము.

అంశు — నీకొఱకు రామాయణము తిరిగి యారంభింపవలయునా? రాము నెఱుఁగుదువా?

శర — వినికివలన—

అంశు — దశరథుఁ డని యొక రాజుండెను.

శర — అతని నెఱుఁగుదును.

అంశు — ఎటు లెఱుఁగుదువు?

శర — చూచుటవలన. అతనిపై నాకుఁ బూర్ణమైనయభిమానము కూడను.

అంశు — ఏల?

శర — అతనిమొగము మాకుమారుల నామొగముఁబోలి యుండును.

అంశు — ఎట్లు చూచితివి?

శర — కన్నులతో—

అంశు — ఎందుచేత వారిదర్శనము నీకయ్యెను?

శర — దశరథుఁడు భార్యాసహితముగ నిగుల దీక్షించుచుఁ బుత్రకామేష్టి సేయుచుండఁగ హవిర్భాగార్థినై పోయితిని. రాముఁ డప్పటికిఁ జేయియెత్తుపాడవుమనుజుఁడై యుండెనఁట.

అంశు—రాముఁడు పుట్టినతరువాతఁ బుత్త్రకామేష్టి యేమిటిరా నీమొగము! అప్పుడు రాముని నీవు చూచితివా?

శర—నారచీరలు ధరించుటకు రామలక్ష్మణులు విజనస్థలమునకుఁ బోయిరని వింటిని. జానకిని జూచినట్లే జ్ఞప్తి యున్నది. ఏదో యిత్తన మాగునని, కడుపు చల్లఁబడు నని వెళ్లఁగ నేడుపులు, పెడబొబ్బలు, కడుపుపుండికొనిపోవుటలు తప్ప నేమియు లేకపోవుట చేతఁ బరదేశమున నేడ్చుటకంటె స్వదేశమున నేడ్చుట కొంత లాభకర మని యెంచి తిరిగి వచ్చితిని.

అంశు—అయినను నీవు చూచినది పుత్త్రకామేష్టి కాదు. రామపట్టాభిషేకభంగము సరిసరి! అంతవఱకుఁ బూర్వగాథ నీ వెఱిఁగినట్లే కద!

శర—ఆహా!

అంశు—అట్లు రాముఁడు పితృవాక్యపరిపాలనదీక్షచే దండకాటవికి వచ్చి యనేకమునుల సేవించి, విరాధాదుల వధించి, పంచవటియందు నివసించి, తన్ను మోహించినశూర్పణఖకుఁ గర్ణనాసికాచ్ఛేదనము గావించి, ఆమెచే రణరంగమునకుఁ బ్రేరితులగుఖరదూషణాదుల వధించి, రావణప్రోత్సాహముచే మాయలేడిరూపమును ధరించినమారీచుని వధించి, రావణునిచే సీతను గోలుపోయి, సీతాన్వేషణార్థమై దక్షిణమునకుఁ బోవుచుఁ గిష్కింధకు వచ్చెను.

శర—నీవు చెప్పినసంగ్రహ మిదివఱకుఁ గథ తెలిసినవానికి జ్ఞాపకార్థమై యుపయోగము గాని నాకది నట్టడవివలెనే యున్నది.

అంశు—మనకు నట్టడవులు స్వగృహములే కద! తరువాతఁ జెప్పెదను వినుము.

శర—చెప్పవిదే.

అం:సు — మతంగశాపముచే వాలికి వాల్యనుచరులకు దఱిఁజేర నవకాశము లేనిఋశ్యమూకపర్వతమున సుగ్రీవుఁడు హనుమదాదిముఖ్యులగు నలుగురతోడ నుండి దూరమునుండి వచ్చు రామలక్ష్మణులఁ గాంచి వారెవరో తెలియఁగోరుట కాంజనేయుని వారి సన్నిధికిఁ బంపెను.

శర — అన్నిఁటి కాంజనేయుఁడు సిద్ధమే. పెండ్లి కాకపోవుటచేఁ బెటపెట లాడుచున్నాఁడు. అయియుండినయెడల సాఁగి చప్పఁబడి నావలెఁ జచ్చిన ట్లుండవలసినవాఁడు.

అంసు — ఊరకుండుము. పూజ్యు నేల దూషించెదవు? ఆకేసరిపుత్త్రుఁడు దాశరథులను సన్యాసివేషమున సమీపించి —

శర — జన్మసన్యాసి కిఁక వేష మేల?

అంసు — వారలయోగక్షేమ మడిగి వారివలన రాజ్యభ్రష్టతయు, నరణ్యావాసమును, సీతానష్టమును, సుగ్రీవసఖ్యాభిసంధియుఁ దెలిసికొని —

శర — అయ్యో! వీరికొకనితో స్నేహ మేల?

అంసు — తత్సాహాయ్యమున సీతాన్వేషణము సేయుటకు —

శర — చేసి?

అంసు — తదపహర్త యగురావణుని వధించుటకు —

శర — రావణవధమే ప్రధాన మగునెడల నాతనిని సప్తసముద్రములఁ గక్షమందుంచుకొని ముంచినవాలితో సఖ్యమొనర్పవలసియుండ — కేవలముబుద్ధిమాలినతనము గాని — ఊరు పేరు లేక, నిర్భాగ్యుఁ డగుసుగ్రీవునితో సఖ్యము సేయుతలఁ పేమి?

అంసు — నీబుద్ధిలేనితనము నీనిర్భాగ్యత్వమును మహానుభావులయెడల నారోపించెద వేల? సుగ్రీవుని జేపట్టుటలో రామచంద్రుఁడగపడినది దీనబాంధవప్రసాదము.

శర—ఆహాహా! ఈముష్టిలో వైష్ణవసాంప్రదాయమా? ఈపనికిమాలినతనములో భాగవతాపద్రక్షణమర్యాదయా? ఈబానిసతనములో—ఈభార్యావిలాపములలో—

అంశు—అంతటితోఁ గట్టిపెట్టుము. వృథావాగాడంబర మేల?

శర—కాదయ్యా! నాకుఁ దెలియక యడుగుచున్నఁ దప్పేమి? సుగ్రీవుఁడు దీనుఁడా? రాముఁడు దీనబాంధుఁడా? సుగ్రీవుఁడు భ్రష్టరాజ్యుఁ డయ్యునుఁ రాజ్యమునందే యున్నాఁడు. పేరునకైన మంత్రి యొకఁ డాతని కున్నాఁడు. మఱికొంద ఱనుచరులు విధేయులై యున్నారు. ఇఁక రాముఁడో భ్రష్టరాజ్యుఁడై రాజ్యమును వదలి యడవులలోఁ బడి దిక్కులేక, అడవిమృగములకంటె సతీహీనుఁడై యొక్కతమ్మునితో నిత్యరోదనము సేయుచు సంచరించుచున్నాఁడు. రామసుగ్రీవులలో దీనుఁ డెవ్వఁడో దీనతరుఁ డెవ్వఁడో చెప్పవలయునా? సుగ్రీవునిభార్య తనకుఁ గావలసినవాఁడై రక్తబంధుఁడై భర్తచచ్చినపిమ్మట నాచారమున ననుసరించి భర్తకావలసినయన్నచే హరింపఁబడినది. ఇఁక రామునిభార్యయో? ఏజన్మమున నేసంబంధము లేనట్టియు మహావైరి యైనట్టియు నసురాగ్రణిచే హరింపఁబడినది. సుగ్రీవుని భార్య యెచ్చట నున్నదో యెటు లున్నదో సుగ్రీవునకుఁ దెలియును. రామున కట్లు తెలియదు కద! రుమ యెన్నటికైనఁ దన్నుఁ జేరఁగల దనునాశ సుగ్రీవున కున్నది. రామునకట్టియాస లేదుకద! అది గాక—తనభార్యను వాలి హరింపఁగ వాలికి మాత్ర మట్టిపరాభవము నేను జేయలేదా యనుమనస్సంతుష్టి యైన సుగ్రీవునకున్నది. కాని రామున కేమున్నది?

అంశు—ఏమీ చినక్లేయున్నది. అది యొకసంతుష్టికారణమా? అట్టిచో రావణుని చెల్లెలగు శూర్పణఖను బరాభవించితిమి కదా యను సంతుష్టి రామునకు మాత్రము లేదా?

శర—సరే నయ్యా! పోనీ! రామసుగ్రీవులలో సుగ్రీవుఁడు దీనుఁడు. రాముఁడు దీనతరుఁడుగఁ గనఁబడుచుండెఁగదా! అనురూపదుఃఖప్రాబల్యమున, విపత్సమానదౌర్భాగ్యప్రారబ్ధమున, నొకనిని జూచి యొకఁ డేడ్చుచు నొకనిగలిసిబట్టి యొకఁడు తన్నోదార్చుకొనుస్థితిలో దీనతరుఁడగు రాముఁడు దీనుఁడగు సుగ్రీవుని నాయనా! సంశోపాటునాఁడవు నీవుంటివా? యని కౌఁగిలించుకొని కూనురాగములఁ దీయుచుఁ దత్సాహాయ్యమునకై యాచించుట యాపత్పరిరక్షణ మయ్యెనా? అనాథనాథత్వ మయ్యెనా? హేం హేం హేం!

అంశు—కాలేదా? ఊరక యేల వదరెదవు? రామచంద్రునిచర్య యాపన్నరక్షణము కాలేదా? అనాథనాథత్వము కాలేదా?

శర—ఏలాగయ్యా?

అంశు—అనవరత మఱిచేతిలోఁ బ్రాణము లుంచుకొని కాలక్షేపము సేయుసుగ్రీవుఁడు రామునిచే రక్షింపఁబడి యాశ్వాముక్తుఁడై మహానందమున నున్నాఁడు కాఁడా? రామచంద్రుని యీచర్య యాపన్నరక్షణము కాలేదా? ఇదివఱకు నాథుఁడు గాకయుండు సుగ్రీవుఁ డిప్పుడు కిష్కింధానాథుఁ డయ్యెను గాదా? ఇదివఱ కనాథగ విలపించుచున్న యిప్పుడు సనాథయై సుఖముగ నున్నది కాదా? రామమూర్తి యీపని యనాథనాథత్వము కాలేదా?

శర—ఆ! అయినది. అనాథయైన తార—అసుచిదినములలోనే—సనాథగఁ జేయఁబడుటచే నతని కనాథనాథత్వము సిద్ధించినది. అనా

థలకుఁడానే నాథుఁడైనచో ననాథనాథత్వము సంపూర్ణముగ సిద్ధించును. ఏమోదాఁటికొనిపోవుమాటలఁ జెప్పితివి! నా కంత నచ్చలేదు.

అంశు—నీకు నచ్చుటకే లోకమందుఁ గార్యములు చేయఁబడునా?

శర—లోకమునకు నచ్చవలయునా లేదా? నావంటివాండ్రు కలసియే లోక మగునుగాదా? అయినను గథ వినవలసినాకు వ్యాఖ్యానముతోఁ బని యేమి? ఏది? కానీ! సుగ్రీవునితో సఖ్యమునకై రామలక్ష్మణు లాంజనేయునిచే సుగ్రీవునియొద్దకుఁ దీసికొని రాఁబడిరి. తరువాత—

అంశు—వాలిచేఁ దనకుఁగలిగినసర్వకష్టములను సుగ్రీవుఁడు నివేదింపఁగ దయార్ద్రహృదయుఁ డగురామభద్రుఁడు వాలిని జంపుటకు శపథము చేసెను. సీతాన్వేషణము సేయించి రావణవధకార్యమున నతనికి సాహాయ్య మొనర్తు నని సుగ్రీవుఁడు ప్రతిశపథము చేసెను. ఇట్లగ్నిసన్నిధి నిద్దఱుసఖ్యముఁ గావించుకొనిరి.

శర—వానరుఁ డేమి? నరుఁ డేమి? అగ్నిసాక్షికముగ సఖ్య మేమి? రాముఁడు వర్ణసాంకర్య మారంభించినాఁడా? ఇఁక జాతులు భ్రష్టములై పోవలసినదేనా?

అంశు—ఇట్లు లేచ్చవాఁడ వగునీవు రామచంద్రునకు నీభార్య నేల యర్పింపఁదలఁచితివి?

శర—అది వేఱయ్యా! అది వైదికకాండలోనిది కాదు. లౌకికవుఁ దంతు. అవసరోచితలఘుక్రియ. దానివలన మతమునకుఁ బ్రతిబంధము లేదు. పరమునకుఁ బ్రత్యవాయము లేదు.

అంశు—ఏడ్చినట్లే యున్నది. ఇఁకఁ జాలు!

శర—సరే! చాలినయెడలఁ బైకథఁ జెప్పుము.

అంశు—శ్రీరామమూర్తిని స్వబాహుపాటవమును ధనుర్విద్యాపాండితిని జూపింపు మని సుగ్రీవుఁడు కోరఁగ—

శర—వాలిని జంపఁగలఁడో లేఁడో యనుసందేహముచేత నని చెప్పవేమి?

అంశు—వాలిపాదమున నెత్తఁగలదుందుభికళేబరమును రామచంద్రుఁడు పాదాంగుష్ఠమున నంతరిక్షమున కెగయమీటెను. అదిగాక వాలి కసాధ్యమగుకార్యము నొకబాణమున మఱియొక దానిని జేసినాఁడు.

శర—దేనిని?

అంశు—సప్తతాళవిచ్ఛేదమును—

శర—సప్తతాళవిచ్ఛేదమా? గాన మారంభించునెడల నామాత్రపుఁబనిని నేనును జేయఁగలను. ఈరెండుమహాకార్యములఁ జూచి రాముఁడు వాలిని వధింపఁగలఁడనువిశ్వాసము సుగ్రీవునకుఁ గలిగెను గాఁబోలు! అట్లైన సుగ్రీవుఁడు వాలిని ద్వంద్వయుద్ధమునకై యాహ్వానము సేసెనా?

అంశు—చేసెను.

శర—సరి. అప్పుడు దొంగపోటున వాలిని రాముఁడు కూల్చెను గాఁబోలు!

అంశు—అప్పుడు వాలివధ జరుగలేదు.

శర—గుడ్డికొక్కెర చేఁపను మ్రింగునట్లైన మ్రింగక చెట్టుచాటునఁగూరుచుండికూడఁ జంపుట కీభయ మేలా?

అంశు—భయము కాదు.

శర—పరమార్థచింత కాఁబోలు!

అంశు—అపుడు సర్వవిధములచే సాదృశ్యమొందిన వాలిసుగ్రీవు

లో: బరమార్థముగ వాలి యెవఁడో గ్రహించుట కవకాశము లేక—

శర—అవకాశము లేక యేమి? బుద్ధి లేక—తీక్ష్ణదృష్టి లేక—

అంశు—అట్లు ప్రేలుచున్నావు. ఉండిన నట్లందువా?

శర—బుద్ధి యున్నవాఁడవు. దూరదృష్టి యున్నవాఁడవు. రాముఁడు దీనబంధుఁ డని నమ్మినవాఁడవు. వాలి పరమదుర్మార్గుఁ డని తలఁచినవాఁడవు. సుగ్రీవుఁడు పరమప్రపన్ను డని నమ్మినవాఁడవు. నీవు చెప్పరాదా? ఏదీ! అటువిమ్మట వాలిచేతఁ జెప్పు దెబ్బలు చావుతన్నులు తిని—భాగవతోత్తముఁ డగు సుగ్రీవుఁడు—ఒడలు మండ—నోరెండ—కంట నీరొలుక—ముక్కుల రక్త మొలుక—తనువునఁ దట్టులు దేర—చెమ్మట వెల్లువలై పాఱ—దీనబంధుఁ డగు శ్రీరామమూర్తి తిరువడిత్తో మరల కైంకర్యము సాయించుటకు, ముకుళితహస్తుఁడై భక్తి వినమ్రుఁడై వేంచేసెను గాఁబోలు!

అంశు—నీనోటి కడ్డు లేకున్న దేమి?

శర—గొప్పవారి చేష్టలవలె—

అంశు—ఇప్పుడుమహారాజెవఁడో యెఱుఁగుదువా?

శర—నాభార్యకుఁ—దన్మూలకముగ నాకు—నుపయోగింపనివాఁడు సార్వభౌముఁడైన మాకేమి? సన్యాసి యైన మాకేమి? మహాపురుషుఁడైన నేమి? నపుంసకుఁ డైన నేమి? సింహాసనమున నున్న నేమి? చితి నున్న నేమి?

అంశు—ముందు మీ కుపయోగించుటమాట యటుంచుము. నీ విట్లు దూషించితివని మహారాజునకుఁ దెలిపిన నీపండ్లూడఁ గొట్టును.

శర—నామట్టునకు నాకఁ బండ్లూడఁగొట్టిన విచారము లేదు. శేషకాలము మీసుగ్రీవమహారాజుగారితండ్రిగారివలెఁ గాలక్షేపము

చేయలేక పోవుదునా? చూడు! ""ముందు మీ కుపయోగించు టమాట,, యని నీవంటివే? నాయనా! అట్టియూస యేమైన నున్న యెడల—

అంశు—ఓరి నీయాశ కాలిపోను?

శర—మనము కాలిపోవువఱకు విడువకుండ నాశ్రయించుకొని యుండున దదియొక్కటే. సుగ్రీవుని యెముకలు పొడియగునట్లు వాలి మోదుచుండఁగా రాముఁడు తటస్థుఁడై చూచుచుండెను గదా? అట్టిచో దిక్కుమాలినయూశాపాశమాహాత్మ్యముచేఁ గాకపోయినయెడల సుగ్రీవుఁడు రామునొద్దకు సిగ్గును విడిచి, బుద్ధిని విడిచి, యేల తిరిగిపోవలయును? చూడు! నీ విదివఱకు రామునొద్దకు సుగ్రీవుఁడు పోయినట్లు చెప్పియుండ లేదు కాఁబోలు! నే నట్లు తలఁచుకొని యందుపై వ్యాఖ్యానము సేయుచున్నాను. వెళ్లినాఁడా? ఇన్ని దెబ్బలు పడి, లజ్జఁపడి, దైన్య పడి, వెళ్లినట్లే కద!

అంశు—ఆ.

శర—చూచితివా? రాముని యాశ్రితవాత్సల్యము! ఆపద్రక్షణపాటవము!

అంశు—రామునకున్న దాపద్రక్షణమే కాదు. అపరాధిశిక్షణము కూడను.

శర—ఇది యొకటియా? చెప్పవైతివి! సుగ్రీవుఁ డాతనియెడల నపరాధముకూడఁ జేసినాఁడా?

అంశు—ఆ. స్వల్పముగ—

శర—ఏదయ్యా! అగ్నిసాక్షికసఖ్యమునకుఁబూర్వమా యనంతరమా?

అంశు—పూర్వమందే—సుగ్రీవాంజనేయులు రామలక్ష్మణులఁ బ్రథమదర్శనమునకై యెదుర్కొను వేళ నొకచిత్రము జరిగినది.

శర—భూతలనాథులు క్రోఁతులనాథు లగుటకంటెఁ జిత్రమేమున్నది?
కానీ—

అంశు—సుగ్రీవుఁడు రామలక్ష్మణుల సమీపించి యొకవృక్షశాఖను విఱిచి రాముని కాస్తరణముగ నిచ్చి యొకవృక్షశాఖను విఱిచి తనకాసనముగఁ జేసికొని యూరకుండెను. లక్ష్మణునెడల నిట్లు తూష్ణీంభావమున నుండ నంతలో మహాబుద్ధిశాలి యగునంజనాసుతుఁడు తటాలున నొకకొమ్మను విఱిచి లక్ష్మణుని దానిపైఁ గూర్చుండఁబెట్టి మఱియొకశాఖను విఱిచి తానుదానిపైఁ గూర్చుండెను. తన్ను గౌరవించినప్పటికిఁ దనదాసుఁడగు లక్ష్మణుని నిర్లక్ష్యముగఁ జూచినసుగ్రీవుఁ డపరాధియని రామభద్రుఁ డెంచి యాతనికిఁ దగుప్రాయశ్చిత్త మొనర్చి బుద్ధిఁ జెప్పనిశ్చయించుకొని ద్వంద్వయుద్ధమున నాతని నుపేక్షించి వాలిచేఁ దాడన మొనర్పఁ జేసెను. భగవంతుని నిందించిన నాతఁడు సహించును గాని తద్దాసుల నగౌరవపఱిచిన నాతఁడు సహింపఁడు. ఆతఁడు దాసవత్సలుఁడు. భక్తదయాళుఁడు.

శర—హా. హాహా! ఇదివైష్ణవసాంప్రదాయము కాఁబోలు! కాని యీ క్రొత్తపోదిని నీ వెక్కడ వింటివి. పండుక్రోఁతు లన్ని యిఁకఁ బంగనామాలు ధరించిభాగవతోత్తములై పాడై పోవలసినప్రారబ్ధము పట్టినది కాఁబోలు! చూడు! నే నేమైన నంటి నని నీ విబ్బందిపడవలదు. నీకథను నీవు కానిచ్చుచుండుము. తరువాత?

అంశు—శ్రీరామమూర్తి సుగ్రీవుని జూచి యోదార్చి లక్ష్మణునిచే నభిజ్ఞానార్థమై గజపుష్పలత నాతనిమెడఁ గీలింపఁ జేసెను. లక్ష్మణునిచే నీపనిచేయించుట యేల యనఁగ—తనచే వెనుక పరాభవింపఁబడినయాలక్ష్మణుఁడే తనకుఁ గష్టదశోత్తారణార్థ మైన సాధన మీరీతిగ నగుటవలన సుగ్రీవునిమనస్సు పరిపాకదశ నొం

డు నని కరుణాసముద్రుండైన రామభద్రుండు శిక్షచేసెను. మహాత్ములకార్యములకు గంభీరము లగునుద్దేశము లుండును. లఘుబుద్ధుల మైనమనము వానిని గ్రహింపలేక గురుజననిరసన మొనరింతుము. అది మహాదోషము. ఏమహాపాపముననో యిట్టిదురవస్థల నుంటిమి. ఇంక నిష్కారణముగ మహాజనపరిహాస మొనర్చి యేల మఱింతపాపము కట్టుకొనవలయును?

శర— మనదురవస్థలకు మనపాపములు కారణము లైనట్లే యీమహాజనులదురవస్థలకు వారిపాపములే కారణములు. వారిదురవస్థలు మనవానికంటె ఘనములుకావున వారు మనకంటె నెక్కువపాపాత్ము లనుట స్పష్టము. పాపులను పాపు లనిచెప్పినఁ బాపమేమున్నది?

అంశు— ఓరీ నిర్భాగ్యుఁడా! నీనాలుకకుఁ గోయు! ఊరక మహారాజనింద నేల చేసెదవు?

శర— మహారాజు లగువారు నాకంటె యోగ్యు లగునెడల నేను గౌరవింపవలసినదే!

అంశు— ఓరి పనికిమాలినవాఁడా! శ్రీరామభద్రుఁడు నీమాత్రపు యోగ్యుఁడైనఁగాఁడా?

శర— కాఁడు.

అంశు— ఎందుచేత?

శర— నేను మహారాజనిందమాత్రమే చేసితిని. ఆతఁడు— మహారాజును బొంచి డబ్బాటుగ వధించినాఁడు. ఏమి? మాటలాడవేమి?

అంశు— వాలి, నీకు, నాకునితరవానరులకు మహారాజు గాని రామచంద్రున కేమి మహారాజు? సకలార్యావర్తదేశమునకు రామభద్రుండే సార్వభౌముఁడుకద!

శర— అసత్యము.

అంశు—ఆతనితమ్ముఁడు భరతుఁ డెవనిపాదుకలను బ్రభుస్థానమున నుంచుకొని పరిపాలించుచున్నాఁడు?

శర—ఎట్లయినఁ బరిపాలించుచున్నవాఁడు భరతుఁడు.

అంశు—సరే. ఆతనియధికారమును ధరించి యాతనిసందేశమును నిర్వర్తించుటకే రామచంద్రుఁడు వచ్చె ననుకొందము. అట్లయిన రాజప్రతినిధి యగు రామభద్రున కీకిష్కింధాంతి యగు వాలి సామాన్యసేవకునివంటివాఁడు కాఁడా?

శర—సామాన్యసేవకుని జాటునుండి చంపుటకుఁ జట్టమున్నదికాఁబోలు నేమి?

అంశు—ఆధిపత్యముచే వాలి సామాన్యుఁ డయ్యెను పాపములచే మహాసార్వభౌముఁడు. చక్రవర్తిప్రతినిధి యగుటచే రామునకు దుష్టవాలినిగ్రహమునకుఁ బూర్ణమైనయధికార ముండెను. మహాపాపభూయిష్ఠతచే నాతనివలన వధమొందుటకు వాలికి సంపూర్ణమగుసర్వాతి యుండెను. ఇఁక దోషమేమున్నది?

శర—శిక్షణమునకుఁగ్రమ మిదియేనా? అన్నకుఁదమ్మునకుఁగలహముకల్పించి, వారు ద్వేషమునఁ బోరాడుచుండఁగ నదివఱకుఁ జేసికొన్న రహస్యము లగునన్యాయసమయముల ననుసరించి, పుట్టచాటునఁ గూర్చుండి, బల్లి పురుగును మ్రింగినట్లు పిల్లియెలుకను బట్టునట్లు పరాఙ్ముఖుఁ డైనయన్నగారిని జంపుట శిక్షాసాంప్రదాయమేనా? నేరము చేసినాఁ డనుకొనిన వానియింటిసమీపమునకు వచ్చి గోడచాటుననో దొడ్డిలోనో దాఁగి నేరగాని బంటునో భార్యనో వశపఱుచుకొని యర్ధరాత్రమున వానికిఁ బ్రక్కలోఁ బామును బెట్టించికాని యాహారములో విషము పెట్టించికాని యాతనిని గిక్కురుమనకుండఁ జంపించుట యధికారి యొనర్పవలసిన శిక్షావిధియేనా? నేర మేదో వానికిఁ దెలియపఱుపనక్క-

ఱ లేదా? దానికి సాక్ష్య మక్కఱ లేదా? విచారణ మక్కఱ లేదా?

అంశు—ఏవియు నక్కఱ లేదు. తన నేరము లెవ్వో లోకప్రఖ్యాతములైనప్పుడు తానుమాత్ర మేల యెఱుఁగడు? తనతోఁ జెప్ప నేల? సాక్ష్యముకూడ నక్కఱ లేదు. మునిమండలికి మహాకంటకమై తానున్నట్లు మతంగమహర్షియే సాక్షి! నీవంటినిర్భాగ్యులభార్యలను హరించుననుటకు నీవే సాక్షివి. తమ్ముని భార్యను బలాత్కారముగఁ బట్టినందులకు సుగ్రీవుఁడే సాక్షి. తమ్ముని ననాదరించుచున్నాఁ డనుటకుఁ గాతఁడనిషిద్ధశయే సాక్షి. ఇన్నిప్రబలనిదర్శనములు వాలి మహాదోషుఁ డని ఘోషించుచుండ విచారణ మక్కఱ లేదా యని మతిలేక యడుగ నేల? తప్పునుగూర్చి సంశయమున్నప్పుడు విచారణము గాని జగద్విఖ్యాతములై మహాజనాపకారము లగు నేరములు సహస్రముఖముల మొఱవెట్టుచుండ "నీవు నేరము చేసిన ట్లున్నది. నీవు దీని కేమి చెప్పెదవు," వని గౌరవపూర్వకముగ నడుగు మంటివా? వాలి బంధుఘాతుకుఁడు. బహుచలితేంద్రియుఁడు. పరమక్రూరుఁడు. పరమతాపసబాధాకరుఁడు. భ్రాతృభార్యాపహర్త.

శర—సుగ్రీవుఁడుమాత్ర మేమో? తారాపహర్త కాఁడా?

అంశు—అది వేఱు. మాయావిని శిక్షించుటకై యాతనితో గిరిగహ్వరము సొచ్చినవాలి యొకవత్సరమువఱకుఁ బైకి రాకుండుటఁ గాంచి యాతఁడు మృతుఁడై యుండె నని దుఃఖముతో నిశ్చయపఱుచుకొని యాచారము ననుసరించి మృతభ్రాతృభార్యను స్వీకరించెను. అది ప్రమాదము. వాలి నేర మట్లున్నదా? నేను సుగ్రీవునివాఁడ నని వాలిపై లేనినింద మోపను. నీవు వాలివాఁడ వని నీవు లేనిపోనిసద్దుబాటులు సేయకుము.

శర—నేను వాలి వాఁడను మఱింతకాఁదలఁచి పెట్టుకొనినకొండంతయూ నయిట్లుపిండి యైనను నేను వాలివాఁడ నని నీవుమాటకైన నంటివి!

అంశు—వెనుకటిదేమువేనా? తిరిగి సతిఁగూర్చి వంతయేనా?

శర—కాకేమి? సతియున్నంతకాలము వంత తప్పునా? సతిచింతచేతనే కదా రాముఁ డిక్కడిక్రోఁతులతో గుటగుటలాడుచున్నాఁడు! సతిచింత నేకదా సుగ్రీవుఁడన్నగారిని గ్రమింగినాఁడు!

అంశు—వారిచింత బలాత్కృతముగఁ బరాధీన లగుసతులను దిరిగి గ్రహించుట కైయుండ నీచింత యున్నదానిని బుద్ధిపూర్వకముగఁ బరాధీనను జేయఁ బ్రయత్నించుటకుఁ గాదా?

శర—హుఁ! చేయఁబ్రయత్నించుటయో చేసిచూపించుటయో వాలిబ్రతికియుండిన నగపడును. ఈదిక్కుమాలిన చోరవధము వచ్చునని నా కేట్లు తెలియును. రాముఁ డేమి శూరుఁడు కాఁడా? అస్త్రప్రయోగ మెఱుఁగఁడా? తన కీదొంగతన మేల? ముడుచుకొని మూల దాఁగియుండు టేల? యెదుటఁబడి యుద్ధ మొనర్చిన వాలిపస యెట్టిదో తనపస యెట్టిదో లోకమునకుఁ దెలియునుగాదా?

అంశు—అభిముఖుఁడై యాహవమొనర్చుటకు రామచంద్రునకు వాలి పైఁ బగయేమున్నది?

శర—పగ లేదు కాని ప్రాణము లెగురఁగొట్టవచ్చును. శత్రుత్వము లేదుకాని చావఁగొట్టవచ్చును. ఏమి?

అంశు—రామునకు వాలి చేసినయపకార మేమియు లేదు. అయినను రామునిచేఁ బరిపాలింపఁబడులోకమున కీతఁడు మహాపకారి. అందుచే శిక్షాపాత్రుఁడయ్యెను.

శర—ఆశిక్షయైన నెదుటఁబడి చేయరాదా?

ము కట్టుకొనవలయును? వనప్రదేశములలోని శీతబాధ సహింప లేక చర్మమునకై యైననాసపడెనేమోయనుకొన్న నది ధారణయోగ్యమునుగాదే? పోనీ! ఆ నేలలోఁ దలమోపి శయనింపలేక బాధపడుచుండుతాను దానివెంట్రుకలైనఁ దీసినారసంచిలో నుంచి దానిని దలాడక్రిందనుపయోగపఱుచుకొనుట కెంచి నాఁడనుకొన్న నామహారాజునకు వార్ధకమునఁ దనువునుండు రోమము లన్నియునూడిపోయెనే? ఎంతయున్మత్తుఁడైన నట్టిపర నష్టప్రదస్వలాభశూన్య మగుహింసను జేయునా?

అంశు—భక్ష్యములైనమృగములనుమాత్రమే వేఁటాడవలయునా? జన జంతునాశకము లగుశార్దూలాదులను వేఁటలో మహారాజులు హింసించి లోకోపకారమును జేయరా?

శర—శార్దూలచర్మము నాసనముగ నుపయోగించుకొనవచ్చును. తన్న ఖములను స్వర్ణమునఁ గూర్చి పదకములుగ నుపయోగించు కొందురు. కాని—

అంశు—చర్మనఖగ్రహణాశచే శార్దూలమును జంపుట, జాలునకై సింహమును జంపుట యెన్నఁడును జరుగలేదు. చంపఁబడినతరువాత నక్కలకువచ్చినదానిని జాగ్రత్తపెట్టుకొందురు. కాని యీఁకెలకొఱకు, నెముకముక్కలకొఱకు వేఁటకుఁబోవుదురా? లోకహానికరము లగుమహాజంతువులను వేఁటలో వధించినట్లే జగదపకారకచర్య గలవాలిమృగమును రాముఁడువధించెను.

శర—నోటికి వచ్చిన ట్లెల్ల సమర్థించుచున్నావు. కాని, శిక్షయొక్క యుద్దేశ మేమి? నేరగానిప్రాణములు హరించి పగఁ దీర్చుకొనుట కాదుగదా?

అంశు—కాదు.

శర—కానియెడల శిక్ష యన నేమి?

అంశు—పాపప్రాయశ్చిత్తము.

శర—అడిగో! ఈపాడుమాటలఁ జెప్పకుము. ప్రాయశ్చిత్తఫల మేమి?

అంశు—పశ్చాత్తాపము.

శర—అనఁగ—స్పష్టముగఁ జెప్పుము.

అంశు—దోషియగువాఁడు మున్నుఁ దానొనర్చినదోషములకై మిగుల వ్యసన మొందుట.

శర—అంతయేనా?

అంశు—ముందట్టిపాపములు సేయకుండునట్లు బుద్ధి తెచ్చుకొనుట.

శర—రా! అటులు దారిలోనికి రా! కావున శిక్షయుద్దేశము తప్పొనర్చినవానికి మంచిబుద్ధి నిచ్చుట. అంతయే కాదా?

అంశు—అవును.

శర—చచ్చినవాని కేమిబుద్ధి వచ్చు నని రాముఁడు బుద్ధిహీనుఁడై వాలిని జంపెను?

అంశు—వచ్చినదా? వచ్చి తీరినదా? బాణపీడితుఁడై మొదట నాతఁడు గొన్నియసందర్భపుమాట లాడినను శ్రీరామచంద్రుని మహనీయకళ్యాణగుణపరిపూర్ణపరమపవిత్రస్వరూపసేవచే నజ్ఞానకృతమగుతనయగౌరవపూర్వకసంభాషణమునకుఁ బరితాపము నొంది తనపూర్వపాపములకై మహాచింతఁ బడి తదలౌకికవిగ్రహమునకు నమస్కార మొనర్చి జ్ఞానదీపప్రశోభితమనస్కుఁడై తద్వదనపుండరీకవినిక్షిప్తదృష్టిప్రసారుఁడై మహానందమున దేహత్యాగ మొనర్చెను.

శర—బుద్ధి వచ్చినతరువాతఁ గొంతకాలమైన జీవింపకుండినయెడల బుద్ధి వలనఁ బ్రయోజన మేమి?

అంశు—ఎంతపామరుఁడవు! జ్ఞానోదయ మైనపిమ్మట యిచ్చట నుండ వలసినపనియేమి?

శర—అట్టులైన జ్ఞానోదయ మగునీవుకూడ నడువలేకపోయితివా? ఇన్ని కాక యిఁక నిన్ని నీవు చెప్పిన సరే కాని రాముఁడు చేసినపని యన్యాయ మని నాకుఁదోఁచక మానదు.

అంశు—రామభద్రుఁడు తనకు మహోపకార మొనర్చినాఁడని యా మహామహుని వాలి యనేకవిధముల సంస్తుతులు సేసియుండఁగ నీ విట్లేడ్చెద వేల?

శర—మించినదాని కంతకంటె నేమి సేయును? కాని వాలి కిది మహోపకార మెట్లు?

అంశు—పాపపరిశాంతి కాకుండనే వాలి మరణించునెడల నాతఁడు నరకలోకమున నెన్నిమహాయుగములు తపింపవలసియుండునో?

శర—అదేపనిగఁ బాపము లందు వేల? పాపము లేమి యాతఁడు సేసెను?

అంశు—ఆతనిమహాపాపముల నాతఁడే యొప్పుకొనఁగ నీవు లేదందు వేల? అట్టినరకలోకాభీలమహాశిక్షకు శాశ్వతముగఁ బాలుకాకుండనిట మహారాజదండనము నొంది. పశ్చాత్తాప మొంది, జ్ఞానప్రదీప్తుఁడై పుణ్యగతి నొందెను. ఇంతకంటె మహోపకార మేమున్నది?

శర—కొలఁదిగాని కుమ్ముసుద్దులతో రెండుగడియలు వృథయై పోయినవి కదా?

అంశు—మహాపురుషగుణానుసంధానమున నీరెండుగడియలే పవిత్రములైన వనుకొనుము.

శర—నీకు వైష్ణవము ముదిరినది.

అంశు—నీయజ్ఞానమువలె—

శర—రాముఁడు తనశపథ మీరీతిగ నెఱవేర్చుకొనియెఁ గదా? సుగ్రీవుఁడు తనశపథమైన సీతాన్వేషణప్రయత్న మేల యారంభింప లేదు?

అంశు—ఏమీ? అపరిమితవర్షములు! మింటికి మంటికి కొకటేధార! చెఱువులు తెగినవి. నదులు పొంగినవి. అనేకగ్రామము లుదకమగ్నము లైనవి. జీవనాశన మపరిమితముగ నైనది.

శర—రామలక్ష్మణులు జీవించియున్నారు కాదా? ఎచ్చటనున్నారయ్యా?

అంశు—ప్రస్రవణపర్వతమున—

శర—వర్షము లిప్పుడు వెనుకపట్టినవి కదా యింకఁ దడ వేల?

అంశు—సీతాన్వేషణముఁగూర్చి నీకుఁ దొందర యేల?

శర—అది నాప్రయత్నమునకు మిక్కిలి సాహాయ్యకారిగ నుండును లే?

అంశు—నీప్రయత్న మేమి?

శర—రావణాన్వేషణము—సీతాసామీప్యముననే రావణుఁ డుండును గాన వారిప్రయత్నము సఫల మగుట యనఁగ నాప్రయత్నము సఫల మగుటయే.

అంశు—నీ కిప్పుడు రావణునితోఁ బని యేమి?

శర—వీరికి సీతతోఁ బని యేమి?

అంశు—ఆమెను రావణునిబారి నుండి విడిపించి తీసికొని వచ్చుటకు—

శర—అందువలన రావణునికిఁ గలుగులోపమును నేఁ దీర్చుటకు—

అంశు—ఛీ! ఛీ! నీకాంతను రావణునకుఁ గానుకగ నిచ్చెదవా? నీభార్యనుసీవు వాలి కర్పింప నెంచినతోడనే వాలి కడ తేరెను. ఇఁక రావణునిగూడఁ జంపఁదలఁచితివా యేమి?

(నేపథ్యమున) చంపఁదలఁచియే వచ్చితిని. ఇంత పొగరా? ఇంత పరాకా? ఇంత కృతఘ్నతయా? ఏఁడీ? ఇటు తావచ్చునో, నే నంతఃపురము ప్రవేశింపవలయునో కనుఁగొనుము. మఱ్ఱింతలో మఱచినాఁడా?

అంశు—అయ్యయ్యో! లక్ష్మణుఁడు మహారౌద్రమూర్తియై సుగ్రీవ హారణార్థమై కాంబోలు వచ్చుచున్నాఁడు.

శర—అయ్యో! సమానులతోఁ జెలిమి కాని నరులతో వానరులకు స్నేహమేమి? పుణ్యాత్ముఁడైనలక్ష్మణుఁడు సుగ్రీవుని గడ తేర్చును. భాగవతోత్తముఁడు పండ్లిగిలించును పదపద!

(నేపథ్యమున) అటులెన్నఁడైన జరుగునా?

శర—(తనలో) ఈమఱుపప్రశుతివలన సుగ్రీవుఁడింతటఁ జావఁడు.

అంశు—(తనలో) "మఱ్ఱింతలో మఱచినాఁడా?" యని సుగ్రీవుని గూర్చి లక్ష్మణుఁ డహంకారమున ననఁగ "అటులెన్నఁడైన జరుగునా?" యని యంజనాసుతుం డాతనికిఁ గోపోపశమనము సేయుచున్నాఁడు. ఐననేమిజరుగునో పోయెదను. శరభా! నేను బోయెదను.

(అంశుమాలి నిష్క్రమించును.)

శర—సరే. ఇఁక నే నీసుగ్రీవరాజ్యమున సీతావార్త తెలియువఱకుం డి పిమ్మట రావణస్థానమునకై పోయెదను.

(నిష్క్రమించును.)

ఇది విష్కంభము.



ప్రదేశము — సుగ్రీవునిసభాశాల.

ప్రవేశము — లక్ష్మణుఁడు, ఆంజనేయుఁడు.

ఆంజ — అటు లెన్నఁడైన జరుగునా?

లక్ష్మ — ఎన్నఁడో యన నేల? ఇప్పుడు జరుగుచుండుట లేదా?

ఆంజ — రామానుజా! ఇప్పుడుమాత్ర మేమి జరుగుచున్నది?

లక్ష్మ — సుగ్రీవసచివా! అట్లనెద వేల? ఇప్పుడేమి జరుగుచున్నదా? వర్షకాలము పోయి శరత్కాలము జరుగుచున్నది. రామమూర్తికి శోక మొక్క సంవత్సరముగ జరుగుచున్నది. ఆమహానుభావుఁడు మీసుగ్రీవున కొనర్చినమహోపకారకృత్యమువలనిఫలము సుగ్రీవునకు నిరంకుశముగ జరుగుచున్నది. ఆతనికి నిరంతర గ్రామ్యసుఖాసక్తిచేఁ గాలము జరుగుచున్నది. సీతాన్వేషణము నుగూర్చి జరుగఁదగినయుపేక్ష జరుగుచున్నది. ఈయాలస్యముచే నాప్రాణముస్థానమునుండి జరుగుచున్నది. ఇంతకంటె నేమి జరుగవలయును?

ఆ. వె. ఇదిగో! శత్రుమారకచాప ♦ మిదిగో! తూణ
మిదిగో! కూరు పాకర్షణ ♦ మిదిగో! బాణ
రవము వినఁజెవిఁ బడదుఁడఁ ♦ ప్రాణ మొగుర
వలయుఁ బిడుగుచేఁ జచ్చిన ♦ వానికట్లు.

ఆంజ —

గీ. శత్రుమారణ పారీణ ♦ శరము మిత్ర
పోషణమునకుఁ గాక సం ♦ శోషణమున
కగునె? యబ్ధాళిఁ దూల్చునె ♦ యనిలుండు
వహ్నికీలావళిని వృద్ధి ♦ పఱచుఁ గాదె?

లక్ష్మ—మీరాజు నిశ్చయముగ వశ్యుఁడే. పవిత్రతాదులచేఁ గాదు. ఆశ్రయుల మైనమమ్ముద్దహించుటచే నాతని కాశ్రయాశత్వము సిద్ధించినది. అనిలపుత్త్రుఁడ వగుటచే నాతనిని వెనుకవైచుకొనుచున్నావు. ఈతఁడు సుపుత్త్రుఁడని నమ్మి మేము మోసపడితిమి.

గీ. తనమహాకష్టములఁ దీర్చి ♦ దయను బ్రోచి
నట్టిమే మిప్డు త్యాజ్యుల ♦ మైతి మహహా!
గాఢశీతార్తిఁ దొలఁగించు ♦ కంబళము, హ
సంతికయు, వసంతమున వ ♦ ర్జ్యములు, గావె?

సీ. కరములు జోడించి, ♦ గాత్రంబు గుదియించి,
బొటబొట మనుకనుల్ ♦ పులకరించి,
వాలంబు దిగువకు ♦ వంచి, పండ్ల నిగి
లించి, పెదవుల నా ♦ డించి, నంగి
నంగిమాటలతోడ ♦ "నాయనా! వాలిని
జంపుము నన్ బ్రోవు ♦ శరణ"టంచు
రామపాదములందుఁ ♦ బ్రాఁకులాడిననాఁటి
నమ్రత్వ మెచట న ♦ ణంగిపోయె?
దైన్యమెచ్చటఁ బడి చచ్చె? ♦ దాసవృత్తి
యెట్లు దగ్ధమయ్యెను? బుద్ధి ♦ యెట్లు బుగ్గి
యయ్యె? మాట లేయేటిలో ♦ నంతరించె?
మారుతీ! రూప మెచ్చట ♦ మాసిపోయె?

ఆంజ—రామానుజా! క్షమియింపుము. కఠినవాక్యములతోఁ బనియేమి?

లక్ష్మ—సరే! పనిలేదు కద! ఇఁక నాతనియొద్దకు నన్నుఁ దీసికొనిపొమ్ము. ఊఁ. ఊఁ. రా! వేగఁ దీసికొని పొమ్ము.

గీ. ఎట్టిపలుకైన లేక, కా ♦ ల్మొట్టుజాడ
దైన్యఁ గనరాక, యూపిరి ♦ యైన వినఁగ

రాక యుండ, నే నతని మా ♦ రణమొనర్తు
నరగ మద్ద్వాళ తద్ద్వాతఁ ♦ జంపినట్లు.

ఆజ—

గీ. అలమహాతేజవంశంబు ♦ నందుఁ బుట్టి
యలమహావీరుతమ్ముండ ♦ వైనసీకు
బలపరాక్రమతేజఃప్ర ♦ భావములకు
లోపమే? యొందులకును జా ♦ లుదువు నీవు.

గీ. వరధనుశ్శాస్త్రపాండిత్య ♦ పారగతుఁడ
వైనసీ విట్టికపిరాజు ♦ ననఁగ నేమి?
జగతినే భస్మమును జేయఁ ♦ దగుదు వయ్యా!
ప్రళయకాలభైరవసమ ♦ వర్తియట్లు.

ఐన,

గీ. ప్రాభవమునకు శస్త్రాస్త్ర ♦ పాండితికిని,
ప్రబలతనుదార్ఢ్యమునకు, గౌ ♦ ప్పతనమునకు
జరుపఁదగినది వధయానె? ♦ శక్తిసార
హీనరక్షు; దోషిక్షమ, ♦ యానుగాక.

గీ. ప్రాణినాశనమునకింత ♦ ప్రతిభ యేల?
యింతరణశాస్త్రవైదగ్ధ్య ♦ మేల? యింత
యంగబల మేల? మఱి యింత ♦ యాభిజాత్య
సంపదయు నేల? వైభవ ♦ సరణి యేల?

గీ. ఒంటిపూఁస తేల్చంపదే ♦ యుండునే? పురి
కోస చంపదే? బోఁతుగా ♦ గ్రుచ్చుకొనిన
కంటకంబైనఁ జంపఁగాఁ ♦ గనమె? యెంత
పనికిమాలినదైన నీ ♦ పనికిఁ దగదె?

గీ. సన్నిపాతాదిరోగముల్ ♦ చూప వైక్యా-?
ఝానములు చూపవై? త్రాగు ♦ కాలమందు
వేలునాళంబుదరిఁ జేరు ♦ నీరబిందు
వైన ప్రాణాల నస్సు త్రోఁసె ♦ యంగ లేదా?

గీ. ఒక్క-యుద్ధరిణాను విస ♦ మొక్క-జాతి
నంత నొకవరాలు హూపునగా ♦ యాగఁ జేయఁ
దగదె? ప్రాణ మనఁగ నెంత? ♦ దాని కింత
యేల? యూరకున్న మృతియె ♦ యీఁన్పుకొనదె?

గీ. సంతతాపాయసంతాప ♦ సంప్రప్రాంతి
తాసునాశనమునకు సా ♦ హాయ్యకరులు
కై విభులు సేయఁబడిరె? త ♦ జ్జన్యబాధ
నోర్పుకొలఁది శమింపఁజే ♦ యుటయుఁ గాక!

గీ. పైకిఁ గనఁబడుమానిసి ♦ ప్రభుఁడు గాఁడు
తళుకు మనుసది భూషణ ♦ తతియుఁ గాదు
వక్రవేణుదండంబు చా ♦ పంబు గాదు
ప్రాణనాశోద్ధారకమె ధై ♦ ర్యంబు కాదు.

గీ. అంతరాత్మ ప్రభుఁడు; దాన ♦ మతనిమకుట
ము; దయ, ధర్మము కేయూర ♦ ము లగు; సత్వ
గుణమె చాపము; ప్రాణర ♦ క్షణవిచక్ష
ణత మహావీర్యసంపద ♦ యతని కగును.

గీ. ఏత దఖిలమంగళగుణ ♦ స్ఫితుఁ డైన
రామచంద్రమహావీరు ♦ భ్రాత వీవు
తత్పదాంబుజసేవన ♦ తత్పరుఁడవు
పుణ్యమూర్తివి యేమి చె ♦ ప్పుదు మహాత్మ!

లక్ష్మ:—చెప్పవలసిన వన్నియుఁ జెప్పనే చెప్పితివి. ఇఁక నేమి చెప్పవలెనవ దేల? అయిన నొక్కటి చెప్పవలసినదియే యున్నది. నీవిచ్చినయుపన్యాసమున నొక్కముఖ్యలోప ముంటచే నది యుపపన్నముగ లేదు. దానధర్మదయార్ద్రతగుణాదులు రాజనీతికావశ్యకము లయ్యును వానికంటెఁ బ్రధానమగునది శిక్ష.

సీ. జలధిఁ జేఁపలు తిమిం ♦ గిలమున కడలొందుఁ
బైని డేగకుఁ బక్షి ♦ పాళి జడియు
వనిసింహమునకు జం ♦ తుసంచయ మల్లాడు
వసుధాపతికి జనుల్ ♦ వడఁకుచుంద్రు
ప్రబలజీవంబు దు ♦ ర్బలజీవకోటికి
హానిసేయు ననుభ ♦ యంబునైజ
మగుగుణం బగు బహు ♦ ప్రాణిపోషమా
క్రాంతసృష్టి యరాజ ♦ కంబుగాక
నడఁగిపోని ద్రష్టనది యొక్క ♦ భయమె సుమ్మ
భక్తి నైజగుణము గాదు ♦ పగుణముద్ది
భయములోఁ గూడినను గాని ♦ పనికిరాదు
కాని భయ మొక్కటియె యెంత ♦ కైనఁ జాలు.

గీ. అట్టిభయము శిక్షను వృద్ధి ♦ నంది శిక్ష
చే ఫలముగాంచుఁ గాన ♦ శిక్ష లేక
యున్న శాస్త్రంబు లన్నియు ♦ మన్నుఁ గలియు
సృష్టియంత యుట్టె తల ♦ క్రిందు పడును.

ఆ. వె. కలఁకుదనము లేని ♦ గురుని శిష్యులు గాంచి
వెక్కిరించు చుంట ♦ వింత యగునె?
కుక్క మంచలోన ♦ గుఱుపెట్టి నిదురింప
గొఱ్ఱెలిచ్చువచ్చు ♦ కొలఁది పోవె?

ఆ. వె. వాఁడిమొంటి పోలు ♦ భయమునఁ గాకున్నఁ
దేనెపట్టులోని ♦ తేనె నంత
క్షుద్రకీటకములె ♦ క్షుద్బాధ శాంతింపఁ
ద్రాఁగిపోవె తేనె ♦ టీఁగ ద్రోసి.

ఆ. వె దంతనఖరశూన్య ♦ తా హేయసింహంబు
కరణి, వాయిలేని ♦ ఖడ్గమట్లు
లనుపయోగతాతి ♦ హాస్యాస్పదము దండ
రహిత మైనయట్టి ♦ రాజనీతి.

ఆంజ—శిక్షావిధి యార్తరక్షణకార్యమున నిమిడి యుంటచే దానిని ప్రత్యేకముగఁ జెప్పలేదు.

గీ. చలినశించినఁ గాని యు ♦ ష్ణత్వ మెట్లు?
పాప మెడలినఁ గాని యే ♦ పగిది పుణ్య
వృద్ధి యగుఁ? గష్టపాళి న ♦ శింపకున్న
సౌఖ్యసంపత్తి యేదారి ♦ సంభవించు.

గీ. మూఢతానష్టిచేఁ గదా ♦ బుద్ధిప్రబలు
ధరణిలో ద్వంద్వములు తుల్య ♦ భరము గలవి
యొకటి లఘుత నొందినఁగాని ♦ యొకటి బరువు
చేఁ బ్రకాశ మొందదు త్రాసు ♦ చిప్పలట్లు.

గీ. ధూర్తదండంబు గాకున్న ♦ నార్తరక్ష
జరుగ దని నేను మనవిని ♦ జలుపుకొనెద
వాలి నిరయనిర్ధూతడీ ♦ వాలిగాక
యున్న సుగ్రీవరక్షణ ♦ మున్నె యిట్లు?

లక్ష్మ—ఆహాహా! ఇట్లుండునా యని సంతోషించు చుంటివా? ఆహా! లతనకిఁ జేసినమహోపకార మెంతగాశోభించు చున్నది. తన

కొనర్పఁబడిన మహాకార్యమునకుఁ దా నెంతస్మృతిగలిగి ప్రకాశిం
చుచున్నాఁడు.

గీ. కడుపు నిండఁగ వైచిన ♦ గడ్డి నంత
మెక్కి పాలకై దరిఁజేరు ♦ మేపరిని గృ
హారహితముగఁ బొడిచిన ♦ పశువుభంగి
మెఱయుచుండె మీరాజు స ♦ మీరతనయ!

అంజ — రామానుజా! గురువిధేయుఁ డగుసుగ్రీవుఁడు మీ కపకారమే
నర్చినాఁడా?

లక్ష్మ — అపకారము సేయక పోవుట యే మహోపకారమా? మమ్ముం
కఁ జూపలేదని మహాపరాధమొందుమంటివా? ఈయడవినుండి త
రిమి వేయక యింక నిక్కడనుండని చ్చినందుల కుపొంగుమంటివా?
సీతాన్వేషణమునకు గూర్చి తాను జేయుచున్న యుపేక్షకంటె మా
కధికమైనయపకార మేమిచేయగలఁడు? అదిచేయుచున్నాఁడు
చాలదా?

గీ. ఎట్టులుంటిమో? యెచట వసించినామొ!
యేమి తినుచుంటిమో? కాల ♦ మెట్లు గడపు
చుంటిమో? యుంటిమో? లేమొ ♦ కంటఁజూడ
లేదు సరికదా విన్నైన ♦ లేదుకావె?

గీ. భటునివలె నిట మొగసాలఁ ♦ బడి యహోరాయ
టంచు నఱచినన్ దిక్కులే ♦ దయ్యె; నేమి
చెప్పవలయును? మమ్మింత ♦ సిగ్గుపఱిచి
బ్రదుకఁగలఁ డని తలఁచెనే ♦ వాయుపుత్త్ర!

అంజ — రఘువీరసోదరా! తలఁచుట కాతనికి మన సెక్కడిది? క్షమింపు
ము.

లక్ష్మ—అద్వయసిద్ధి నొందెనా? ఏమి?

ఆంజ—భార్యాద్వయసిద్ధి నట్లున్నాఁడు. ఆతఁడు మీయాజ్ఞలను నిర్వర్తింపలేదని యాగ్రహింపకుము. అది మీయెడల నిర్లక్ష్యత్వముచే గాదు. ఆతనిమన మన్యథా సక్తమై యుండుటవలన నట్లున్నాఁడు. ఎట్లైన క్షమింపఁదగును.

గీ. బధిరుఁ డగువాఁడు మనమాట ♦ పరిగణింప
కున్నఁ బ్రబలగర్వాత్ముఁడం ♦ చెన్నఁ దగునె?
అక్షిశూన్యుఁడు మను భక్తి ♦ నాదరింప
కున్న దౌష్ట్యభూయిష్ఠుఁడం ♦ చెన్న నగునె?

గీ. అట్లు నూతనవనితావి ♦ హారలోల
తాత్త్వచిత్తుఁడై మత్తిల్లి ♦ యలసియున్న
యతఁడు మిముఁ దలంపకయున్న ♦ నరి యటంచు
దలఁప నగునె? క్షమింపఁగ ♦ వలయుఁ గాని.

లక్ష్మ—ఆఁ! కన్నులు కనఁబడవో? చెవులు వినఁబడవో?

సీ. కలకురాలను ముండ్ల ♦ కంచెల దొరలెడు
వానికి మృదుతల్ప ♦ వాస మయ్యె
భ్రష్టుఁడై దెబ్బలఁ ♦ బడి యేడ్చు వానికిఁ
గపిరాజవైభవ ♦ గరిమ యయ్యెఁ
బ్రక్క దాఁపునకైన ♦ దిక్కులేనతనికి
రాణులిద్దఱపరీ ♦ రంభ మయ్యెఁ
గాలిముల్లును దీయు ♦ గతిలేనతనికి వెం
డ్రుక కొక్కవినయసే ♦ వకుఁడు నయ్యె
నింకఁ జెవుల లిద్దెలు దూర ♦ వే? కనులను
బూరలు గ్రమ్మెవె? యింకఁ గొవ్వు ♦ పూలవాఁడు

జిలుఁగుటూపికలవారు త ♦ చ్చిత్తమును హ
రింపరే? మఱి కానున్న ♦ దింకనేమొ?

ఇతఁ డతిసతీలోలుఁడైనమహాపాపాత్ముఁడు. ఈతని వధింపవలసినదే. అందుకొఱకే వాలికూడ వధింపఁబడెను గదా?

అంజ—వాలి భ్రాతృభార్యాహరణమహాపాపయుక్తుఁడు గావున నతనికి శిక్షవిధింపఁబడినది కాని స్వభార్యాసక్తుఁడై యుత్సాహమున నున్నవానికి శిక్ష దగునా?

లక్ష్మ—స్వభార్యలందైన నతిచారము దోషము.

అంజ—అయిన నగును గాని యందులకు రాజదండనము విరుద్ధము కాదా? ఐనను,

గీ. వ్యాధి నశియింపఁ బథ్యంబు ♦ నారగించు
జీవునకుఁ గొంతకాలంబు ♦ పోవుదనుక
నాఁకలి ద్విగుణమై భుక్తి ♦ యధిక మగును
దిండిపై దృష్టి యెప్పుడు ♦ నుండుఁ గాదె?

గీ. జరుగుబడి లేక కొన్నివ ♦ త్సరములు చదు
వు వదలి తిరిగి పుస్తకం ♦ బులు గ్రహించు
క్రొత్తశిష్యుఁ డిరుగుపొరు ♦ గుల వసించు
జనులచెవులు దిబ్బడులుగాఁ ♦ జదువఁ డొకో!

గీ. అల్లి సతిదూరుఁడై చాల ♦ నార్తిఁ బడిన
యాతఁ డిప్పుడు నూత్నాంగ ♦ నానవరతి
భోగపరతచే నుంట త ♦ ప్పుగ గణింపఁ
దగదు కొన్నినాళ్లిటు లుంట ♦ తప్పదేమొ?

గీ. అతను శాస్త్ర మనభ్యస్త ♦ మగును నాకు
విస్మృతము నీకు నేనువ ♦ ద్విషయమందు

నిన్ను నీదేశికుండనై ♦ యింతకంటె
నేమి బోధింపఁ గలనయ్య ♦ రామభక్త

లక్ష్మ—నా కింక నేమియుఁ జెప్పనక్కఱ లేదు. నాకుఁ గోపము వ్రా యి నన్వ వచ్చుచున్నది. నన్ను లోనికిఁ దీసికొనిపొమ్ము.

ఆంజ—కోపము పోవ నీకే యానంద మగునపుడు నా కెంతయానంద మగనుండునో? అందఱికంటె సుగ్రీవున కెంతమహానందముం డునో? యోజించుకొనుము. ఏజీవులనైన సంతోషపెట్టుట కష్ట ముగాని కష్టపెట్టుట సులభము గాన నాతని క్షమింపవల యును.

లక్ష్మ—ముందు తీసికొని వెళ్లవయ్యా!

ఆంజ—ఆప్రక్కనే సుగ్రీవాంతఃపురము. అచ్చటికి సమయ మరసి పోవుదము రమ్ము.

(ఇద్దఱు నిష్క్రమించుచుండఁగ సుగ్రీవుఁడు తార ప్రవేశించుచున్నారు.)

తార—నాధా! వలదువలదు. చెప్పినమాట వినుము.

సుగ్రీ—ఇఁక నొక్కమాటుకంటె నెక్కువ త్రాగను. నీచేతిలోనిమధు పాత్ర నిమ్ము.

తార—ఇదివఱ కెన్నిమాఱులో త్రాగితివి. చాలు. అతిపాన మపా యకరము.

సుగ్రీ—విపాన యధికముగ నున్నది. ఈమాఱు కడుపునిండ మధుపా న మొనర్చి యిఁక నెన్నఁడును దాని స్పృశింపనైన స్పృశింపను. నిశ్చయముగ నమ్ముము.

తార—ఈసారి మధుపాన మొనర్చి యిఁక మానివేసెదవు కద!

సుగ్రీ—ఆ!

తార—అట్టిమనోదార్ఢ్యము నీకున్నది కద!

సుగ్రీ—ఆ! సందేహము కూడనా?

తార—అట్టిస్థైర్య మున్నది కాన నీనియమమునుండియే మానివేయుము.

సుగ్రీ—ఈనియమమునుండియా? ఛీ! ఒకగడియతరువాత—

తార—ఇప్పటినుండి మానివేయఁ జిత్తదార్ఢ్యము లేనివాని కొక్కగడియ
పిదపమాత్ర మట్టిస్థిరత్వ మెటనుండి వచ్చును?

సుగ్రీ—ఎటనుండి వచ్చునో చూతువు. నాచమత్కారము! నాపట్టుదల!

తార—అది యిప్పుడే చూపింపుము.

సుగ్రీ—హేహే! చూపింతునో మానుదునో? మధుపాన మొకలెక్క-
యా? మాంసభక్షణము, మానినీసంభోగముకూడమానఁగలను.

తార—ఇప్పుడుమాత్ర మేల మానలేవు?

సుగ్రీ—నాకు మితిలేనిదగ యగుచున్నది. బూడిద మ్రింగుచున్నట్లు
న్నది. ఒక్కసారి తనివితీఱఁ ద్రాగనిమ్ము. ఏదీ పాత్రము?

తార—నీకుఁ దెలియదు.

ఆ. వె. బఱుకుకొనినకొలఁది ♦ పాము భూమం బగుఁ
గప్పుకొనినకొలఁది ♦ ఘన మగుఁ జలి
కాను గల్గుకొలఁది ♦ నాన మీసరి మగు
ద్రాగుకొలఁది దప్పి ♦ ప్రబల మగును.

ఆ. వె. వ్యసనమునకు శాంతి ♦ నాచరించుకొలంది
వ్యసన మింక వృద్ధి ♦ యగుచు నుండు
నంటుకొనిన స్నేహ ♦ మార్పంగ రసమును
జల్లుకొలఁదిమంట ♦ లల్లుకొనవె.

సుగ్రీ—నీవు మిగుల జ్ఞానిని వని నేనెఱుఁగుదును. లోక మెఱుఁగును.
కాని నీజ్ఞానబోధన మిప్పు డనవసరమై యున్నది.

గీ. పాఠశాలలందు శ్మశాన ♦ వాటియందు.
దేవళములందు జ్ఞానోప ♦ దేశసరణి

జరుగఁదగును గర్భాధాన ♦ శాలలందు
నేల? కుచసీమ శ్రీమూర్తి ♦ మాల యేల?

ఆ. వె. జ్ఞాన మెంతమంచి ♦ దైన సకాలంబు
నందు దూష్య మగుట ♦ సందియంబె?
సంతసమునఁ బెండ్లి ♦ జరుగంగ హారహా రా
యనెడుపలు కవాచ్య ♦ మగును గాదె?

ఆ. వె. గుళ్ళలోన వేద ♦ ఘోషంబు దగుఁగాని
సురతశాస్త్రచర్చ ♦ జరుగఁ దగునె?
మృతగృహంబులోన ♦ నేమపు లోదార్పు
లర్హమగును భోగ ♦ మాట లగునె?

గీ. అర్హతయె మంచిగాన ర ♦ త్యాలయముల
ముద్దులును గౌఁగిలింతలు ♦ మురియుటలును
త్రాగుటలు జోగుటలు పైంట ♦ లాగుటలు న
వశ్యకర్తవ్యములు పాన ♦ పాత్ర నిమ్ము.

తార—పాత్ర నిచ్చుటమాట యసత్యము.

సుగ్రీ—అటులైన నిష్టమే. (మీఁదికిఁ బోయి ముద్దు పెట్టఁబోనఁబో
వును.)

తార—ఆఁ! ఆఁ! (చేయి యడ్డుపెట్టును.)

సుగ్రీ—పాత్రనీయకుండఁ జేయఁదగినపాన మధరమధుపానమే కదా?

గీ. తప్పులేనియొంగిలి ముద్దు; ♦ తనువుబాధ
లేనిపీడ సమాశ్లేష ♦ మాను; మత్తు
లేనిపాన మధుర ♦ మధుపానమగును;
పతతదయఁ బుట్టుపోరాట ♦ మతనురణము.

అధరపానమైన నిమ్ము. లేనియెడల రుమనెుద్దకుఁ బోయెదను.

తార—వలదు. అమెయొద్దకుఁ బోయినైనఁ గ్రాఁగుట యేకద!

సుగ్రీ—అదియొకటియే కాదు.

తార—ఇంకఁజాలు!

గీ. మొదలె కపులము; చంచల ♦ బుద్ధివార;
మందుపైఁ ద్రాగు డుండఁగ ♦ ననవలయునె?
అది యమితమైన బ్రదుకేల? ♦ యకటవినుము
వ్యసనసంసక్తి తగదయ్య ♦ వానరేంద్ర!

గీ. మిన్నకుండక కొనితెచ్చు ♦ కొన్న సన్ని
పాత; మాంతరపైత్యప్ర ♦ బలత లేక
పుట్టునున్మాద;మాత్మాంగ ♦ ములదహించు
గరళపానము; మధుసేవ ♦ గాదె? నాథ!

ఆ. వె. అంటుకొన్న జలగ ♦ యస్రంబు పీల్చిన
పిదప విడుచు వ్యసన ♦ విసర మట్లు
రక్తమాంసములను ♦ బ్రథితబుద్ధ్యాత్మలఁ
బీల్చి పిప్పిఁ జేసి ♦ విడువకుండు.

ఆ. వె. వ్యసన మింత దేహ ♦ మట్టి తాఁకంగనె
బుద్ధి లోననుండి ♦ పోవునెగసి
మందుకాయ వత్తి ♦ మంట సంటినవెంట
లోనిమందు మాయ ♦ మైనయట్లు.

సుగ్రీ—వెఱ్ఱిదానా?

గీ. అట్టి తినఁగూడ దనుచుమం ♦ దాగ్ని రోగి
యనును; దరుణులు తోల్తిత్తు ♦ లని నపుంస
కుండు సెలవిచ్చుఁ; బైత్యాధి ♦ కుండు గుఱుకఁ
బట్టి నిద్రించువానిని ♦ బందియనును.

గీ. త్రాగఁ దప్పని యత్యుష్ణ ♦ రోగి ప్రేలు
నళులరోగసమాక్రాంతుఁ ♦ డగుటచేత

జ్ఞాని యివియన్ని తగదను; ♦ సౌఖ్యమునకుఁ
దగకయుండిన సౌఖ్యసా ♦ ధనము లేల?

నేను నీజ్ఞానోపదేశము విని సుఖము పరిత్యజింపను.

తార—ఇందున నేమంతజ్ఞానబోధన మున్నది? సుఖము వదలుమని నేనును జెప్పను.

గీ. అపరిమితము, నభావంబు ♦ ననెడురెండు
కష్టదశ లెప్డు సుఖముప్ర ♦ క్కలనె యుండు
నడుమను సుఖాప్తి యాఁగక ♦ నడువవలయుఁ
ద్రాటిబద్దపై నేటిని ♦ దాఁటునట్లు.

సుగ్రీవా! బలాఢ్యుఁ డగువాలి యతిచార దోషమున నేకదా రూపుమాసెను? ఆతనియంతమును జూచియైన నీవు జాగరూకుఁడవై యుండవలదా?

సుగ్రీ—(అట్టె తెల్లపోయి తేటిపాటఁజూచి) ఆఁ! ఆఁ!

తార—ఆఁ! యనెదవేల? ఎఱుఁగనివాఁడువలె నట్లు చూచెదవేల? అతఁ డతివ్యసనాసక్తుఁడని దోషమెంచియేకదా నీవు రామునిచే నతనిఁ జంపించితివి! అట్టినీవు మితిమీఱ నేల? అందులో వాలి ప్రాణహరణక్రూరుఁడైన యాతఁడూరిబైట నింకనుండఁగనే—

సుగ్రీ—ఆహాహా! ఎంతప్రమాదము!

తార—(తనలో) భయముచే నీతఁ డిట్టె వ్యసనబాధవలన నిర్ముక్తుఁ డయ్యెను. ఆహా! భయముయొక్క మహిమము.

గీ. భీతిచేత నున్మత్తుని ♦ బూతులడఁగు
భయముచేతఁ గామోద్రేక ♦ భరము మాయు
భయముచేఁ బాపకృత్యముల్ ♦ భంగమగును
భయముచే బ్రహ్మరాక్షసుఁ ♦ డయినలొంగు.

గీ. సకలవేదాంతశాస్త్ర ♦ సారబోధ
సంబుకంటెను దుష్టుగు ♦ ణంబు మాన్చ
ప్రథితబుద్ధి నొసంగఁగ ♦ భయమె మిగులఁ
బ్రబలతర మగుఁగాదె యీ ♦ వసుధలోన?

గీ. కాసు వెచ్చింప భయము, రో ♦ గముల భీతి,
యరివిటులు గొంతుఁ గోయుదు ♦ రనెడుభయము,
తనుఁ గని సతియుఁ బైయాడు ♦ ననెడుభయము
చేత నెందఱో యొకభార్య ♦ జేరియుండ్రు.

గీ. జనుల విశ్వాసము నశించు ♦ ననెడుభీతి
యందువలన లాభము పోవు ♦ ననెడుభీతి
యవనినాథదండన మగు ♦ ననెడుభయము
చేత నెందఱో సత్యవా ♦ క్యాళిగనిరి.

గీ. అవనిపతులనుహాటేవ ♦ తాలయములు,
సత్కళాశాలలును, ధర్మ ♦ సత్రములును,
మొదలుగాఁగలఘునకార్య ♦ ములును జాల
వట్టునకు భీతిచేఁ జేయఁ ♦ బడెనుగాదె.

గీ. భయము నింద్యం బనెడుమాట ♦ పాడి గాదు
భయమె లోకలాభకరము ♦ భక్తికంటె
భయముచేతఁ గ్రమంబుగా ♦ భక్తిమొదవుఁ
గర్మమున జ్ఞాన మొదవెడు ♦ కరణిదుదకు.

సుగ్రీ—తారా! ఊరకుంటివే! నామన సాందోళన మొందుచున్నది. రామకార్యమునందుఁ బ్రమత్తుఁడ నైతిని. వాలిని వధించిన ట్లా తఁడు చపలేంద్రియుఁడనై. గురుజనద్రోహి నగు నన్ను వధించున నని తలఁచెదవా?

తార—అగుపర్యంతము మహావీరుల కృత్యము లెట్లు తెలియఁగలము?

సుగ్రీ—అయిన పిమ్మట నీకుఁ దెలియవలసిన దేమున్నది? కాని నే నిప్పు డేమి చేయుదును?

తార—రుమ యొద్దకుఁ బోయి కల్లుద్రాగి కౌఁగిలించుకొని గంతులు వేయుము.

సుగ్రీ—అధిక్షేపింతు వేల? నీవు బుద్ధిమంతురాలవు. నన్నా దయాళుఁడు వధించునా?

తార—

గీ. ఎట్టిమృదులహృదయ మేని ♦ పట్టు రాఁగఁ
బరమకఠినతఁ జెందు నే ♦ సగము లెడల
కుండఁ దేనెఁ ద్రావెమునవి ♦ గుండ్లకైనఁ
బెదరరాని కట్టులఁ దూట్లు ♦ జేయుఁ గాదె?

సుగ్రీ—పట్టు వచ్చినప్పుడుకదా కాఠిన్యము. నాపై నామహానుభావుని కట్టిప ట్టేల?

తార—వాలిహరణ మొనర్చి యాతని పంత మాతఁడు చెల్లించుకొనెను. నీపంతమును చెల్లించుకొనఁ గలిగితివా? భవదుపేక్షాతిరస్కృతమైన యాతని హృదయమునకుఁ బట్టు కలిగినఁ గలుగవచ్చును.

సుగ్రీ—నన్ను నీవు బెదరించుచున్నావు. శ్రీరామభద్రుఁ డేమి నన్ను వధించు ననుట యేమి?

తార—రాముఁడు కాకుండిన రామానుజుఁడైన జాలఁడా?

(నేపథ్యమున) రామానుజా! దయయుంచి యొక్కక్షణ మిట నీవు విశ్రమింపుము. అదియే మారాజుగారు శయనించు గది. నేను బోయి యాతనితోఁ జెప్పెదను.

సుగ్రీ—అదేమి? అదేమి? ఆంజనేయుఁ డిప్పుడు లక్ష్మణునితోఁ గూడ వచ్చుచున్నాఁడు.

తార — అట్లుకాదని నాకుఁ దోఁచుచున్నది. లక్ష్మణుఁడే యాంజనేయుని తోఁ వచ్చుచున్నాఁడని నే ననుకొందును.

సుగ్రీ — ఎట్లయిన నేమి?

తార — భేద మున్నది. ప్రధానముగ రాఁదలఁచినవాఁడు లక్ష్మణుఁడు. అతనికి దారిచూపుటకుమాత్రమే మీమంత్రి వచ్చుచున్నాఁడని నాయభిప్రాయము.

(నేపథ్యమున) రాజేంద్రా! రాజేంద్రా!

సుగ్రీ — మారుతీ? ఇప్పుడేల వచ్చితివి? ఇంత తొందర కేమికారణము? రా!

(ఆంజనేయుఁడు ప్రవేశించును.)

ఆంజ — నమస్కారము.

సుగ్రీ — ఆందోళనసమయమునం దీయాచారము లేల? శీఘ్రముగఁ జెప్పుము.

ఆంజ — లక్ష్మణుఁడు మిమ్ము—

సుగ్రీ — సందేహమేల? చంపుటకే వచ్చియున్నాఁడా?

ఆంజ — అటులే తీవ్రకోపుఁడై చెప్పుచున్నాఁడు.

సుగ్రీ — ఇప్పుడు నాపై నంతరుషకుఁ గారణ మేమని చెప్పెను.

ఆంజ — ఒకఁడు చెప్పనేల?

సుగ్రీ — ఔను. మహాప్రమాదము సంభవించినది. ఇప్పుడేమి సేయవలయును?

ఆంజ — సౌమిత్రిని లోనికి రానీయవలయును.

సుగ్రీ — చంపుటకా? నీవేమైన నాతని శాంతిపఱిచితివా?

ఆంజ — కొంతవఱకుమాత్రమే.

సుగ్రీ — నా కొక్కయాలోచనము తోఁచుచున్నది. ఆఁడువారి సంభాషణమున మార్దవమును, బరహృదయస్వాధీనకరణ దక్షతయు, నున్నది. తారజ్ఞానసంపన్నురాలు. సరసవాణీమనోహరయగునది

గావున నాపై యాతనికోపోపశమనమును జేసి నాయెడలఁ బ్ర సన్నుఁడుగాఁ జేయసమర్థురాలు. ఇందులకుఁదార యేమనునో?

తార—మహాబలశాలియై యన్నయైనవాలిని నీవు రామునితోఁ గుట్ర చేసి బుద్ధిపూర్వకముగ నాకుఁ జేసినమహోపకారమునకు నేను నీకెట్టియుపకారమును జేయవలసియున్నది? కృతఘ్నుఁ డగుని న్నుఁ జంపవచ్చినలక్ష్మణుని వలదని నీపక్షమునఁ బ్రార్థింపనా? సరే. అటులే కావింతును. మగవాని కున్నకోపానూయాగ్రహ ములు సతులకే యుండునెడల బ్రదుకులుండునా? లక్ష్మణు నిటఁ బిలిపింపుము.

సుగ్రీ—తారా! వెనుకటిమాట లేల తెచ్చెదవు? క్షమింపుము. మారు తీ! లక్ష్మణుని దీసికొని రమ్ము. నే నాస్తంభముచాటున నుండె దను. మారుతీ! కోపము తుపానువంటిది. ఒకటిరెండువిసరుల తోఁ జప్పబడును. నీపైఁ గొంత విసరినాఁడుకదా? కొంతవిసరు తారపైఁ బడినయెడలఁ దరువాత నాపైకివచ్చిన విసరును గాచి కొందును. మహాకోపశాలికిఁ గోపభాజన మగువస్తువు మొదట నే కానఁబడినయెడలఁ దద్వస్తువునకు విశేషనష్టమున్నది. అందు చే నిట్లు చేయఁదలఁచితిని. నీకు సమ్మత మగునెడల సౌమిత్రిని బిలువుము.

ఆంజ—చిత్తము. (పోయి సౌమిత్రితో వచ్చును. సుగ్రీవుఁడు కొంత కనఁబడకుండ దాఁగి యుండును.)

తార—రాఘవానుజా! నమస్కారము.

లక్ష్మ—దీర్ఘాయుష్మ మగుఁగాక! మారుతీ! సుగ్రీవుఁడేఁడీ?

ఆంజ—ఇచ్చటనే యున్నాఁడు. కాని మిమ్ముఁ జూచుటకు లజ్జపడు చున్నాఁడు.

తార—రామానుజా! ఈసంస్థానమున వాలివధ మైనప్పటి నుండియుఁ బురుషు లనవరత మంతఃపురమున నివసించియుంటచే స్త్రీలకు భూషణము లగులజ్జాసాధ్వసాదులు పురుషులఁ జేరనవి. పురుషులధైర్యసాహసములు కుంజమార్గమ్మగ మమ్ముఁ జేరినవి. కావున నేను నీతో మాటలాడుచుంటిని. ఆతని సందాలకు నన్నిందులకు క్షమియింపుము.

లక్ష్మ—ఆతనిని క్షమించుట జరుగదు.

తార—ఆలాగా? సంతోషమే. శిక్ష యుక్తమైనయెడల జరుగనే వచ్చును.

సుగ్రీ—(తనలో) అయ్యో! నావధ కీమె సాహాయ్యముకూడఁ జేయుచున్నట్లున్నదే? వాలినిజంపించితి ననుకోప మంగదునికి రాజ్యము రాలేదనుకోప మీామె కెంతయైన నున్నదికాఁబోలు!

లక్ష్మ—శిక్ష యుక్తముకావుననే శిక్షింప వచ్చితిని.

తార—ఏశిక్షవిధించుటకు వచ్చితిరి?

లక్ష్మ—వధించుటకే వచ్చితిని.

తార—సెబాస్! సౌమిత్రీ! నీయన్నకంటె నీవ నేకగుణముల బుద్ధిమంతుఁడవు. ధైర్యవంతుఁడవు. గుణవంతుఁడవు. చెప్పకుండఁ జెట్టుచాటునఁ గూర్చుండి చెట్టునుమని ధ్వనియైనఁ గలుగకుండ మహాచోరుఁడై రాముఁడు వాలిని వధించెను. ఇఁక నీవో యింటికి వచ్చి యెదుటఁబడఁదలఁచి చెప్పి చేయుచుంటివి. సెబాస్! నీపౌరుషము! అదుగో! అక్కడ నున్నాఁడు. పోయిచంపుము. కాని యొక్కమనవి—చంపుదు నని ధారాళముగఁ జెప్పితివి కాన నడుగుచుంటిని. వధశిక్షకుఁ గారణ మేదియో దయచేసి చెప్పవల యును. చెప్పకుండినయెడలఁగూడ సంతోషమే.

లక్ష్మ—ఏమున్నది? మమ్ము సుగ్రీవుఁడు తిరస్కరించినాఁడు.

తార—కాంతలకుచకుంభములనంటునను గల్గుకుండలంచునుమను గాలక్షే పముఁ జేయుచుమూలలఁ గూర్చుండు సుగ్రీవుఁడు ప్రస్రవణపర్వతమున నున్నమిమ్ము తిరస్కరించెనయ్యా! తెలియనివింతవలె నుంటచే నడుగుచున్నాను. చెప్పకపోయిన విచారము లేదు. మీ రేమి? మహాబలులు! మహాధనుశ్శాస్త్రప్రవీణులు! శూరాగ్రేసరులు! మేమెంత? మాప్రాణము లెంత? మీయట్టిమహారాజులవిత్తమ్ములకు సర్వమోక్షకారణమునకై వచ్చియున్నది కాని—

లక్ష్మ—నిర్దోషునెన్నఁడు శిక్షింపము. దోషియైనవానిని బరిత్యజింపము. సుగ్రీవుఁడతివ్యసనాసక్తుఁడై తనసమయమును మఱచినాఁడు.

తార—సమయ మేదయ్యా? సీతాన్వేషణమేనా?

లక్ష్మ—కాదా?

తార—కపియై, కల్లుద్రావి, కాంతాసక్తుండై, గాత్రమేమఱచి కాలము ద్రోచుసుగ్రీవుఁడు తనసమయమును మఱచిన మఱచుఁగాక! ఇదియేమి? మహాత్మా! మహాబుద్ధిమంతులరై మహనీయప్రజ్ఞానిధులరై మదవిదూరులరై పరాఙ్ముఖులరై మహాసత్వనిధులగు మీ రతనితో నగ్నిసాక్షికముగఁ జేసినసఖ్య మేల మఱచితిరి?

లక్ష్మ—సమయమును మఱచి, సఖ్యభావము వదలుకొనినసుగ్రీవునితో మాకింక సఖ్య మెట్లు? సఖ్యమన్యోన్యముండదగినది కాదా?

తార—సఖ్యమును వదలుకొనుట యాతనిదోషమే. అందులో సామాన్యసఖ్యమా? వైశ్వానరముఖసన్నిధిని జేయఁబడినది. అతఁడు వదలుకొనినాఁడని మీరువదలుకొంటిరి కాఁబోలు!

లక్ష్మ—ఔను.

తార—ఒకఁడు వదలుకొనిన మిగిలినవాఁడు వదలుకొనఁదగునని నేర్పాటేమైనయున్నదా యేమి?

లక్ష్మ—లేదు. సఖ్యస్వభావ మదియే.

తార—అదిసామాన్యసఖ్యమునకులెండి! ఇదియట్టిదికాదు. ఇది భర్తృభార్యాసంబంధమువంటి దైనది. భార్యభర్తను పేక్షింప భర్త దానిని బోషింపవలదా? చంపునెడల మహాపాపము గాదా? అట్టియనుబంధమున నొకఁడు వదలిన దోష మైనప్పుడు మిగిలినవాఁడేకారణముచేత వదలినను దోషముకాకుండునా? సరే. సుగ్రీవుఁ డొనర్చినదోషమునకాతని జంపఁదలఁచినారు. సంతోషమే. కాని మీరొనర్చినదోషమునకు మీరెవనిచేఁజంపఁబడ నిశ్చయించుకొనినారయ్యా! ప్రత్యుత్తర మీయకపోయిన బాధలేదు. కారణము గనఁబడకుండఁ జంపఁదలఁచినవారికి బ్రత్యుత్తరమునకు మాత్రము కారణ మేమికానఁబడును? సఖ్యమనునది యెప్పుడుజరిగినదెందులకు జరిగినను మొన్నగాకనిన్నటివార్త. ఈసఖ్యమనునదియునము క్రొత్తగాఁ దెచ్చుకొనినది. రక్తసంబంధమునే నిర్దాక్షిణ్యముగ నిరాకరింపసాహసించితిరి!

లక్ష్మ—మాకు నతనికి రక్తసంబంధమెట్లు?

తార—సంబంధము లేనినేను జెప్పవలసినదినములు సిద్ధించినవి. అయిననేమి? మీరు సూర్యవంశపురాజులు. అతఁడు సూర్యపుత్త్రుఁడు. అందుచే నాతఁడుమీకు వృద్ధప్రపితామహతుల్యుఁడు. తాతయు నవ్వయుఁ బంచపాళిలో గుసగుసలాడుకొనుచుఁ దన్నుఁ జూచి సిగ్గుపడి దాఁగుడుమూఁతలాడ లేదని తాతతలఁ బగులఁగొట్టఁ దలఁపకుమనుమఁ డెంత మహానీయుఁడో యాలోచించుకొనుము.

లక్ష్మ—అబ్బ! అంజనాసుతా! సుగ్రీవునియొద్దకుఁ దీసికొని వచ్చెదనని చెప్పి యిట్లు చేసితి వేల? నాకీమెతో నీబాధయేల?

**తార**—ఆఁపవాని న్యాయమగుమాటను సహింపలేవుగదా? అన్యాయమగునీ బాణపువేఁటు సుగ్రీవుఁ డెట్లుసహింపఁగలఁడో యెఱుఁగవలదా? అందఱుసహన మొకటికాదా? అందులో నంతఃపురమున నంగనాలోలుండగువానిని—

**అంజ**—అమ్మా! దయయుంచి క్షమింపుము.

**తార**—ఆతఁడిఁక సుగ్రీవుని తోడనే మాటలాడవచ్చును. కాని నే నొక్కమాట చెప్పెదను. సుగ్రీవుఁడు కపిసేనతో రావణవధకార్యముఁ జేయఁగలఁడని వాలినాతో వెనుకఁ జెప్పెను. సుగ్రీవుని కిప్పుడు హానిజేసిన స్వకార్యనష్టమగును. రాజకార్యములు కోరినట్లెల్ల నిముసములమీఁద నగునా? కొంతకాలము క్రిందటనే వానరవీరులందఱకు సందేశమును సుగ్రీవుఁడంపెను. వర్షాధిక్యముచే వారింక రాలేదు. ఇంత తొందరపడుదురా? ఎంతశాంతివహించి కార్య నిర్వహణము చేసికొనవలయును? ఆలస్యమగునప్పుడెల్ల ప్రాణములు తీయుచుండినయెడలఁ గపిజాతినంతయును మారణము సేయవలయునే? దేశకాలజ్ఞానములు నసులై ప్రతిభావంతులైన వారలకే సందేహింపవలసినప్పుడు కపులకింకఁ జెప్పనేల? సౌమిత్రీ! నేను పోయెదను. సుగ్రీవసాహాయ్యమున సీతాన్వేషణ మగును. రావణ నిర్మూల మగును. తొందరపడకుము. నేనింకఁ బోయెదను. నమస్కారము. (పోవుచు జనాంతికముగ) సుగ్రీవా! నీకింక భయము లేదు. ఇన్నిమాటలాడువాఁ డెట్లు చంపఁగలఁడు? నీవాతనికి విధేయుడవై రక్షింపుమని ప్రార్థింపుము. మనప్రాణము లతనియర చేతిలోనున్నవి. జాగ్రత్త! నీవుపొమ్ము. నివు లక్ష్మణుని గలసికొనుము. (నిష్క్రమించును.)

**సుగ్రీ**—(లక్ష్మణునియొద్దకు వచ్చి) అయ్యా! రఘువీరానుజా! నమస్కారము.

లక్ష్మ — ఇప్పుడు రఘువీరుని నామము స్మరించు మంటివా? ఇప్పుడు తదనుజుఁ డగపడెనా? ఆఁ! ఎంతపరాకు! ఎంత రాజ్యమదోన్మత్తత! ఎంతమహాగర్వభూయిష్ఠత! ఎంతనీచ సుఖలంపటత! ఎంతమహోపకారవిస్మృతి!

ఆ. వె. ఉండ గృహము లేక ♦ పండ శయ్యయు లేక
పదరుమనుచు బ్రహ్మ ♦ నుదుట వ్రాయ
వ్రాలుఁ దుడిచి నిన్ను ♦ రాజుఁ జేసినరాము
నకును దగినయట్లొ ♦ నచ్చెనావు.

గీ. అన్నరాజ్యంబు రాముపు ♦ న్యాయంబువలనఁ
గరగితంబయ్యెఁ గాంతలు ♦ గల్గి రెల్ల
ప్రియము లయ్యెను మనకేమి ♦ భీతి యనుచు
నిక్కుచుంటివొ? జాగ్రత్త! ♦ నిను వధింతు.

గీ భ్రష్టరాజ్యుఁడు హృతదారుఁ ♦ డిష్టదూరుఁ
డైనయడవిద్రిమ్మరి చేయు ♦ నద్ది యేది
యనుచు మిడిసెదవొ? వాలి ♦ నడఁచినట్టి
బాణమును జ్ఞప్తిదెచ్చుకో ♦ బ్రదుకఁ దలఁచి.

గీ. దుష్టుఁడగువాలి పోయిన ♦ త్రోవ యింక
సంకుచితము గాలేదు త ♦ త్పథమును
జెంది దేవర వారు వేం ♦ చేయవచ్చుఁ
ద్వరగఁ గానిమ్ము శ్రీచూర్ణ ♦ పాలనంబు.

సుగ్రీ — మహాత్మా! ఇది న్యాయమా? మీరు నాఁటిన మొక్క యిది. మీచేతితో మీరు ద్రుంతురా?

లక్ష్మ — చేతితోఁ గాదు. బాణముతో — తులసిమొక్క యనుకొని నాఁటితిమి. కుక్కపొగాకు మొక్క యయ్యెను. త్రుంచినఁ దప్పు లేదు. బ్రహ్మఘ్నుఁడైనను, గోఘ్నుఁడైనను, గురుతల్పగమనుఁడై

దైనను, జచ్చినపిమ్మటఁ దన్మాంసములు నక్కలుస్పృశించును గాని కృతఘ్నునిమాంసము నట్లు స్పృశింపవు. సమస్తపాపములలోఁ గృతఘ్నత మహాపాపము! అట్టిమహాపాపాత్ముఁడవు. నిన్ను వధించిన దోషము లేదు.

ఆంజ—రామానుజా! క్షమింపుము.

సుగ్రీ—రాఘవానుజా!

గీ. వాలిబాధను దొలఁగింపఁ ♦ బరమదయను
మద్గళంబున గజపుష్ప ♦ మాల వైచి
కాచుఘనపుణ్యమూర్తి పై ♦ కంఠసీమఁ
గట్టుకుటమ్ము నన్నట్టులు ♦ కాల్తువిపుడు.

అంగనామధుపానలోలత యే నాపాతకము. కృతఘ్నత యెంత మాత్రమును గాదు. క్షమింపుము. ఇదివఱకే రామకార్యనిర్వహణప్రయత్నమునకై కపివీరుల రావింపహిమవన్నగము మొదలు కొని దక్షిణాగ్రమువఱకుఁగల సమస్తదేశములలోనికి సందేశముల నంపితిని.

(నేపథ్యమునఁ గపులమహాకోలాహలము, సింహనాదము.)

ఆంజనేయా! అది యేమియో కనుఁగొనుము.

(ఆంజనేయుఁడు నిష్క్రమించును.)

లక్ష్మ—ఆకోలాహల మెందులకో నేనెఱుఁగుదును.

సుగ్రీ—ఎందులకు?

లక్ష్మ—నిన్ను వధించుటకై నేను వచ్చితి నని గ్రహించి కపులు నన్ను ముట్టడించి చంపుటకై మహాట్టహాసములు చేయుచున్నారు. నే నెఱుఁగుదును. కానీ!

సుగ్రీ—(చెవులుమూసికొని) పాపము శాంతించును గాక!

లక్ష్మ—ఒక్కపాపమే కాదు. సర్వ మిప్పుడు శాంతించును.

ఆ. వె. రాఘవేంద్రబాణ ♦ రాజేంద్ర మొకవాలి
వధముఁ జేసెఁగాని ♦ భ్రాతృభక్తి
గలుగునాదునాథు ♦ గము సర్వవానర
వధము నిపుడు సేసి ♦ వఱలునయ్య!

(ధనుస్సున బాణముసంధించును.) ఏమనుకొంటివి?

సుగ్రీ—అటులే కావింపవచ్చును. ఆంజనేయుని రానిమ్ము.

(నేపథ్యమున) అయ్యా! వచ్చుచున్నాను.

ఆంజ—(ప్రవేశించి) సర్వదేశములనుండి ప్లవగనాథులు వచ్చినారు. సీతాన్వేషణమహాకుతూహలత గల్గి రామకార్యధురంధరులై, మహోత్సాహమున సింహనాదములు జేయుచున్నారు.

సుగ్రీ—రామానుజా! వింటివా?

లక్ష్మ—(తలవంచుకొని లజ్జను నటించును.)

సుగ్రీ—గోడచాటునజరుగుకార్యము మనచెవిఁబడిన నదేకారణమువలన జరుగుచుండునో మనకుఁ దెలియనపుడొకనిహృదయమున భక్తియే యున్నదో వైరమున్నదో యుపకారస్మృతియే యున్నదో విస్మృతియే యున్నదో తెలియనగునా? (కౌఁగిలించుకొని) మహాత్మా! కటాక్షింపుము. నాచపలేంద్రియతయే మీరా రిక్కడకువచ్చునంతటిమహాక్లేశమునకుఁ గారణ మైనది. మన్నింపవలయును. ఆంజనేయా! వినుము. నాల్గుదిక్కులందుగూడ నన్వేషించుటయేకాక స్వర్గపాతాళములయందుగూడ వెదుకవలయును. ఎచ్చటి కెవరిని పంపవలయునో బాగుగ నాలోచించి పంపుము. ముఖ్యమగుదక్షిణదిక్కునకై మాత్రము నీవును జాంబవంతుఁడును శరభాదులును పోవలయును.

ఆంజ—చిత్తము.

లక్ష్మ—రావణుఁడు దక్షిణదిక్కునకుఁ బోయినాఁడని తెలిసినప్పుడితరది శలయందన్వేషణ మేల?

సుగ్రీ—పుష్పక మెక్కిపోయినవాఁడు దక్షిణదిక్కునకుఁ బోయినట్లు న టించి మఱియొకదిక్కునకై ప్రయాణము మార్చుకొనఁగూడ దా? దొంగిలించిన వస్తువును దొంగతనగృహమందే యుంచు ట సహజము కాదు.

లక్ష్మ—సామాన్యచోరుల కట్టిసందేహము గాని మహాచోరాగ్రణి యైనరావణున కట్టిసందేహ ముండదు. ఐనను నీయిష్టానుసార మాచరింపుము.

సుగ్రీ—ఇఁక నిక్కడ జరుగవలసిన దేమి?

లక్ష్మ—తొందరపడినందులకు నేను నిన్ను క్షమించుమని కోరుట—

సుగ్రీ—అటు లెప్ప డానతీయవలదు. మన మిద్దఱ మిప్పుడే పోయి రామభద్రు న్నాశ్రయింతము రమ్ము. ఆంజనేయా! నీవుకూడ వచ్చి నీయధీన మగుకార్యమును శీఘ్రముగఁ జేయఁవలయును.

లక్ష్మ—రామచంద్రమాహాత్మ్యమున నితరులకార్యములే ఫలించునప్పు డామహామహునికార్య మన్యథా యేల జరుగును?

సుగ్రీ—తథాస్తు!

(నిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.

---

శ్రీ

# వనవాసరాఘవము.

## పంచమాంకము.

ప్రదేశము—ప్రస్రవణపర్వతసమీపము.

ప్రవేశము శరభుఁడు, అంశుమాలి.

శర—అంశుమాలీ! నాకుఁ దెలియక యడుగుచున్నాను. కేవలము గర్వభూయిష్ఠత కాకపోయిన మఱేది? ,,చూడఁబడినది. చూడఁబడినది,, అనిగావుకేకల వైచినాఁడఁట! వానరు లెవ్వరు చేయనిలేమహాకార్యము తాను జేసితినని మిడిసిరాలిపోవుచున్నట్లున్నాఁడుసుమా!

అంశు—ఆతఁడు గర్వశూన్యుఁడుగావుననే యట్లు చెప్పినాఁడు.

శర—గర్వశూన్యత కేమి కాని కేవలము జ్ఞానశూన్యత చేత—విద్యావిస్మృతి చేసినట్లు చెప్పినాఁడు.

అంశు—అదెట్లు?

శర—చూడఁబడిన దేది? తనమొగమా? నామొగమా? అనాథరాష్ట్రపాలనమువలెఁగర్త లోపించినక్రియయా? శక్తిహీనుఁడువలె కర్మణిప్రయోగమును జేసెనుగదా? ఎవనిచేతనో చెప్పనక్కఱ లేదా? ,,సీత—నాచేత—చూడఁబడినది,, అనిచెప్పఁ గూడదా? నవవ్యాకరణవేత్త యనుమాట వెన్నవెదురాకుపస యేనా?

అంశు—సీత యని యాతఁ డుచ్చరించునప్పటికి—తరువాత నేమాట

యనునో యనిరాముని మనము మహాందోళన మొందదా? బాధపడుచున్న దనునో, క్షేమముగ నున్న దనునో, లేక లే దనునో, యని యపరిమితపరితాపము రాముఁడు పొందు నని యట్లు చెప్పినాఁడు. చూడవెడలినవాఁడు తానే కనుక "వాచేత" ననుమాట యనావశ్యకము. అత్యంతావశ్యకముగఁ గావలసినయంశము చూచుట జరిగినదో లేదో యనునది. కావున "చూడఁబడినది" అని చెప్పినాఁడు.

శర—నీయుత్తరము మెత్తుకొనినట్లున్నది. "చూడఁబడినది" యను మాటలోఁ "జూడ" యనునప్పటికిఁ దరువాత లేదను నేమో యనుసందేహముచే రాముఁడుతలఁ ఘగులఁగొట్టుకొను నని యూహ మాతని కేల లేకపోయెను? ఇంతబాధ యేల? చూచితి నని చెప్ప లేకపోయినాఁడా?

అంశు—అట్లు చెప్పకపోవుటచేతనే యహంకారశూన్యుఁ డని చెప్పుచున్నాను. రామచంద్రుని పూర్వపుణ్యమున దైవకటాక్షమువలనఁ "జూడఁబడిన" దని యాతఁడు చెప్పెనుగాని సముద్రలంఘనమహాకార్యము చేసి భుజపరాక్రమమున లంకలోని యోధవరోధముల నశింపఁజేసి స్వప్రతిభాప్రభావముచేఁ జూచితి నని శేముగుణపంపన్నుఁ డగునాతఁడు వచించునా?

శర—ఓహో! నీబుకుకు శేషత్వమునఱకు వచ్చినదా? ఇఁక రావలసినది శూన్యత్వమేనా? కాని లంకలోని కాంజనేయుఁ డెట్లు పోయెనో పోయినపిమ్మట నేమేమి చిత్రము లెప్పుడెప్పు డెచ్చట జరిగినవో నీకుఁ దెలిసిన నాకుఁ జెప్పెదవా?

అంశు—నాకే కాదు అట్టివిశేషములు సుగ్రీవునికి శ్రీరామునకుఁ గూడఁ దెలియవు. రామునకు సీతాశిరోభూషణము సీతయొద్దనుండి తీసికొనివచ్చి యిచ్చెను. అతఁడు దానిఁగని పొందినవ్యసన

మునకు మితి లేదు. లంకాప్రవేశము మొదలు శ్రీరామదర్శన మువఱకు నహుమ నున్నగాథను గేసరీపుత్త్రుఁడొకనాటకముగ రచియించినాఁడు. దాని నిప్పుడుప్రదర్శించి శ్రీరామమూర్తికి సమస్తవిశేషములతో నిట్టిపవిత్రవృత్తాంతమును నివేదింప దలఁచినాఁడు.

శర — ఈతఁడు నాటకము వ్రాయుట కవకాశ మెప్పుడు కలిగెను? ఏదీ నిన్నమొన్నగదా వచ్చినాఁడు?

అంశు — లంకలోఁ బలుచనిశిలాఫలకములపై నెప్పుడుజరిగినగాథ నప్పుడే యాతఁడు నాటకరూపముగ వ్రాసెను. చిన్ననాటకముగావున నిక్కడి బుద్ధిమంతులగుకపులుకొందఱు పూర్ణముగఁ జదివించి దానిని బ్రయోగించుటకు సర్వసన్నద్ధులైయున్నారు. ఆంజనేయుఁడే యాంజనేయపాత్రమును దీసికొనును.

శర — ఈమహారాజురాజ్యములో నెవనిపాత్ర వాఁడే పుచ్చుకొని యెడు వవలసివచ్చినది. ఆతనికిఁ గవిత్వశక్తి సుగ్రీవునకురాజ్యమువచ్చినట్లే క్రొత్తగ లభించెనా యేమి?

అంశు — జరిగినదేదో జరిగినట్లు చూచి వ్రాసెను. అతని సహాజకవితాశక్తి కింకనుఁ బ్రయోజనము లేకయేపోయెననుకొందును.

శర — ఉన్నదున్నట్లుచెప్పినఁ గవిత్వ మెట్లగును? అదిచరిత్రమగును. వర్ణ్యవస్తువును గల్పనావైశద్యమునఁ గొంతమార్పవలయును. గణములు మొదలగునవి సరిపోక కొంత మార్పవలయును. అప్పుడు గదా కవనమగును.

అంశు — తెలివితక్కువవాఁడా!

గీ. గణయతిప్రాసనందర్భ ♦ గతులకొఱకు
మహితమగుప్రకృతిని గవి ♦ మార్పఁదగునె?

చిత్రసముచితగతి నపే ♦ క్షించి చిత్ర
కరుఁడు తన్మాత్ర్యకాత్కృతిఁ ♦ జెలుపఁగలఁడె?

(నేపథ్యమున) వానితర మగునా? నీవు లోకమాతవు. మహాపతివ్రతవు. ఊఱడిల్లుము.

అంశు—అయ్యో! రామలక్ష్మణసుగ్రీవులు వచ్చుటచే నాటకము జరుగుచునేయున్నది. కాంబోలు! సీతాపరిచారికయు యోగ్యురాలు నగుత్రిజట సీతనూఱడించుచున్నట్లున్నది! నడు. పోవుదము. వీలుగ నుండునెడల ప్రక్కల నుండి విందము రా!

(ఇద్దఱు నిష్క్రమింతురు)

ఇది విష్కంభము.

---

ప్రదేశము—నాటకశాల.

ప్రవేశము—అశోకవనమునఁ ద్రిజటయు, సీతయు.
రామలక్ష్మణసుగ్రీవులు, సామాజికులు.

త్రిజ—వానితర మగునా? లోకమాతవు. మహాపతివ్రతవు.

సీత—త్రిజటా! లంకానాథుఁ డగురావణునితర మగు నని నేనును విచారించుట లేదు.

రామ—త్రిజటా! పుణ్యాత్మురాలవు. విరహిణియు, బలాత్కారకారాబద్ధయు నగునాభార్య నోదార్చుచుంటివి!

సీత—నాకట్టివిచారము లేదు. నానాథుఁ డగుశ్రీరామభద్రుఁ డింక నన్నుఁ గూర్చియింతయు పేక్ష యేల చేయుచుండెనో యని నే నేడ్చుచున్నాను.

లక్ష్మ—సుగ్రీవరాజేంద్రా! వింటివా? నీయుపేక్ష నీమంత్రివలెనే సముద్రము దాఁటి లంకలోనికిఁ జేరుట సంభవించెను.

సుగ్రీ—(లేచి) తల్లీ! జానకీ! నమస్కారము. శ్రీరామమూర్తిని నీ వనవలదు. మధుపానసక్తిచేఁ గాంతానురక్తిచేఁ బ్రమత్తుఁడ నగునావలననే యింతయుపేక్ష జరిగినది. క్షమియింపుము.

రామ—వయస్యా! సుగ్రీవా! కూరుచుండుము. నీ వట్లు చింతింపవలదు.

గీ. కష్టభుక్తికిఁ బరిమితి ♦ గలదు; మనదు
శ్రద్ధలు నుపేక్షలు పనికి ♦ రావు; సీత
దుర్దశ కవధి రాలేదు; ♦ తొందర మన
ము పడఁ గాలము వేగిర ♦ము పడునెట్లు?

గీ. అధికదోషాకరార్తిచే ♦ నలసి వాఁడు
పద్మినికి నిశాంతంబుగాఁ ♦ బరునిబాధ
వదలి శోభవచ్చును మఱి ♦ పద్మహితుఁడె
యాత్రపడినను వేగ రా ♦ నగునె తాను?

(అపవారించి) లక్ష్మణా!

గీ. మొదలె కపిరాజు; కోమల ♦ హృదయుఁ, డంను
పైనఁ బృథులవక్షోత్సాహ ♦ భరమువలన
నధికకోమలహృత్సముఁ ♦ డయ్యె ననుచు
నెఱిఁగియుండియుఁ బరిహాస ♦ సరణి యేల?

గీ. అట్టిమనసున కెటువంటి ♦ యల్పకర్క-
శత కలుగుపల్క యిన బాధ ♦ చాలఁ జేయు
స్వల్పమగుకారము గల ♦ వస్తువైనఁ
బూయునాల్కకుఁ గడు మంటఁ ♦ జేయుఁ గాదె?

త్రిజ——సీతా! ఊరడిల్లుము. నీభర్త నిన్ను పేక్షించునా? ఆతఁ డెట్టిప్ర యత్నములను జేయుచున్నాఁడో?

సీత——హా! పుణ్యాత్మా! జటాయూ! నీవు జీవించియుండునెడల నావా ర్తను నానాథునకు జెప్పియుందువు కదా?

రాము——జానకీ! జటాయువు నిత్యజీవియై యున్నాఁడు.

గీ. దుష్టజనబాధ నొందుచు ♦ శిష్టరక్ష
జనుపులోకోపకారికిఁ ♦ జావు గలదె?
అజ్ఞభూపదరిద్ర ♦ తార్తిఁ బఱచు
భువికి జ్ఞానతేజం బిచ్చు ♦ కవికివలెను.

త్రిజ——నీనాథునకు నీవుండుతావు తెలియకపోయినను సమస్తదిక్కు లందునిన్నన్వేషింప యత్నించును.

సీత——అయ్యో! త్రిజటా! అఖిలదిగన్వేషణము చేయించుట కామహా నుభావునకుఁ బరిచారకు లేరి? సఖు లేరి? (ఆంజనేయుఁడు ప్రవేశించును.)

సుగ్రీ——తల్లీ! జానకీ! ఇడుగో! పరిచారకుఁడు. వీనిజన్మము రామకార్య నిర్వాహణమునఁ బవిత్రత్వ మొందనై యున్నది.

సీత—హా! లక్ష్మణా!

లక్ష్మ—(లేచి) అమ్మా! ఇదిగో! వచ్చుచున్నాను.

రామ—తమ్ముఁడా! కూరుచుండుము. తొందర లేదు. ఆహా! భావనాశక్తిమహిమము!

గీ. ద్వైతి భావనచే ద్వైత ♦ దర్శియగును
భావనాశక్తి నద్వైతి ♦ బ్రహ్మమెయగు
నందఱగుఁ దాను కవి భావ ♦ నాధికతను
సృష్టి దైవభావనను సి ♦ ద్ధించెఁ గాదె?

ఆంజ—సముద్రము దాఁటి లంకారక్షకై యేర్పఱుపఁబడినసురసాలంకిణులఁ జంపి రావణునిపట్టణ మంతయు వెదకి రామకాంతను గానలేక వేసరితిని. ఇది యశోకవనము. ఇచ్చట నామె యున్నదేమో చూచెదను. (వెదకుట నభినయించును.)

రామ—మారుతీ! ఈవనమునందే చూడుము. నీవు కృతకృత్యుఁడ వగుదువు.

గీ. బహుళదుష్కృతిభూయిష్ఠ ♦ పట్టణాళి
వాసవర్జనమును జేసి ♦ జ్వాల దశోక
శాంతవనసీమఁ జేరిన ♦ జనుఁడు గాక
ప్రథితవిజ్ఞానసంపత్తిఁ ♦ బడయు నెట్లు?

త్రిజ—అమ్మా! “హా! లక్ష్మణా!,, యని యూరకుంటి వేల?

లక్ష్మ—త్రిజటా! జానకికే కాక యింతసేపటినుండి తద్విషయమై యాందోళన మొందుచున్ననాకుఁ గూడ మనశ్శాంతిఁ జేయఁ దలఁచితివా?

సీత—హా! లక్ష్మణా! నేను నిన్నాడినకఠినోక్తులకై మనసు విఱిగి రామచంద్రునిదరిఁ జేరక యెచటికైనఁ బోయితివా?

లక్ష్మ—తల్లి చీవాట్లు పెట్టినఁ దండ్రిచాటునకుఁ దండ్రి కోపగించినఁ తల్లిపాదసాన్నిధ్యమునకుఁ బోవుట గాక బిడ్డని కన్యగతి యేమున్నది?

ఆంజ—అయ్యయ్యో! వైదేహీ యెచ్చటను గానఁబడకున్నది. ఏమి సేయుదును? రామా! రఘువీరా! రాజీవలోచనా! జానకిని గానలేని నిష్ఫలములగు—నిర్భాగ్యములగు నీపాదనేత్రములతో—మీ మొగ మెట్లు చూతును? మహాప్రభూ! నేను మిమ్మిఁకఁ జూడను. నా కిఁక లోకములోఁ బని లేదు. నేను సముద్రమునఁగాని యగ్నినిగాని పడి యకృతార్థమగు దేహముత్యజింతును.

రామ—అంజనాపుత్రా! ఎంతమాటాడినావు! మాకొఱకు జటాయువు ప్రాణముల వదలినాఁడు చాలదా? నీవుకూడ నట్లే చేసెదవా? నిర్దోషములై పరోపకారమునఁ బరమపుణ్యములైన పక్షులను, ప్లవగముల నెందఱి నింకఁ జంపుకొని నన్ను బ్రదుకు మంటివి?

ఆంజ—రామభద్రుఁ డిఁక జీవింపఁడు. నేను మరణించు నెడల సీతావార్తలు తెలియనియాతఁ డెట్లు బ్రదుకును? రాముఁడు లేకున్న లక్ష్మణుఁడు జీవించునా? లక్ష్మణు నెడఁబాసి భరతశత్రుఘ్నులు బ్రదుకఁగలరా? పుత్రశూన్య లగుతల్లులు గతి లేక కడ తేరరా? ఆహా! భగవానుఁ డగువసిష్ఠుఁ డీదుఃఖమును గన లేక కాలగతి నొందఁడా? జనకమహారాజు పరమగతిఁ జేరఁడా?

సుగ్రీ—(తనలో) నేనుమాత్రము రామభద్రు నెడఁబాసి బ్రదుకఁగలనా? నాచావునుగూడ దయ యుంచి చెప్ప వేల?

ఆంజ—రామకార్యతత్పరుఁ డగుసుగ్రీవమహారాజు సపుత్రదారబంధుకముగ నశించును.

లక్ష్మ—(తనలో) ఏమి ఆంజనేయా! సర్వజగన్నాశనమును సూచించు చున్నావు?

ఆంజ—

గీ. జనకజ యునికిలో రాము ♦ నునికి కలదు;
వార లిద్దఱిలో జగ ♦ ద్భరము నిలుచుఁ;
బ్రకృతిలోఁ బరమాత్మ ♦ పరిఢవిల్లుఁ
దత్సమావేశమున జగ ♦ త్తంత్రమల్లు.

రాము—సెబాస్! మారుతీ! నాయం దెంతభక్తి కలవాఁడ వైతివి!

త్రిజ—అమ్మా! జానకీ! మాటలాడ వేల?

సీత—రామతారకనామస్మరణముఁ జేసికొనుచున్నాను.

త్రిజ—నేనుఁగూడ విందును; బిగ్గఱగ నుచ్చరింపరాదా?

సుగ్రీ—అమ్మా! నీకేకాదు. ఆర్తుల కందఱ కదియే యుపాయము.

ఆంజ—కావున స్వఘాతుకయత్న మింతట మానుకొని మఱికొంత సేపు వెదకెదను. వెదకెద ననుసహాంభావ మేల?

గీ. రామచంద్రుఁడు సత్యవా ♦ క్ప్రథితుఁ డేని
రాముఁ డద్వయవీర్యవి ♦ భ్రాజి యేని
రఘువరుం డేకభార్యాను ♦ రక్తుఁ డేని
జానకీదేవి నాకిప్డు ♦ కానఁబడును.

రామా! రాఘవా! రాజీవలోచనా!

సీత—రామా! రాఘవా! రాజీవలోచనా! (బిగ్గఱగ నను.)

త్రిజ—రామా! రాఘవా! రాజీవలోచనా! (బిగ్గఱగ నను)

సీత—రామా! రఘువీరా! రణధీరా!

ఆంజ—ఆహా! ఆహా! అమృతము వర్షించుచున్నది.

గీ. రామనామంబు మొదలెక ♦ ్రమంబు; స్త్రీగ
ళోద్ధ మగుటఁ గ్రమతరమై ♦ యొప్పె; మొదలే

రాకచంద్రుఁ డందు శ ♦ రన్నిశోద్ధుఁ
డగుట మఱియింత ముత్ప్రిదుఁ ♦ డైనయట్లు.

న్మ్రగీ—శరత్కాలచంద్రాభివర్ణనము సమయానుగుణముగ నున్నది.

రామ—గీ. కవిత యాంతరసృష్టియాఁ ♦ గాని తత్స
మయమునందుఁ బ్రత్యక్షమౌ ♦ మహితవస్తు
పాళి మెల్లఁగఁ గావ్యక ♦ ల్పనముఁ జేసు
బాహ్యానినదాదిగతులు స్వ ♦ ప్నమునవలెను.

సీత—రామభద్రా! రామచంద్రా! రాజీవలోచనా!

ఆంజ—అదిగో! దక్షిణముననుండి పరమసుఖానందకర మగుమహనీయ నామాంకురపాళి వచ్చుచున్నది. అట్లు పోయెదను. సీత యచ్చట నుండక తప్పదు. లంకలో జానకి గాక రామనామస్మరణ పరాయణ యెవతె యుండును? (అటునిటు కలయఁజూచి) అదిగో! ఈమలుపులో సమీపముననే రామభార్య యాశింశుపావృక్షముక్రింద నొకవికృతరూప యగు రాక్షసాంగనతో నున్నది.

గీ. అసిత కేశాళి జడగట్టి ♦ నసురవనిత
ముందరను దివ్యశోభతో ♦ ముదిత యొప్పె
వ్యాఘ్రకామిని శీతార్తిఁ ♦ బాపుకొనఁగఁ
జేరునట్టి సధూమాగ్ని ♦ శిఖనుబోలి.

ఈరాక్షసకాంతను ముందు చంపవలయును.

రామ—కపిశేఖరా! వలదు. దానివాగ్వైఖరి నీవు వినకపోవుటచే నట్లనుచున్నావు.

గీ. పులిమొగంబున నజసౌమ్య ♦ లలితహృదయు
లజముఖంబున వ్యాఘ్రతు ♦ ల్యహృదయులును

జగతిఁ గలరు తచ్చిత్తనై ♦ జమును వ్రాస్త
పఱుచునది జిహ్వకాని రూ ♦ పంబుగాదు.

లక్ష్మ—సుగ్రీవా! నీవు నాటకము నిదివఱకుఁ జదివితి వేమో? ఈరా
క్షసాంగనను హనుమంతుఁడు చంపఁడుకద!

సుగ్రీ—ఇదివఱ కిద్దఱను జంపినాఁడు. చంపినయెడల నిది మూఁడవది.
ఇది చచ్చినయెడల రాక్షసాంగనాసంఖ్యకు లోటు వచ్చునని
విచారించుచుంటివా యేమి?

లక్ష్మ—నాయభిప్రాయ మెఱుఁగక యట్లడిగెద వేల? జానకికిఁ దిరుగ
నిట్టియోగ్యురా లగుపరిచారిక లభింపదేమో యని నే నాందో
ళన మొందుచుంటిని.

సుగ్రీ—మనమే శీఘ్రముగ సీతాదర్శనమునకుఁ బోవుచుండ మనకంటె
యోగ్యపరిచారకు లెవరు?

ఆంజ—ఈమెనిశ్చయముగ సీతయే ఆమెధరించిన వస్త్రములుంగు మా
కుదొరికిన నగలు ముడిచిన వస్త్రమురంగు నొక్కటి. ఆనగలుధ
రించినయానవాళ్లుకూడ నీమెదేహమునఁ గొంతవట్టునకుఁ గానఁబ
డుచున్నవి. ఈబాహ్యనిదర్శనములతో నేమి?

గీ. రామదర్శనమున నెట్టి ♦ రాగభక్తు
లంకురించెను నాకిప్పు ♦ డట్టి రాగ
భక్తు లంతకు ఘనములై ♦ ప్రబలుచుండు
బిడ్డకుఁ బితకంటెను మాత ♦ పేర్మిగాదె?

రామ—జానకీ! మనకు బిడ్డలు లేరని నీవప్పుడప్పుడు విచారించితివి కా
ని జగతిలోని జీవములన్నియు మనకుబిడ్డలేసుమా!

సుగ్రీ—(తనలో) చండాలుఁడగు రావణుఁడు తప్ప—

ఆంజ—ఈవైపుననుండి నూపురఘంటికలారవము వినవచ్చుచున్నది.
ఎవరైనవచ్చుచున్నారేమో?

(నేపథ్యమున)జయ! సర్వలోకైకనాథ! జయ! దశశీర్ష వింశతిభుజ సనాథ! జయ! మునిజనాభీలా! జయ! సీతాపహరణలోలా!

సీత—అయ్యయ్యో! దుర్మార్గుఁడగుదశగ్రీవుఁడు మఱల వచ్చుచున్నట్లున్నాఁడు.

త్రిజ—రానిమ్ము! భయమేమి?

ఆంజ—నేనీతనికిఁ గనఁబడకుండ నీచెట్టుమాటున దాఁగి యుండి వీనిచర్యనంతయుఁ గనిపెట్టెదను.

లక్ష్మ—మునిజనాభీలా! యని, అపహరణలోలా! యనియీపరమకిరాతుఁడు తనదుష్టకార్యముల నతిశ్లాఘాపాత్రములుగ, బిరుదములుగఁ జేసికొనినాఁడు.

సుగ్రీ—క్రూరత్వములో సిగ్గుమాలినతన మిదియేకదా? ఓమహాపాపాత్ముఁడా! రావణా! ఇంతలో కాపకారమొనర్చినసీ కెట్టిదుర్గతియున్నదోరా?

రామ—ఎవ్వరికిని దుర్గతి లేదు. ఇదియే యీశ్వరుకరుణా కటాక్షవైభవము. పురాకృతపుణ్యమున సత్సహవాసమునగుసుకరుణామాహాత్మ్యమునఁ గొందఱు మొదటినుండియు సత్పథానువర్తులగుదురు. కొందఱు పెద్దత్రోవలఁబడితామసమహాకష్టములఁ బడియొకనిని బెట్టి లోకకంటకులుగ నుందురు. కొంద ఱట్టె చెడి యట్టె మంచిత్రోవకువచ్చి సదసత్ఫలముల నడుమఁ గష్టగంతులు వైచుచుందురు.

గీ. పరమయోగ్యులు మాధ్యస్థు ♦ లురుతమోగ్ర
పాపులును గూడఁ గాలాను ♦ వైఖరిగను
దైవమును జేరుదురు వివి ♦ ధప్రవాహ
గతులయిన సర్వనదులును ♦ గంధినట్లు.

(నేపథ్యమున) ఓయంగనలారా! మీరెవ్వరు నాతోడ రాకుండు! మిమ్ముం జూచి నైదేహి మఱింత బెదరినన్ను నిరాకరించును.

(రావణుఁడు ప్రవేశించును)

గీ. సిగ్గు భోజనగరిమకు ♦ నెగ్గు సేయుఁ
జింత నిద్రాసుఖంబును ♦ జెఱచివైచు
భయము రాగంబునకుఁ బ్రతి ♦ బంధమగును
తీఱనివలపు తనువునే ♦ సీఱు సేయు.

లక్ష్మ—తథాస్తు! తథాస్తు!

సుగ్రీ—(తనలో) తనకుం గావలసినవి యిందు, నింక గానున్న దొకటి ని జెప్పకొనినాఁడు.

రావ—ఇఁక రామకాంతను సమీపించెదను.

ఆంజ—రామకాంత నే కాను. రామదూతనుగూడ—

లక్ష్మ—ఇద్దఱను గాదు. రామబాణదత్తమృత్యువును—

రావ—త్రిజటా! జానకీదేవికి సుఖమా?

త్రిజ—ఇఁక ముందు సంభవింపవలయును గాని యిప్పటికి లేదు.

రావ—ముం దెప్పుడో కాదు. ఇప్పుడుసంభవింపఁజేయుటకే వచ్చినాను.

ఆంజ—(తనలో) ఓరి నిర్భాగ్యుఁడా! నీవఁటరా యామెకు సుఖముఁ జేయువాఁడవు? రామవార్తాకర్ణనమున నామెకు సుఖమిచ్చుటకు నీకు దుఃఖమిచ్చుటకు వచ్చిన శ్రీరామ సేవకుఁడను.

రావ—జానకీ! ఇంత నిర్దయ తగునా? ఆశ్రితపక్షపాతమైన వలదా? అర్థిజనవాంఛాప్రదానము వలదా? నాధనమంత నీది! లంకారాజ్య మంతయు నీది. నాయఖిలభోగసంపత్తియు నీది. నా భార్య లందఱు నీపరిచారికలు. నేను నీవాఁడను. కటాక్షింపుము.

సుగ్రీ—(తనలో) అరే! తుచ్ఛుఁడా! దొంగసన్యాసివై యామె నపహరించి దొంగనైచ్యమున నామెను వశపఱుచుకొన నెంచితివా?

నీ వామెవాఁడవా? నీసంపత్తి యామెదా? నీలంకారాజ్యమామెదా? నీవు వచ్చినవాఁడవు. నీసంపదయు లంకావైభవమును రామచంద్రునియాధీనములు.

లక్ష్మ—(లేచి) రే! చండాలుఁడా! మాతృద్రోహాసక్తా! కన్నులు గానక కాలులఁబట్టుచుంటివా? నీసర్వవంశనాశనము దగ్గఱఁబడినదిరా?

రావ—తమ్ముఁడా! శాంతించుము. కూరుచుండుము. ఆతఁ డిప్పటి కనినవి కాలులే కావు.

లక్ష్మ—మహాత్మా! ఇంతకంటెఁ గఠినవాక్యములు నాచెవిఁ బడనున్నవా? నే నెట్లుసహింపఁగలను? రామభద్రా! ఈతుచ్ఛుని హింసించుటకు నన్నొక్కనిఁ బంపుము.

రావ—ఇంతకోపమా! ఇంతకాఠిన్యమా! ఇంతనిర్దాక్షిణ్యమా? నాతో మాట లాడవు! నావంకఁ జూడనైనఁ జూడవు!

ఆంజ—(తనలో) లయమొంద నున్నవానికి లక్ష్మీకటాక్ష మెట్లు రా? నిర్భాగ్యుఁడా!

సీత—(తనలో) గడ్డిపఱకను ద్రుంచి నమను నుంతును (అట్లు చేయును)

ఆంజ—సెబాస్! తల్లీ! రామభద్రుఁడు ని న్నీరీతిగఁ ద్రుంచు నని చెప్పక చెప్పుచున్నావు.

సుగ్రీ—సౌమిత్రీ! సీతాదేవి యట్లు తృణహరణమును జేసి యటనుంచుట కేమికారణము?

లక్ష్మ—మహాపతివ్రత యగుజానకి యీచండాలునితోఁ బ్రత్యక్షముగ మాటలాడునా? రాక్షసు నుద్దేశించి తృణమును సంబోధించు నని యనుకొందును.

సుగ్రీ—అందుచేత రావణుఁడు తృణప్రాయుఁ డని యామె యభిప్రాయ మైయుండును.

రామ—(తనలో) హా! జానకీ! ఎంతబుద్ధిమంతురాలవు!

సీత—ఓతృణమా!

రావ—ఆ! ఆ! నేను తృణమునా?

ఆంజ—(తనలో) ఇంక సందేహమా? యమవాహన మగుచున్న పోతు నకు—

లక్ష్మ—కాకేమి? తృణమువే. రామబాణాగ్నికి—

సుగ్రీ—నేను తృణము నైతినా యని పరువుపోయి యేడ్చుచున్నావు కాంబోలు! నీవు తృణమువు కావు. భూలోక మహాభారమవై యుంటివి! సరియేనా? ఇంక నోళ్లు మూసికొనుము. రామభద్రుని పుణ్యమున భూభార నిర్వాపణ మగును.

రావ—గీ. అష్టదిక్పాలకులఁ దన్ని ♦ యమ్మ యనుచు
నేడ్వఁజేసి గడ్డిని గఱ ♦ పించి సాల
లందు వరుసగఁ గట్టుకొ ♦ య్యాలను గట్టి
నట్టియేఁ దృణంబనటంచు ♦ నెట్టులంటి?

సీత—తన భార్యలం దసంతుష్టిఁ జెంది చపలచిత్తుఁడై పరభార్య లగుపతివ్రతలఁ గోరుపాతకుఁడో తృణమా! నీకంటె లఘుతరుఁడు. అధమాధముఁడు. యశస్విని రామచంద్ర భార్య నగునాయందుఁ దగిలినమనస్సును నివర్తింపఁ జేసికొని నీభార్యలందు లగ్నము చేసికొనుము. వారలయందు నిరాదరణ మగపఱుచుట చాల దోషము. నిన్నే దైవ మని నమ్మినవారిని దుఃఖపఱుచుట న్యాయము కాదు. ఇప్పుడు నీచే విడువఁబడిన నీభార్యలకొఱకు నేను విచారమొందుచుంటిని. పాపము! వారిమనస్సెంతో పరితాప పడుచుందురో!

ఆంజ—(తనలో) ఆహా! రామువనితా! కృపాస్వరూపురాలవు.

రావ—నీచమత్కారపుమాటల కర్థముఁ దెలియనిమూఢుఁడనుగాను. ఆ మాత్రపురసవిద్యాప్రావీణ్యము లేనివాఁడను గాను. నాకు భార్యలయం దుండుదాక్షిణ్యమువలన వారిని త్యజింపలేక త్వదీయని రంతర సేవానుభవమునకు నాకవకాశము గలుగ దని సగ మొత్తి పొడుపు సగము భూషణము, సగము నిరాకరణము, సగము కోరిక, సగము కోపము, సగము దయం గూడినయీమాటల నుచుంటివి. నే నెఱుఁగుదును. హే హే హే! (నవ్వుచున్నాఁడు.)

సుగ్రీ—ఆంజనేయా! మూఁచెడ వేమి? తన్ను! మూతిపై నొకటి యీడ్చికొట్టు! నోటియొట్టపుముండకొడుకు!

లక్ష్మ—(లేచి) వెళ్లి కొట్టక యొకనిని గొట్టుమనెద వేమి? లే!

(ఇద్దఱు లేచుచున్నారు.)

రామ—కరుణము లగునాటకభాగములను రసపూర్ణముగ నభినయించువారి కిదివఱకు సామాజికులవలనఁ దిట్టులే కాని మీనాఁడు దెబ్బలుకూడ సంభవింపనై యున్నవా?

లక్ష్మ—(అపవారించి) సుగ్రీవుఁడా! కూరుచుండవలసిన దేనా?

సుగ్రీ—(అపవారించి) అంతకంటె నిప్పుడు చేయఁదగిన దేమున్నది?

ఆంజ—(తనలో) రావణునియీయజ్ఞాన మన్యథా జ్ఞానమా! విపరీతాజ్ఞానమైయుండునా?

రావ—నాకు నాభార్యలయం దాదరణము కలదని నీవు సందేహింపఁబని లేదు. నాకుధనమందు లేదు. పుత్త్రులందు లేదు. రాజ్యమునందు లేదు. నీకటాక్షము లేనియీబ్రదుకునందైన నభిమానము లేదు. నీవు నన్నేలుకొనుము. కటాక్షింపుము.

సీత—ఓతృణమా! నేనుబరతంత్రను; నేను నీవలెనే యేలఁబడుదానను గాని యేలుదాననుగాను. ఇప్పుడు నీవనినమాటలు నీవును నేనును బోయి యాశ్రీరామభద్రునిగాంచి యామహానుభావునితో

ననునెడల నాతఁడు మనలఁ గాపాడును. నేనునిన్నుఁగూర్చి యాతనితో ననుకూలముగఁ జెప్పెదను. నీపాపముల నాతఁడు ఖండించి నిన్నుద్ధరించి సంప్రాప్తపుణ్యాగతునిగఁ జేయును. మహాపాపాత్ముఁడవు. పాపములు పండినవి. ఎల్లకాలము బ్రదుకుదువా? శేషకాలము నీకు మిక్కిలి తక్కువగ నున్నది. అంత్యకాలమందైననజ్ఞతను విడిచి జ్ఞానమును సంపాదించుకొనుము. జ్ఞానములేనిజన్మమునకు సార్థకత యెక్కడిది? నిద్రాహారసంగసక్తుఁడవై యున్ననీకు నల్పకీటకములకును భేద మేమున్నది? ఆఁడుదాననైన నేను నీకు నీతినిబోధింపవలసివచ్చినందులకు మిగుల లజ్జపడుచున్నదానను. నిన్నుఁ జూడ నాకు మిక్కిలి కనికరమగుచున్నది. నీవంటిచపలచిత్తునకు మంచియూహము స్థిరముగ నిలువదు. ఆలసింపకు. పుణ్యపురుషుఁడగు శ్రీరామభద్రునకు నన్నిచ్చి శరణమును వేఁడుము. ఆతఁడు శరణాగతవత్సలుఁడు లే. ఆతనిదివ్యమంగళమూర్తిని సందర్శింతము రమ్ము.

రావ—హేహేహే! ఆతనిని సందర్శించెదా? నీవా? నేనా? నీవును నేనునా? హేహేహే! ఏటిమాటలు! నామాట యటుంచుము. నేను జీవించియుండఁగ నీవాతనిని దర్శింపఁగలవా?

సుగ్రీ—తథాస్తు! నీవు చచ్చినతరువాతనే శ్రీరామభద్రుఁడు సీతాదర్శనమును జేయును.

లక్ష్మ—నిన్నుఁ జంపినతరువాతనే యని యనుము.

రావ—రామునితో నా కేమి? నాకు నాతని కెంతగు తేడ యున్నది! ఆతఁడు లుప్తగుణుఁడు; లుప్తరాజ్యుఁడు; లుప్తదారుఁడు; లుప్తసర్వస్వుఁడు. ఆతఁడు నరులలో నరుఁడు. మృగములలో మృగము. ఆతఁడసహ్యరూపుఁడు. దివ్యమంగళరూపుఁడని చెప్పెచున్నావు. రూపమని వచింపఁదగినదికూడ నాతని కున్నదా?

ఆతఁ డెక్కడ? నే నెక్కడ? అట్టి యూరుపేరు లేనివానిని నేను జూడనా? వేఁడనా? నా కాతఁ డక్కఱలేదు. నాహాని యంతయు నీతోడనే యున్నది.

ఆంజ—(తనలో) ఆ! సర్వవంశనిర్మూలనము.

లక్ష్మ—రామ రామ రామా? నా కీదురాత్మునిపలుకులు కర్ణశూలంబులై యున్నవి. ఇంక నుపేక్ష యేల? కపిసేనలు సిద్ధములై యున్నవి. లంకపై దండెత్తుదము లెండు.

రామ—నాటకము పూర్తి యైనపిమ్మట నట్లే పోవుదము. రావణుని మాటలు నా కేమియు బాధనిచ్చుట లేదు. కాన నీవుకూడ వానికై యిబ్బందిపడవలదు. ఆతఁడు పాపుఁడైనఁ దత్స్వభావము ననుసరించి పాపపుమాటలనే యాడును. అందులకు విచార మేల? తద్వ్యతిరిక్తుఁ డైనచో మంచిమాటలనే యాడును. ఎట్లాలైన విచార మేల? అట్టివాఁడే యైయుండు నెడల స్త్రీవిద్వేషాసకునివలె మాటలాడుచున్నాఁడు. అయినను నీకీగోడవ యేల?

లక్ష్మ—ఇంతమహాపాపము నొనరించినవాఁడు పాపదూరుఁ డెట్లగును.

రామ—ఎట్లగునా? రాజప్రతినిధి నగు నావలన దండనము నొంది వాలి యైనట్లు యగును. అది గాక యెట్టిపాపాత్ములైన నాకస్మికముగఁ బుణ్యమార్గానుగతు లగుదురు. హఠాత్సిద్ధు లని స్వప్నసిద్ధు లని వసిష్ఠభగవానుఁడు సెలవీయ వినియుంటివి కదా? దివ్యమైనస్వప్న మొందుటచేఁ గాని పుణ్యజీవదర్శనమువలనఁ గాని పాపు లొక్కమాఱుగఁ బుణ్యాత్ము లగుట కలదు.

లక్ష్మ—ఇఁక మీసందర్శనమునఁ నట్లగు నేమో?

రామ—నన్నే చూపవలయునన్న మాట యేమి? మహాపతివ్రతాదర్శనము సామాన్యమా? నాయనా!

గీ. శుద్ధమగునాత్మ తనపారి ♦ శుద్ధ్యగంధ
మంతికాత్మల కిచ్చుఁ ద ♦ న్నంటియున్న
ద్రవ్యములకు విద్యుచ్ఛక్తి ♦ భవ్యమైన
ద్రవ్యమాత్మశక్తి నొసంగు ♦ దారిగాఁగ.

గీ. చల్లనగువాని కగ్ని యు ♦ ష్ణత్వ మీదె?
కల్మషాసహ్యులకు శుద్ధి ♦ గంగ యీదె?
విషము సంజీవి చేయఁడే ♦ భేషజుండు?
శిష్టత నొసంగు స్వచ్ఛాత్మ ♦ చెనఁటి కల్లి.

గీ. జనులయందును వైద్యుత ♦ శక్తి కలదు;
సోపయోగ మయిన నద్ది ♦ యోగ మగును;
బాహ్యవర్తియై యది తను ♦ వ్యాధి మాన్పు
నాత్మరోగములొ వృజి ♦ నాళిఁ గూల్చు.

గీ. ఎంతపరిశుద్ధుఁడౌ జనుఁ ♦ డంతదైన
శక్తి దరిఁజేరువాఁ డౌను ♦ సర్వజీవ
పాళిలోఁ బతివ్రత బహు ♦ స్వచ్ఛ యగును
ధరణియందు ద్వితీయమా ♦ దైన మదియె.

చూడు! రావణుఁ డేదో మాటలాడఁబోవ నున్నాఁడు.

రావ—ఏమైన నుత్తర మిచ్చెద వని యింతసేపటినుండియు నిరీక్షించు చుంటిని. సర్వశూన్యుఁడగు రాముఁడు లేని వాఁడని యెంచుము.

లక్ష్మ—రే! రాక్షసాధమా! ఇరువది కన్నులుఁ గూడ నింకిపోయినవఁ టరా! ఇదుగో! రామభద్రుఁడు; రాక్షసాంతకుఁడు జానకీభర్త లే నివాఁ డనెద వేమిరా?

సుగ్రీ—మతి లేక—బ్రతుక గతి లేక—

ఆంజ—(తనలో) లేనివాఁ డేమిటిరా? మాతృద్రోహమున నాస్తిక తకూడనా?

సీత—నానాథుఁడు లేనియాతఁ డెట్లగును?

రావ—ఏమియు లేకపోవుటచేత—

రామ—రావణా! ఆలోచించుకొనుము. ఎంత లేనివాఁడైన నుండవచ్చును.

గీ. ఎవియు లేని బ్రహ్మంబు నీ ♦ యెదుట లేదె?
ప్రబలమాయయనా మాయ నీ ♦ కజ్జ లేదె?
అన్ని లేక యుండఁగవచ్చు ♦ నున్న రేని
నున్న హెచ్చింప నొకటి వ ♦ చ్చుటనుగనమె?

సీత—ఏమి? నానాథుఁడు లేనివాఁడా?

రావ—ఉన్న వినియోగ మేమి? ఆ! ఉన్నాఁడు. జడుఁడై, స్థాణుఁడై, నిరుపయోగుఁడై, చాపరాశ—అట్టి యభాగ్యునితో సంపూర్ణదివ్యమంగళ విగ్రహావగుసే కట్టి మహాపురాతనప్రారబ్ధమువ సమావేశము సిద్ధించినదో!

సీత—నీవు కన్ను లున్నవాఁడ వైనయెడల నాతఁడే దివ్యమంగళవిగ్రహుఁ డనియు నేనే జడస్థాణుస్వభావ నని నీవు కనిపెట్టలేకుందువా? ఐహికసుఖలోలుఁడవై, యున్మత్తుఁడవై, యజ్ఞానాంధకారనిర్మగ్నుఁడవై, యధోగతి నొందుచుంటివి. నే నేమి సేయుదును? నీకర్మ మెట్లో యట్లు జరుగక తప్పునా? రక్షోవంశనాశనమునకై న న్నిక్కడకుఁ దెచ్చితివి. రామబాణము లింక మృత్యుస్వరూపములై—

రావ—రాముఁ డిక్కడకు రాకుండనే రామబాణములా?

సీత—నీవు నన్నాతని యొద్దకుఁ దీసికొనిపోయి యర్పింపకున్న నాతఁ డిక్కడకు రాఁడా?

రావ—హేహేహే! ఏమి యిట్టి! ఏమియసందర్భవాగ్వైఖరి! రాముఁడే! ఇక్కడకు? వచ్చుటయే? రావణునియొద్దకు—సకలసురనాశనదీక్షాక్షీణ పరాక్రమనిర్వక్రునియొద్దకు—ప్రచండ మాయాకలా

ప్రవీణతా పటిష్ఠునియొద్దకు—సర్వతాపసకపోలచపేటాటోపుని
యొద్దకు—ఏమి రాముఁడా! వచ్చుటయే? ఆ! ఆ!

లక్ష్మ—రామభద్రుఁడు వచ్చుటయే కాదు. నీవుచచ్చుట—జానికిని దె
చ్చుట కూడ సంభవించును.

ఆంజ—(తనలో)

గీ. శివధనుర్భంగకరశక్తి ♦ జెప్పనేల?
ఖరసురారిఘనస్మరుపరా ♦ క్రమము తలఁపఁ
జనునె? మఱియు మాయామాను ♦ షస్వరూపు
మాయ యెంతో? నీబలమెంత ♦ మాయ యెంత?

రావ—సర్వనరాంతకుఁడ నైననాయొద్దకే—ఏమి?దశకంధరు నొద్దకు—
వింశతిభుజునియొద్దకు—

సీత—నీవింతపాపాత్ముఁడవు, వికృతరూపుఁడవు కావుననే యాతఁడు
వచ్చెను.

రావ—వచ్చునా? హేహేహే! నీకొఱకా? నాకొఱకా?

సీత—నీకొఱకే! నిన్నుశిక్షించిన తరువాతగదా! నన్ను రక్షించుట!

రావ—హేహేహే! అటులైన రామునకు నీకంటె మేమే ప్రథమదర్శ
నీయులమా!

సుగ్రీ—పండ్లూడఁ జెప్పదెబ్బలు తినుటకు—

ఆంజ—రామునికంటె నీవేరామదూతకుఁ బ్రప్రథమదర్శనీయుఁడవైతివి.

రామ—(తనలో) రావణా!

గీ. సీతకంటె నిన్ ముందు యో ♦ జింతు; సీత
పేరుకంటె స్మరింతు నీ ♦ పేరు ముందు
సీతకంటెను దగ్గఱ ♦ నైతి హృదిని
సీతకంటె నిన్నే ముందు ♦ జూతునయ్య!

గీ. సీతవిపత్తులగు నీవు ♦ పాతకంబు
లిసుమ లకఁగుఁ బోకున్న ♦ భరింపవచ్చుఁ
బాపములు శాశ్వతంబు లో ♦ ర్వంగఁ దగునె?
ఆమొఃనికంటె నీదె ము ♦ ఖ్యంబు నాకు.

రావ—నేటి వెఱ్ఱిమాటలు! రాముఁ డిచ్చటకు వచ్చుట యెన్నఁడును జరుగదు. ఆతఁడు నిన్ను రక్షించు ననుట యసత్యము. అసంభవము. ఆతఁడు నన్ను శిక్షించుట దుర్లభము. నన్ను రక్షించిన నీవే రక్షింపవలయును. శిక్షించిన నీవే శిక్షింపవలయును.

గీ. బ్రహ్మరుద్రులు నాకు వ ♦ రంబు లిచ్చి
పైని మంత్రాక్షతలఁ జల్లఁ ♦ బూనినప్పు
డైన వంచనితల లిప్పు ♦ డేను దైన్య
మునను వంచితిఁ జేతులు ♦ మోడ్చి యిదిగో!

లక్ష్మ—రామకాంత యెదుట నీతలలు వంగెను. కాని రామచంద్రుని యెదుట నేలపై నూడి పడును.

ఆంజ—(తనలో) రామభక్తురాలికి నమస్కరించి నప్పటికి ననేక శిరస్కరప్రయుక్తుఁడ వగునీవు రామభక్తుఁ డ నగునాకు నమస్కరించినట్లగ పడుచున్నది. కాన నామెయూరకుంటచే నే నాశీర్వదింపకతప్పదు. పుత్రనాశన మస్తు! లంకాదహన మస్తు! సర్వబంధుపరివారమారణ మస్తు! దశశిరఃకర్తన మస్తు! వింశతిభుజ కాండఖండన మస్తు! విధవాంగనా విలాపోస్తు! సర్వప్రదేశ వినిక్షిప్త శ్మశాన వాటికాసమృద్ధి రస్తు! నిత్యనరక లోకావాససిద్ధి రస్తు! నాలోనే ననుకొనుటచే నేనే తథాస్తు! తథాస్తు!

రామ—(తనలో) ఆంజనేయా! నిత్యనరక లోకనివాసము మాట యసత్యము. ఈతఁడు మహానుభావుఁ డైయుండవచ్చును. భక్తుల లోని వాఁడై యుండవచ్చును. కాని శాపవశమున భక్తిజ్ఞాన

ములు నిలుకడ లేకున్నవి! పాపము! నాశిక్ష ననుభవించి ముక్తుండై యగును. లేకున్నఁ శాపశేషమున కింకొక్కజన్మ మెత్తి కడతేఱి దైవసాన్నిధ్యమున నుండవలసిన వాఁడుగఁ గానిపించుచున్నాఁడు. శాపవశమున భ్రష్టుండై యిట్లు జన్మించిన మహానుభావులలో వాఁడు కాని సామాన్యుఁడు కాఁడని నాకుఁదోఁచుచున్నది.

రావ—నమస్కరించినఁ గూడ దయ రాదా? నేను జడాత్మ ననియు స్థాణువు ననియు నీవు చెప్పిన నేమో యనుకొంటిని గాని నిశ్చయముగ నీవట్టిదానవే యగుదువు. పైదళుకులు, బెళుకులు, వన్నెలు, చిన్నెలు మనుష్యుఁ జూపుటకు ధరించితివి కాని, మఱి యొకటి కాదు. నేను నీచేతిలో మాత్రము చావను.

సుగ్రీ— రామునిచేతిలోఁ జత్తువుగాక!

లక్ష్మ—తథాస్తు.

సీత—నే నొక్కనికిఁ జావు నిచ్చుదానను గాను.

ఆంజ—(తనలో) ఒక్కని కిచ్చుదానవు గావమ్మా! సర్వరాక్షస వంశమునకు—

సీత—అట్టిదాననే యగునెడల నింతసే పెందులకు? కృపాతిరేకమున నూరకుంటిని. తపోవ్యయభీతి నూరకుంటిని. రామాజ్ఞారాహిత్యమున నూరకుంటిని. లేకున్న నీతృణమే నిన్ను భస్మము చేయఁగలదు.

రావ—వేఁడినకొలఁది బిగింపు లధికమగుచున్నవి. దైన్యపడిన కొలఁది ధైర్య మెచ్చగుచున్నది. ఆఁ! ఇఁకఁ జాలు! నీకిచ్చిన గడువులోఁ బదిమాసములు గడచినవి. ఇఁక రెండుమాసములు మిగిలియున్నవి. ఈమితిలోపల నీవు నాకోరికఁ దీర్పవలయును. లేకుండునెడల నీరూపు మాపెదను. జాగ్రత్త! ఓరాక్షసాంగనలారా! ఇదిగో! వచ్చుచున్నాను. దారి సూపుఁడు.

(నేపథ్యమున) చిత్తము. దయచేయుండు.

రావ—సీతా! బాగుగ నాలోచించుకొనుము. ఈగడువు దాటువిమ్మట నేను నిన్నుఁ జూచుట సిద్ధింపదు. జాగ్రత్త! (నిష్క్రమించును.)

సీత—తథాస్తు. త్రిజటా!

త్రిజ—(లేచి) అమ్మా!

సీత—నిద్ర వచ్చినదా?

త్రిజ—స్వప్నముకూడను—

సీత—ఆస్వప్నము నాతోఁ జెప్పవచ్చునా?

త్రిజ—స్వప్నముఁ జెప్పవచ్చును. దానిశుభఫలము వేగ రానువచ్చును.

సీత—నాకింక శుభవార్తా శ్రవణముకూడ నున్నదా? చెప్పుము.

ఆంజ—(తనలో) అది యొసఁగుటకే వచ్చితిని గాదా?

త్రిజ—రాముఁడు శుక్లమాల్యాంబర ధరుఁడై చందనాది చర్చల ధరించి హంసరాజ సంయుక్త మగుదివ్య పుష్పకమున నెక్కి నిన్నుఁ దొడపై నుంచుకొని లక్ష్మణుఁ డొకవైపున నొకకోఁతి రెండవ వైపున వింజామరలు విసర నుత్తర దిక్కునకై పోవుచుండఁగఁ జూచితిని.

ఆంజ—(తనలో) ఆకోఁతి నేనో లేక సుగ్రీవమహారాజో?

త్రిజ—పుష్పకము పోవుచుండఁగ నీవు చంద్రసూర్యులఁ జేతితోఁ దాఁకినట్లు చూచితిని.

సీత—నాకంటె నదృష్టవంతురాలవు. నానాథుని స్వప్నమందైన నీవు చూచితివి. నీపూర్వపుణ్యము మంచిది.

ఆంజ—(తనలో) ఈరాక్షసవనితను జంపవలయు నని మొదట నను కొంటిని. చంపకపోవుటయే మంచిపని యైనది. ఇప్పు డిట్టిశుభ వాక్యములు చెప్పుటకుఁ గారణ మైనది. బాధలో నున్నవారికి

స్వప్నములు, శకునములు మొదలగునవి కొంత మనశ్శాంతి నిచ్చును.

సుగ్రీ—లక్ష్మణా! ఈస్వప్నము శ్రీరామవిజయమును స్పష్టపఱుచు చున్నది.

లక్ష్మ—ఇకనిట కందునుగూర్చి సందేహ మేమున్నది?

సీత—వినఁదగిన స్వప్నమును జెప్పినావు.

త్రిజ—వినఁదగిన దింక ముందున్నది.

సీత—అలాగా? చెప్పవేమి?

త్రిజ—రావణుఁడు తైలాభిషిక్తగాత్రుఁడై తైలమును ద్రావుచు రక్తమాల్యాంబరధరుఁడై గాడిద నెక్కి నెత్తురుకాలువలుగుండ దక్షిణాశకై పోవుచుండ నక్క లాతనిమీఁద దుమికి మొదలు పీకఁగ—గ్రద్దలు తనపై వ్రాలి కిరీటములను శిరోజముల నెగు రఁ దన్నుకొనిపోవ నాతఁడు వానిని బెదరింపఁబోయి గాడిద నుండి నేలఁబడి, పండ్లూడి, తలలు పగిలి, యేడ్చుచున్నట్లు చూచి తిని. కాళ్ళు సేతులు తెగినకుంభకర్ణుఁడు రక్తమున దొరలు చుండఁ జూచితిని. రాక్షసు లందఱు భయంకరము లగుమర ణావస్థల నొందఁ జూచితిని.

ఆంజ—(తనలో) వైదేహి యీకీతిగా వెల్లడి యైనది. సీచరాక్షసీము ఖమున వెల్లడియగు టాశ్చర్యముకాదు.

గీ. పడినబల్లి, ప్రాఁకినతొండ, ♦ పాదము మోఁది
చేయి, కూయుబీతువునంటి ♦ హేయవస్తు
వులె మొదట దేవుచిత్తంబు ♦ తెలిసి తెలుపు
ధరణిపులచిత్తగతి క్షుద్ర ♦ దాసులట్లు.

సీత—త్రిజటా! స్వప్నమున రావణాదు లట్టిదురవస్థలో నుండి రని విను టయే నాకుఁజాల సంతాపకరముగ నున్నదిసుమా!

ఆంజ—(తనలో) సెబాస్! తల్లీ! కృపాస్వరూపురాలవు.

సుగ్రీ—తన్ను బాధించుచున్న పరమచండాలుఁడుఁ జిత్రవధార్హుఁడు నగు రావణుఁడు దురవస్థ నున్నట్లు కలఁగనిన త్రిజట చెప్పినమాటల చేతనే పరితాప మొందుచున్న జానకీదేవి స్వబాధ నెట్లు సహించుచున్నదో?

లక్ష్మ—భూపుత్రికకు సహనశక్తిఁ జెప్పవలయునా?

రాము—ఉత్తమాత్ము లెప్పుడు పరబాధకే కాని స్వబాధకై చింతింపరు.

గీ. ఏకభక్తి యధర్మ్యమ్ము ♦ స్త్రీకిఁగాక
దూరతయుఁ గల్గి దుర్మతి ♦ క్రూరజనుల
యజ్ఞతకు నేడ్చి జ్ఞానవిహీ ♦ నుఁగ యతులు
వసుధఁ దిరుగరె తిర్గు, దె ♦ బ్బలును బడుచు.

ఆంజ—ఇదే నేను సీతాదేవియెదుటఁ బడుటకుఁ దగినసమయము. ఎదుటఁ బడి మాటలాడుట కిదియె యదనుగాని నా వానరరూపమును జూచి యామె భయపడు నేమో? వానరరూపమున మనుష్యవాక్కులతో మాటలాడు నన్నుఁ బ్రచ్ఛన్న రాక్షసుఁడని, హానిచేయుటకు వచ్చినాఁడని, కేకలు వేయు నేమో? కేకలు వేయు నెడలఁ బ్రక్కలనే యున్న యనేక రాక్షసస్త్రీలు నన్నుఁ గాంచి రావణున కీవార్త నివేదింతురు. అంతట నాతఁడు నాతో యుద్ధము చేయుట కనేక రాక్షసవీరులను బంపును. వారితో యుద్ధమొనర్చిన నాయాసమున సముద్రమును దాఁటలేనివాఁడ నగుదును. రామభద్రుఁ డందుచే సీతాకుశలవృత్తాంతముఁ దెలియక మహాందోళనమున నుండును. సీతాదేవి యున్నచోటు వెల్లడియై పోయెనని యామెను మఱియొక్కడనైన దుష్ప్రవేశమైనస్థలమున దాఁచెదరేమో? లేక కోపమున నామెను జంపుదురేమో

ఆమెయే యీ బాధలు పడలేక ప్రాణత్యాగమొనర్చు నేమో? కావున నామె యెదుటఁ బడి యిప్పుడు మాటలాడుట యనర్థకముగఁ దోఁచుచున్నది. జానకీదేవికి రామభద్రునిపై సంతతధ్యానమున్నది. కావున నాతనిగుణకీర్తనమును జేసినయెడల మహాహ్లాదమున వినును. క్రమక్రమముగ నేను రామదూతనే యను విశ్వాసము కలుగును. అటుపైన సమస్తాంశములను నివేదింతును.

సీత—త్రిజటా! రామచంద్రశుభవార్తాశ్రవణమున నీనిముసము సార్థకమైనది.

త్రిజ—కథనమున నాకుఁగూడ మఱెంత—

ఆంజ—అంతకంటె నాకు—

సీ. దశరథుండను ధరాధిపుఁ డుండె నాతఁడు
భార్యాత్రయంబునఁ బడసి విల్లు
పుత్రేష్టి యొనరించి పుత్త్రుల నల్వురఁ
బడసెను వారిలో పలువు జ్యేష్ఠ
సుతుఁడు మంగళగుణ యుతుఁడు శ్రీరాముండు
జనకజఁ బెండ్లాడి సంతసమున
వసియింప నతనికిఁ బట్టాభిషేకంబు
తండ్రి యొసర్పఁగఁ దలఁచునంత
భరతమాత తత్కార్యంబు భంగపఱిచి
రామచంద్రమూర్తిని వన సీమ కనిపె
నతఁడు పదినాలుగేండ్లు కిందఁ బతిని బాసి
యామె తాఁ వెతనొందక విపు లార్తి నొందు.

సీత—ఆ! ఆ! అదేమి? సుధామాధుర్యధురీణము లగు శ్రీరామగాథాక్షరములు వినఁబడుచున్నవి. త్రిజటా! నీకుఁగూడ వినఁబడినవా? (చెట్టుపైకిఁ జూచును.)

త్రిజ — ఆ!

ఆంజ —

గీ. రాము! రఘురాము! జానకీ ♦ రామ! యదివి
రామ! కోదండరామ! శ్రీ ♦ రామ! సద్గు
ణాభిరామ! సీతారామ ♦ యదిగొ! యిచటఁ
గానఁబడియె విచారంబు ♦ మానవయ్య!

సీత — ఆహాహా! నాసమాచారమును రామునకుఁ దెలుపు పుణ్యాత్ముఁ డెవఁడు? "రామరామా!" యని సంబోధించుచున్నాఁడు. ఆతని నేత్రములకు శ్రీరామభద్రుఁడు గానఁబడుచున్నాఁడు గాఁబోలు! ఓహో! పవిత్రజీవుఁడా! ఎక్కడ నున్నావు?

ఆంజ — అమ్మా! వచ్చుచున్నాను. (దిగి) నమస్కారము.

గీ. రామరామ! రాఘవరామ ♦ రామ! రామ
నామపఠనాభిరామ! శ్రీ ♦ రామ రామ!
రామచంద్ర రామా! రఘు ♦ రామ రామ!
రాముఁడున్నాఁడు దుఃఖమా ♦ ర్పఁగను నీకు.

సీత — (తొందరతో) ఆ! ఆ! నామఱఁది సౌమిత్రియో?

ఆంజ — ఉన్నాఁడు.

లక్ష్మ — తల్లీ! నాకై యాందోళనపడుచు నమస్కరించిన యాంజనేయుని దీవించుటయైన మఱచిపోయితివా? రామచంద్రుని కొక్క నిన్నుఁగూర్చిన చింతయేకాని నాకు రామభద్రుని గూర్చియు నిన్నుఁగూర్చియుఁ గూడఁ జింత కలుగుటచే ద్విగుణసంతాపుఁడనై యున్నాను.

సీత — రామభద్రునితోడనే యున్నాఁడుకద!

ఆంజ — అగ్నితో వేఁడిమియుండదా?

సుగ్రీ—(తనలో) మహాపవిత్రతాదిగుణ సమంజసతయు నరదేవ తా ద్యఖిల జీవసౌఖ్యసంధాన దక్షతయుఁ గలవాఁడు శ్రీరామభ ద్రుఁడు. కేవలము త్రైలోక్యప్రధాన స్వభావముగలవాఁడు లక్ష్మణుఁ డు. అందుచేతఁ గాఁబోలు నగ్నికంటె వేఁడిమి యున్న ట్లని యాంజనేయుఁడు చెప్పినాఁడు.

సీత—చల్లనిమాటచెప్పితివి. నీకుశుభ మగుగాక! లక్ష్మణుఁడు క్షేమము గా రామభద్రునితో నున్నాఁడనుట మహానందసంధాయకమ య్యెను. లక్ష్మణుఁడు సర్వసద్గుణ సంపన్నుఁడు. సీతారామ భక్తి తత్పరుఁడు. నేను న్యాయ మనుసరించి యపన్యాయమునుగూర్చి వ చ్చితి నవి శేష మేమున్నది? కట్టుకొన్నదానను గావున నిష్ట ము న్నను లేకున్నను నాకవి తప్పనిసరియే. లక్ష్మణునకు భ్రాతనుసరణ మట్టిదికాదే? లోకోత్కృష్టుఁ డగు లక్ష్మణుఁడే రామభక్తుఁడగుఁ గాక! నన్నుఁ బెండ్లిచేసికొనకున్నను నావంటిభార్య రామభద్రు నకు దొరకును గాని లక్ష్మణునివంటి సోదరుఁడు మాత్రము దొ రకఁడు. అట్టినిర్హేతుకమహోపకారి మఱియొకఁ డుండునా?

రామ—(తనలో) లక్ష్మణుని భ్రాతనుసరణముగూడ నేవలమునిర్హేతు క మైనదికాదు. ఏకజనకాశ్రయ మనునొక్క హేతుచ్ఛాయయై న నున్నది. నీదర్శనమును జేయఁ దలఁచి, మనస్సంతాపమును బా పఁదలఁచి, రాక్షసమహామృత్యుముఖమునఁబడుట కైనజంకక యనే కయోజనవిస్తీర్ణ మగుసముద్రమును లంఘించి నీయెదుట నిప్పు డు రామసంకీర్తనము సేయుచు నిలువఁబడిన వానరవీరునికంటె నిష్కారణమహోపకారి మఱియొకఁ డేఁడీ!

సీత—నీవు వానరుఁడవు కదా! రామనామస్మరణ మెందులకుఁ జేయు చుంటివి?

ఆంజ—రామరామా! నా కేకోర్కెయు లేదు.

సీత—నీవు రామభక్తుఁడ వెటు లయితివి?

ఆంజ—రామభక్తి నాకున్నదో లేదో నేనెఱుఁగఁగాని శ్రీరామభద్రుఁడు నన్నుఁ గింకరుఁడుగ నంగీకరించినాఁడు.

సీత—నిన్నెల స్వదాసుఁడుగ గ్రహించినాఁడు?

ఆంజ—ఎల్లో నాకెల్లు తెలియును? మిమ్ము దాసురాలుగ నెట్లంగీకరించెనో యట్లే యనుకొందును.

సీత—శివధనుర్భంగకృత్యమును జేయుటచే నన్ను సేవకురాలుగ గ్రహించెను.

ఆంజ—వాలిప్రాణభంగకృత్య మనుపూర్వసంభవమాత్రకారణము నాకుఁగూడ నున్నది.

సీత—అయ్యయ్యో! వాలియనువాతఁ డెవఁడు? అతని నేల నాప్రాణనాథుఁడు వధించెను? ఆతఁడు రాక్షసుఁడా?

ఆంజ—అమ్మా! అతఁడు నావంటివాఁడే?

సీత—(తనలో) ఏమిది? "నావంటివాఁడే యతఁ" డనుచున్నాఁడు. రాక్షసహంత యగుశ్రీరామభద్రుఁడు వానరహంత యగునా? ఈతఁడుకూడ రాక్షసుఁడై యుండవలయును. (ప్రకాశముగ) రామదాసుఁడ నని చెప్పితివికదా! రామనామము స్మరించుచుంటివికదా! పాపజీవభూయిష్ఠ మగులంకలో నీవుండ నేల?

ఆంజ—అమ్మా! రామకాంత లగుమీరుమాత్ర మిచ్చట నుండ నేల?

సీత—రావణానీతనై నేనిట్లుంటిని.

ఆంజ—రామదూతనై నేనిట్లుంటిని.

సీత—నీవు రామదాసుఁడవే కాక శ్రీరామచోదితుఁడ వగు రామదూతవు కూడనా?

ఆంజ—అట్టిభాగ్యము రామకటాక్షమున నాకు సిద్ధించెను.

సీత—నీవు యథార్థముగఁ గపివే యగుదువుకద!

ఆంజ—జగత్పావనమూర్తి యనఁనొప్పువాయుమూర్తి పుత్త్రుఁడనై స్వామైకదీక్షాదక్షుఁ డగురామభద్రునిదూతనై భవతారకసాధన మగు రామనామమునుస్మరించు చున్నబ్రహ్మచారిని శంకింపఁదగునా?

సీత—పావనసన్న్యాసివేషమున వచ్చి రావణుఁడు నన్ను హరించినాఁడు. ఆయదటిప్పటికి హృదయమున నుంటచే నటు లంటిని. అన్యథా తలంపకుము.

ఆంజ—నిజమే. ఒకపుణ్యాత్మునిమూలమున నందఱుఁ బుణ్యాత్ము లని యనుకొనుట సిద్ధింపదు. కాని యొకదురాత్మునివలన నంద ఱట్టివారేమో యని సందేహించుట తఱుచు సంభవించును.

సీత—ఆమాట లేల? పోనిమ్ము. రామసందేశమును జెప్పి నీవు, విని నేను సంతోషింతుముకాక!

ఆంజ—త్వద్వియోగమున మహాదుఃఖితుఁ డగుశ్రీరామభద్రుఁడు నీక్షేమసమాచారమును దెలిసికొనిరమ్మని నన్నంపెను. అంతకంటెఁ బరితాప మొందుచున్నలక్ష్మణుఁడు మీకు సాష్టాంగ మొనర్చి మీక్షేమము నడిగెను. రామమూర్తిసఖుఁ డగుసుగ్రీవనామవానరనాథుఁడు భవత్క్షేమవార్తాశ్రవణకుతూహలుఁడై నమస్కారపూర్వకముగ మీక్షేమము నడిగెను.

సీత—కపినాథునితో నానాథున కెట్లు సఖ్యము సంభవించెనో! శ్రీరామసౌమిత్రులస్వరూపలావణ్యాదు లెట్టివో సావకాశముగఁ జెప్పుము.

ఆంజ—

సీ. ఆదిత్యసమతేజుఁ ♦ డబ్ధిగంభీరుండు,
చారుశారదపూర్ణ ♦ చంద్రముఖుఁడు,

వసుధాక్షముఁడు, రూప ♦ వైభవదాక్షిణ్య
సంపన్నుఁ డచ్ఛప్ర ♦ శస్తకీర్తి,
సర్వశిష్టావన ♦ సామర్థ్యసంయుక్తుఁ,
డఖిలదుష్టౌఘసం ♦ హారణచణుఁడు,
ప్రాక్తనాచారప్ర ♦ పాలనలోలుండు,
వర్ణచతుష్టయూ ♦ వనరతుండు
దేశకాలపాత్రజ్ఞుండు, ♦ దేవదేశి
కాభధీభారుఁ డధికశాం ♦ తాత్మకుండు,
సుస్థిరుఁడు, సత్యనిష్ఠుఁడు ♦ సుగుణరత్న
భరసముద్రుఁడు, శ్రీరామ ♦ భద్రుఁ డమ్మ!

సీ. రాజ్యపాలనకళా ♦ ప్రావీణ్యయుక్తుఁడు,
ద్విజదేవపూజావి ♦ ధేయకరుఁడు,
సంగీతసాహితీ ♦ సారగ్రహణశీలుఁ,
డార్తచింతాహర ♦ ణైకరతుఁడు,
వరధనుర్వేదవి ♦ ద్యాచ్ఛిఖామణి, సర్వ
వేదవేదాంగసం ♦ విద్వరుండు,
సకలార్థ్యభీష్టదా ♦ నకలాప్రగల్భుండు,
పరిపూర్ణసత్వసం ♦ పన్నభుజుఁడు,
సకలజీవమనోహర ♦ శస్తమూర్తి,
సంతతాశాంతదంతురా ♦ నంతకీర్తి,
దితిజమారణదారిత ♦ దేవతార్తి,
సత్యసంస్థార్తి, శ్రీరామ ♦ చంద్రమూర్తి.

రాము—(తనలో) ఆంజనేయా! ఇదివఱకే చాలఁ జెప్పితివి! ఇంతటి తోనైన మానివేసి పైకథ నుపన్యసింపరాదా?

సీత—ఇంతటితో నానాథునిగుణాభివర్ణనముమాని వేయకుమా! కపిశేఖరా! ఇంకఁ జెప్పుము. క్షామబాధ నొందువాని కన్నదర్శనమైనట్లున్నది. మూర్ఛనొందినవానికి నూపిరివచ్చుచున్నట్లున్నదే. నాయనా! ఇంకఁ జెప్పుము.

ఆంజ—

సీ. చెదరి చిక్కనసిన ♦ చిన్నారిసిగవాఁడు,
చేరెఁడుకన్నుల ♦ చెలువువాఁడు,
నిండైనబుగ్గల ♦ నిగనిగల్ గలవాఁడు,
మొనదేరుసోగయౌ ♦ ముక్కువాఁడు,
వెడఁదయౌ నుదుట గో ♦ పీచందనమువాఁడు,
ముద్దులొల్కెడు కన్ను ♦ బొమలవాఁడు,
గుంట లట్టిట్లున్న ♦ గుండ్రగడ్డమువాఁడు,
మొగ్గముం కెనవంటి ♦ మోవివాఁడు,
వెడఁదయురమువాఁడు, ♦ పిడికెఁడునడుమువాఁ
డౌనిమిదడుగులెత్తు ♦ నెనయువాఁడు,
నల్లవాఁడు, కరుణ ♦ జల్లు నవ్వులవాఁడు,
పడుచువాఁడు, రామ ♦ భద్రుఁ డమ్మ!

రామ—సుగ్రీవా! కవి యీభాగము విపులముగ వ్రాసినట్లు నీకుఁ దోఁచుట లేదా?

సుగ్రీ—రామభద్రా! వేయినోళ్లున్న శేషమూర్తియే దేవరగుణాభివర్ణనముఁ జేయఁజాలనియప్పుడు చపలబుద్ధి యగుకపి యెట్లొనర్పఁ గలఁడు?

రామ—శ్రావ్యప్రబంధమున స్త్రీపురుషవిశేషదీర్ఘవర్ణనము లుండఁదగునుగాని దృశ్యప్రబంధమున నట్లుంట తగదేమో? పాత్రప్రకృత్యభివర్ణనము, తద్విభజనము, ప్రకృత్యనురూపవాచాసందర్భము

ముఖ్యముగ నాటకమున కుండఁదగిన దని నాయభిప్రాయము.

సీత—రామభక్తాగ్రణీ! ఊరకుంటి వేల?

ఆంజ—(అదరిపడి) అమ్మా! ఏమంటివి?

సీత—సెబాస్! నిజముగ నీవు రామభక్తాగ్రేసరుఁడవే! వర్ణ్యవస్తువు నెదుటఁజూచుటచేఁ దన్మయత్వమున మైమఱచి యున్నావు.

సుగ్రీ—ఆంజనేయా! ధన్యాత్ముఁడవు.

ఆంజ—

ఆ. వె. చూచుకొలఁది మఱియుఁ ♦ జూడంగఁదగువాఁడు
విනఁగఁదగినవాఁడు ♦ వినుకొలఁది
మ్రొక్కుకొల ది యింక ♦ మ్రొక్కంగఁదగువాఁడు
తలఁచుకొలఁదిఁ దలఁపఁ ♦ దగినవాఁడు.

గీ. నిష్ఠురసమాధినిష్ఠాగ ♦ రిష్ఠులగుచుఁ
జక్కలముల్గట్టు లష్టిపం ♦ జరము లగుచు
స్త్రీపురుషభేద మెఱుఁగని ♦ ఋషులునైనఁ
జొక్కి కౌఁగిలింపం దగు ♦ సొగసువాఁడు.

సీత—రామభద్రునిముఖ్యగుణ మగునేకపత్నీవ్రతమును జెప్ప లేదేమి?

ఆంజ—చెప్పవలసినదే—కాని—సర్వజీవుల కాతఁడే భర్త యగుచుండ నవ్వా
 ట్లెట్లు చెప్పఁగలుగుదును.

సీత—రామవార్తను నాకుఁ జెప్పవచ్చి రామభద్రునే నాయెదుటఁ బె ట్టితివి. ఇఁకఁజాలు. (తనలో) ఋషు లైననేమి నాకౌఁగిలికేయ గ్గఁ దగునానాథునిఁ గౌఁగిలింపనెంతు రని వినుటనాకు సంభ్ర మము గలుగఁ జేయదా? అందులకు నే నీజన్మమున నంగీక రింతునా?

ఆంజ—అమ్మా! చాలు నని వేఱె చెప్పనక్కఱ లేదు.

ఆ. వె. అనుభవించి తెలియ ♦ నగ్గుఁడౌ శ్రీజ్ఞాన
లలితమూర్తిఁ దెలియఁ ♦ బలుకు టెట్లు?
పరమయోగవిదిత ♦ పరతత్త్వవిభవము
పొడిపొడినుడువులను ♦ బోధ మగునె?

సీత—(తనలో) హా! నాథా! అట్టిమహానుభవమునకు నే దూరను నైతినిగదా! ఇంక నెప్పుడు కటాక్షించిరక్షింతువోయి ప్రాణనాథా! (ఏడ్చును.)

లక్ష్మ—(తనలో) ఇఁక నన్నుఁగూర్చి యాంజనేయుఁడు వచించును గాఁబోలు! ఏమిచెప్పునో యని మన సలజడి నొందుచున్నది.

ఆంజ—అమ్మా! లక్ష్మణమూర్తినిగూర్చి యింకఁ జెప్పనా?

సీత—పరమసంతోషముగ విందును.

సుగ్రీ—(అపవారించి) సౌమిత్రీ! ఇఁకఁ గవివిసరులను గాచితో! ఎవనిగుణానుసంధానమును వానియెదుటనే చేయుచున్న యీనాటకము చిత్రముగనే యున్నది సుమా!

ఆంజ—

గీ. తండ్రి రాముఁడు జానకి ♦ తల్లి యనుచుఁ
గరణశుద్ధిగ నమ్మికిం ♦ కరుఁ డతండు;
రాముఁడే సర్వ మతనికి ♦ రాముకంటె
నన్య మెఱుఁగనియట్టిమ ♦ హాత్ముఁ డమ్మ!

సీత—అట్టిమహాత్ముని నే నెన్నఁడు చూతునో?

లక్ష్మ—(తనలో) ఇంతవఱకు సరిగనే చెప్పినాఁడు.

ఆంజ—

గీ. స్వచ్ఛతనుధారి; శ్రీరామ ♦ చంద్రుకంటెఁ
గుఱుచవాఁడు; ధనుష్కళా ♦ కోవిదుండు;

కలకకుపదనుగల్గినవాఁడు; ♦ చులుకుమాటు
వాఁడు; శీఘ్రకోపముగల్గు ♦ వాఁడు; తల్లి!

సుగ్రీ—అదినాకనుభవమే—

లక్ష్మ—సుగుణము లన్ని కోపముతోఁ గూలిపోయినవి.

అంజ—

గీ. ప్రబలవీరోద్ధతుఁడునైన ♦ రామభద్రుఁ
గనినతోడనే మ్రొక్కంగ ♦ మనసుపుట్టుఁ
గాని శాంతుఁడైనను వీనిఁ♦ గనినతోడ
నొక్క చేయి చూడఁగ బుద్ధి ♦ యుదయ మగును.

సీత—ఆంజనేయా! నీవాక్యములను సౌమిత్రియే వినుట సిద్ధించినచో సిగ్గుపడునని నాకు విచారముగ నున్నదిసుమా!

లక్ష్మ—(తనలో) వినుట యైనది. తలవంచుకొనుట యైనది. నేను శాశ్వతముగ నుండను. కవి శాశ్వతముగ నుండఁడు. కాని యీ మాటలు ప్రళయమువఱకు నిలిచియుండును. (ప్రకాశముగ) తల్లీ! జానకీ! సుగ్రీవునిగుణరూపాదుల నేల వర్ణింపుమని కోర్కనైతివి. (అపవారించి) (సర్వ్వచు) సుగ్రీవా! నీవు మిగిలితివి! నేనే యీనాటకము నొనరించినచో,

గీ. రామసఖుఁడు, శూరుఁడు, కపి ♦ రాజు కాని
పానపాత్రమొ, లేక స్త్రీ ♦ పాత్రమైన
గాంచు వెంటనె తోఁక జా ♦ డించి తనదు
వెనుకమాటల దిగదుడ్పు ♦ వెట్టు నమ్మ!

అని జానకీదేవితో నిన్నుఁగూర్చి నివేదింతును.

సుగ్రీ—(అపవారించి) కాని యీమాటలను బాగుగా జ్ఞప్తి యుంచుకొనుము. కానినీకీపదునాలుగేండ్ల బ్రహ్మచర్యపరిసమాప్తిని నీవయోధ్యకుఁ బోయినపిమ్మట నేను రాకుందునా? నీయింద్రి

యనిగ్రహ మెట్టిదో కనిపెట్టకుందునా? సుగ్రీవరాజు వచ్చియున్నాఁ డని నీకు వార్త నంప మాకిప్పుడు రాణులతోఁ బనే కాని రాజులతోఁ బని లేదని నీ వనకుందువా? చూచెదను.

ఆంజ—అమ్మా! అట్టి రామలక్ష్మణు లిర్వురు మహాశోకార్ణవమునఁ జేబారలు వైచుకొనుచు సుగ్రీవనివాస మగుఋశ్యమూకప్రాంతమును జేరిరి.

సీత—రామదూతా! నీ వెప్పుడైన జటాయువును జూచితివా?

ఆంజ—రామభద్రునివలన వింటిని.

సీత—ఏమని?

ఆంజ—నిన్ను రావణుఁడు హరించుకొనిపోవుచున్నాఁ డని యాతనివలననే తమకుఁ దెలిసెనని—

సీత—ఆలాగా! అప్పుడే ప్రాణములు పోయె ననుకొంటిని. రామభద్రుఁడు వచ్చుదనుక నావార్త నాతనిచెవిని వైచుటకు యోగబలముచేఁ బ్రాణము లదికట్టుకొనెను గాఁబోలు! ఆహా! మహాత్మా! జటాయూ! నీవు నాకెంతమహోపకార మొనర్చితివి! ప్రాణావసానసమయమున శ్రీరామభద్రదర్శనము నీకయ్యెనా?

ఆంజ—ఆతఁ డుత్తమజీవుఁడు. రామభద్రునిదర్శనమే కాదు. రామభద్రునిచే నాతనికి బ్రహ్మమేధసంస్కారముకూడ నయ్యెను.

సీత—నాయనా! ఎంతశుభవార్తఁ జెప్పితివి! ఎట్టిదుర్లభ మైనయుత్తరగతి యాతనికి సంప్రాప్త మైనది! ఆతనిని గుక్కలో నక్కలో స్పృశించు నని నే నేడ్చినయేడు పేమని చెప్పఁగలను?

ఆంజ—పరోపకారపరాయణుల కష్టాల జరుగును? తరువాత వారిద్దరు ఋశ్యమూకపర్వతప్రాంతదేశమునకు రాఁబోవఁగ సుగ్రీవుఁడు నతనిసేవించియున్న మఱినలుగుఱము వారిని జూచితిమి.

సీత—నీకు సుగ్రీవున కెట్టిసంబంధము?

ఆంజ—నే నాతనిమంత్రిని. ధనుఃపాణులైన యీమహావీరులను సుగ్రీవుఁడు కాంచి భయపడి నన్ను వారియొద్దకుఁ దదాగమనకారణగ్రహణార్థమై పంపెను. నేనును వారిని జేరి నమస్కరించి వారిని స్కంధములపై నెక్కించుకొని సుగ్రీవసాన్నిధ్యమును జేరితిని.

సీత—సెబాస్! రామదూతా! భూభారనిర్వహణబలాఢ్యు లగుమహావీరుల నవలీలగ వహించితివి!

ఆంజ—అంత సుగ్రీవుఁడు రామభద్రునకు నమస్కరించి యాతని దుఃఖము నివేదించుకొనెను.

సీత—పాపము! ఆతనికిఁగూడ మావలెనే దుఃఖమా?

ఆంజ—తనయన్న యగువాలి తనభార్యయగు రుమను బలాత్కరించి—

సీత—ఆ! దుర్మార్గుఁడు! కపిరూపరాక్షసుఁడు!

ఆంజ—అంతఃపురమునఁ బెట్టుకొని తన్ను రాజ్యమునుండి బహిష్కృతునిఁ జేసి—

సీత—అయ్యో! సుగ్రీవా! నానాథునికి వచ్చినట్టియాపద లేనీకును వచ్చినవా?

ఆంజ—తన్నుఁ బెట్టుచున్నమహాకష్టము లాదయామయునకు నివేదించెను. అంతట రామభద్రమహావీరుఁడు వాలివధము సేసెద నని ప్రతిజ్ఞఁ జేసెను.

సీత—సంతోషమే.

ఆంజ—అంతట లక్ష్మణుఁడు రావణునిచే మిమ్ముఁ గోలుపోయినవృత్తాంతమును రామసంజ్ఞ ననుసరించి చెప్పెను.

సీత—సరి. అరణ్యవాసము చేయుటంటచే రాజ్యభ్రష్టత చెప్ప నగత్యము లేకపోయెను గాఁబోలు!

ఆంజ—అదికూడఁ జెప్పఁబడినది. రావణుఁడు మిమ్ము హరించుకొనిపోవు చుండఁగ మీరు క్రిందఁ బడవైచిననగలమూట మా కడవులకు దొరకెనుగాన నది రామభద్ర సాన్నిధ్యమున నుంచితిమి.

సీత—రామా! రఘువీరా! రాజీవలోచనా! నన్నుఁ గాంచకపోయిన నానగలనైనఁ జూచితివా?

ఆంజ—అంతట రామభద్రుఁడు వానిని జూచి పొందినదుఃఖమును—

సీత—నాయనా! చాలు! ఇఁకఁ జెప్పకుము. ఆమహానుభావుఁడు విలపించె ననుమాట నేను వినలేను. నాథా! నాథా! (ఏడ్చును)

ఆంజ—అమ్మా! మీరెట్లు వినలేరో నేనట్లు చెప్పను గూడ లేను. తరువాత నాభరణములు సుగ్రీవునియొద్ద దాఁచనిచ్చిరి. అగ్నిసాక్షికముగ రామభద్రుఁ డాతనితో సఖ్యమును గావించెను. సీతాన్వేషణ మొనర్చి రావణవధకార్యమునఁ గపిసేనతో సాహాయ్య మొనర్పఁగల నని సుగ్రీవుఁడు సమయమునుగావించెను.

సుగ్రీ—(తనలో) నాయుపేక్షసంగతి అమ్మవారితోఁ జెప్పఁడుసుమా?

ఆంజ—తరువాత రామభద్రుఁడు వాలినివధించి సుగ్రీవునకుఁ గిష్కింధరాజ్యమునకుఁ బట్టాభిషేకము చేసెను.

సీత—సఖునిభార్యను హరించినవానినే చంపినమహావీరుఁడు స్వభార్యాపహర్త యగు రావణు నేల వధింపకుండును?

ఆంజ—అటుపైని సుగ్రీవుఁడు వానరవీరుల నందఱ రావించినలుదిక్కులకు భవదన్వేషణమునకై పంపెను.

లక్ష్మ—(తనలో) ఆంజనేయా! పక్షపాతబుద్ధి గలవాఁడవు. నేనుకోపస్వభావుఁడ నని జానకీదేవితోఁ జెప్పితివిగదా? సుగ్రీవుఁడుమధుపానాధరమధుపానలోలుఁ డని యేల చెప్పవైతివి? అటుపైని సుగ్రీవుఁడు వానరవీరులరావించుట కనిమాత్రమే చెప్పితివా? అటు

పైని యనఁగనేమి? ఎట్లుపైని? రౌద్రమూర్తియై ధనుష్టంకారము సేయుచుఁ జంపుదునని మీఁదఁబడుటకు సిద్ధమైనప్పుడుకాదా?

ఆంజ—వాలికుమారుఁ డగునంగదుఁడును, మేముకొందఱము భవదన్వేషణార్థమై దక్షిణదిక్కునకు వచ్చుచు సంపాతి యనుజటాయు భ్రాతవలన మీరు రావణాలయ మగులంకలో నున్నట్లు తెలిసి.—

సీత—జటాయువు రామున కట్లుపకార మొనర్చినాఁడు. ఆతనిసోదరుఁ డిట్లుపకార మొనర్చినాఁడు. మహాత్మా! నీ విట్లాతని కుపకారము సేయుచుంటివా?

ఆంజ—ఇది కైంకర్యము కాని యుపకారము కాదు. చేయించుకొను వారిమాహాత్మ్యమున జరుగుచున్నపనులు కాని చేసెడువారిశక్తి వలన జరుగుచున్నవి కావు.

సీత—ఆహా! పక్షులు మృగములుకూడ సీబాధ సహింపలేకున్నవి కదా; నే నెట్లు సహింతు ననుకొంటివి? మహాప్రభూ!

ఆంజ—అమ్మా! విచారింపవలదు. సంపాతివచనముల ననుసరించి దక్షిణసముద్రతీరమును జేరితిని. అంత సముద్రమును దాఁటుటకు నేఁ బూనుకొంటిని. రామకటాక్షమున దాఁటితిని. రావణుని యంతఃపుర మెల్ల వెదకి చూచితిని. నిన్నుఁ గానలేక మిక్కిలి దుఃఖించితిని. నాపుణ్యవశమున నిన్నిచ్చటఁ గంటిని. మహారాజకాంతవైన నీయొద్దకు రామభద్రుఁడు సుగ్రీవమంత్రినైన నన్ను దూతగఁ బంపునంతటిసఖ్యము రామసుగ్రీవుల కయ్యెను.

సీత—అట్లయిన సుగ్రీవసాహాయ్యమున రామభద్రుఁ డిటకు వచ్చునని నేను నిశ్చయముగ నమ్మియుండఁదగినదే కాదా?

ఆంజ—అవశ్యము!—కాని ముందిది చెప్పుము. నేను రామదూత ననునమ్మకము నీ కిప్పుడైన బాగుగఁ గలిగినట్లేకద!

సీత—ఆ! బాగుగనే కలిగినది.

ఆంజ—అంతకంటె బాగుగఁ గలుగనై యున్నది. దీనిని గటాక్షింపుము.

(రాముముద్రికనిచ్చును.)

సీత—ఆ! ఆ! నానాథునిముద్దుటుంగరమే! రామదూతా! ఇది యా తఁ డభిజ్ఞానార్థ మిచ్చెనా? హా! రామభద్రా! నీయుంగరమును జూడ నిన్నుఁ జూచినట్లు యున్నది. హా! కైకేయీ! కైకేయీ! ఆరణ్యవాసారంభమున రామభద్రునియాభరణము లన్నియు నీవు దగ్గఱనుండి యొలిపించునపు డీయుంగరమునుగూడఁ దీయఁ జాలనిది మామగారిచే నీయఁబడినది. దీనిపై మీ కధికారములే,, దని పుణ్యాత్ముఁడైనవసిష్ఠుఁడు నిన్ను నిరోధించుటచే నీమాత్రమైనఁబచ్చనిపోఁచ దక్కెనను నానాథునిచేత నుండుట సిద్ధించెను. హా! తండ్రీ! జనకచక్రవర్తీ! నీవు నాపెండ్లివేళ నీయల్లున కిచ్చినయుంగర మిదిగో తండ్రీ! దీనిని జూచితివా? నాదురవస్థఁ జూడవా? నీయల్లునియభాగ్యత్వమును జూచితివా? ఓతండ్రీ! ఈ యుంగరముచేతనే నన్ను నానాథుని గలిపితివి. నాయనా! తిరిగి యీయుంగరమును నీవు తీసికొని నానాథునితో నన్నుఁ గూర్చవా? అయ్యో! ఏమి ప్రేలుచున్నాను! నాతండ్రి యిచ్చు టనేఁడీ? ఓయుంగరమా! నానాథుని కనిష్ఠాంగుళిని వదలక గట్టిగఁ బట్టుకొంటివికదా! నేనుఁగూడ నీవలెనే యామహాత్ముని దేహమును బిగ్గఁ గౌఁగిలించి గట్టిగ నాశ్రయించినదాననేకదా! కాని మాయలేడిని దెమ్మని నానాథుని నానుండి వేఱుచేసిన మహాపాతకముచే నే నిట్లు రామవిశ్లేష మొందితిని గాని నీకిట్టి నిర్భాగ్యత్వమేల కలిగెను? (ఏడ్చును)

ఆంజ—అమ్మా! ఊఱడిల్లుము.

రామ—(తనలో) హా! జానకీపాత్రమా! నీవే నాకనుపు దహించుకొని పోవున క్లేశ్చుచుంటివా? హా? జానకీ! ఎప్పుడు నన్నెడఁబాసి యుండవుకదా! హా! జానకీ! నేనెట్టిదుఃఖమునైన సహింపఁగలను గాని నీదుఃఖచ్ఛాయనైనఁ గానలేను కదా! హా! జానకీ! నా యర్ధశరీరిణి వగుచు నెంతదూరమున నుంటివి.

గీ. బిగువుఁగౌఁగిట నున్నను ♦ వేలుపిండ్లఁ
దలల నుంచుచు నిద్రింపఁ ♦ దగ దటంచు
నెక్కుదానిపైఁ దల లూన్చి ♦ చొక్కుమనము
యోజనశతాంతరములోన ♦ నుండవలసె.

సీత—అత్తా! కౌసల్యామహాదేవీ! „అడవిలో నుండువిచిత్రవస్తువుల నవియివి తెమ్మని నీపతినినిర్బంధింపకుమా„ అని నాకు బుద్ధి చెప్పనే చెప్పితివి! హా! లక్ష్మణా! ఎంత బుద్ధిమంతుఁడవు! మాయలేడిని గోరవల దని నీ వెన్నివిధముల నాకు బోధించితివి! హా! నాథా! నేను నిర్బంధించినప్పటికి నీవు నన్నుఁ జీవాటులు పెట్టి యూరకుండు మనిన సుఖముగ నీపజ్జను శాశ్వతముగఁ బడి యుందునే!

రామ—(తనలో) రఘువంశమునఁ బుట్టినరాజులకుఁ దఱుచుగ భార్యావిధేయతాగుణ మాభరణముగనో మచ్చగనో యుండ నది నాకిట్లు తప్పినదికాదు. అయినను భవిష్యత్కర్మ ననుసరించి బుద్ధి నడుచునుగదా!

ఆంజ—అమ్మా! ఊఱడిల్లుము. „నాథా! నీపజ్జను సుఖముగ శాశ్వతముగఁ బడియుందునే„ యని నీవిప్పుడు విలపించినావు. ఒక్కయఱగడియలో నిన్ను నీనాథునితోఁ గూర్చెదను. కటాక్షింపుము.

గీ. ఇంద్రియబలాత్కృతుండగు ♦ నిద్ధచేత
నని గురుండు దివ్యబోధన ♦ మునను బరవు
దైవభక్తి కల్పించిన ♦ దారి రాను
సహృత వగునిన్ను రాముని ♦ సరసఁ జేస్తు.

సీత—ఎట్లు?

ఆంజ—నిన్ను నావీఁపుపై నెక్కించుకొని సముద్రలంఘన మొనర్చి రామభద్రునొద్ద కాతనికటాక్షమునఁ దీసికొనిపోఁగలను.

సీత—నాయనా! నీకు నాయందుఁ గలమహానురాగమునకు సంతసించితిని. కాని కపివగుటచే నట్లు పలికితివి!

ఆంజ—(తనలో) అత్యాదరమున నాలోచింపక యనినమాటకుఁ దగిన ప్రాయశ్చిత్త మైనది.

సీతా—నాయనా! నీయాలోచనము నా కుపపన్నముగ నున్నట్లు లేదు. అందుచే దానిని నేను నిరాకరింపవలసివచ్చినందుల కన్యథా తలంపకుము. రావణాసురస్థానమున నుండునన్ను నీ వాతనికిఁ దెలియకుండఁ దీసికొనిపోవుటలోను రామాధీనమైయున్ననన్ను రావణుఁడు నానాథుఁడు లేనివేళఁ దీసికొనివచ్చుటలోను భేద మేమంత యున్నది. అపరాధి యగురావణుని జంపి నన్ను గ్రహించుటలో శ్రీరామపౌరుషము వెల్లడి యగును గాని చోరకృత్యముగ నన్నుఁ గైకొనుటచే నామహావీరునకు భీరుత్వము లోక మాపాదింపదా? రామునకుఁ గావలసినది సీతయా? ఖ్యాతియా?

ఆంజ—ఎవనిసొమ్మును వాఁడు గ్రహించినఁ జోరత్వ మగునా? మిమ్ము గ్రహించినపిమ్మటమాత్ర మపరాధి యగురావణుని జాపఁగూడదా? ముందుగఁ జంపియే గ్రహింపవలయునన్నమాట యేమి?

వాఁ డింక బ్రదికియుండఁగనే వానికన్నులయెదుటనే మిమ్ముఁ గైకొన్నచో మఱింతఖ్యాతి యుండదా? అదిగాక, మిమ్ముహరించుటకుఁ బదితల లిరువదిభుజములుం గల్గి మహాబలి యని ఖ్యాతినొందినరావణుఁడు లంకనుండి జనస్థానమునకుఁ దానే రావలసివచ్చెను గాని రామభద్రుఁడు తానున్న చోటనే యుండి నీచుఁడగు నొకకపిని బంపి మిమ్ము గ్రహించినాఁ డని లోకులు వేనోళ్ల రాముని గొనియాడరా?

**సీత**—పోనీ! నీవు నన్ను మూఁపుపై నెక్కించుకొని సముద్రము దాఁటునపుడు తజ్జవాటోపమున నేను గ్రిందఁ బడిపోవుదు నేమో? అదిగాక నీకార్యమును దెలిసి యనేకరాక్షసవీరులు నిన్నుఁ జుట్టుముట్టి వధింప యత్నింప వారితో నీవుయుద్ధ మొనర్చుమహాసంరంభమున నుండ నేమాయరక్కసియైనఁ దిరుగ నన్ను గ్రహించు నేమో? నీవు నన్నే కాపాడుచుందువా, యుద్ధవిజయమునే చూచుకొనుచుందువా? రాక్షసులు నీకై యుద్దేశించిన దెబ్బలు కొన్ని నాకుఁ దగిలిన ప్రమాదము కాదా? నీవు యుద్ధమున నోడిపోవ నాఁడని యూహైనేమి కావలసినదఁ? నన్ను వారు వధింతు రేమో? లేక యత్యంతదుర్గమస్థలమున దాఁచి బంధింతు రేమో? అప్పుడు రావణవధ మెట్లు? రావణవధ మైనను సీతాగ్రహణ మెట్లు?

**ఆంజ**—స్త్రీస్వభావ మగుభయముచే మీ కిట్లు తోఁచుచున్నది కాని రాక్షసులు నన్ను జయింపలేరు.

**సీత**—అదేమి? యుద్ధములో జయాపజయముల ముందుగ నెట్లు నిర్ధారణపఱుపఁగలము?

**ఆంజ**—అట్టి సందేహమువలదు. జగన్నాథుఁ డగు శ్రీరామమూర్తిని హృదయమందుంచుకొని జగన్మాత యగు సీతాదేవిని శిరమునం

దుంచుకొని నేను బోరాడ నాకపజయమా? అదిస్వప్నవార్త; రామభక్తి నాకు నిలుచునంతకాలమును నాకుఁ బరాజయము లేదు. అట్టిభక్తితో నామహాత్మునకు మిమ్మర్పింపఁ దీసికొని పోవుచుండఁగ నన్ను జూచి జరిగింపవలసినదే కాని అందునుగూర్చి యింకసందేహమా?

రామ—(తనలో) సెబాస్! మారుతీ! పరమార్థముగ వచించితివి.

గీ. రోగి విశ్వాసమున నగ్గ ♦ రోగుఁడగును
సుతు విశ్వాసమునఁ గళా ♦ స్ఫురణుఁ డగును
దుఃఖి విశ్వాసమున దుఃఖ ♦ దూరుఁ డగును
భక్తుఁ ముక్తి నొందు వి ♦ శ్వాసమునను.

గీ. శంక యాత్మశక్తుల ధ్వం ♦ సంబుఁ జేయుఁ
బ్రబలతమమౌను విశ్వాస ♦ మెందు నాత్మ;
యఖిలము నసాధ్యమగు నాశ ♦ యాత్మ; కన్ని
సులభసాధ్యముల్ విశ్వాస ♦ కలితునకును.

గీ. పూర్ణమగు నాత్మ లౌకిక స్ఫూర్తి మాయుఁ
బరమహాత్మతత్త్వగతిని ది ♦ వ్యముగ వెలయు;
నంకెలందునఁ బడి వ్రేటి ♦ దయ్యె సున్న;
యంకమం బయ్యె నట్టి వ ♦ ర్ణాంకిఁ బడుచు.

సీత—పరపురుషుని స్పృశించుదానను గాను.

ఆంజ—అట్లుంటిరి. ఇంక నే నిందునుగూర్చి మాటాడవలసినవాఁడను గాను. ఇట్టిసందేహమే తీఱ నోరు జాఱినపిమ్మట నాకు యోజనలోనికి వచ్చినది.

సీత—నోరు, జాఱిన దనుకొనుటకు, నీవు తప్పుమాట నాడితివా? నీయాలోచనము మన్నింపదే దని నీ వన్యథా తలంపవలదు.

ఆంజ—అమ్మా! నాకట్టి చింత యేల యుండును? నాయాలోచనము మీరు మన్నించినను రామభద్రునకు మీకు సమావేశ మగు నే ఫలము. నిరాకరించిననదియే ఫలము. ఇఁక నాకేమి? ఎట్లయిన మహాసంతోషము.

సీత—నాకు రావణుఁ డిచ్చిన యవధి రెండుమాసములుమాత్రమేయున్నది. ఈలోపుగనే—

ఆంజ—అవియన్నియు నాకుఁ దెలియును.

సీత—ఎట్లు?

ఆంజ—మీకు రావణునకు జరిగిన సంభాషణమును చెట్టుచాటుననుండి వింటిని.

సీత—అట్లయిన నేను ధైర్యమున నుండవలసిన దేకదా!

ఆంజ—సందేహమేమి? ఇంక నేను సెలవుదీసికొందును. మీభర్తకు మీరేమైన నానవాలిచ్చెదరా?

సీత—తొందరలో నప్పు డూడఁదీయుటకు రానియీశిరోభూషణ మున్నది. దీనినిదీసికొనిపొమ్ము. రామభద్రునకు దూరముననుండి నమస్కరించితి నని చెప్పుము. లక్ష్మణుని ననురాగపూర్వముగ నడిగితి నని చెప్పుము. సుగ్రీవుని కుశలమడిగితినని చెప్పుము (శిరోభూషణమిచ్చును.)

ఆంజ—(కనుల కద్దుకొని)అమ్మా! పోయెదను.

సీత—రామభద్రుఁడు శీఘ్రముగ వచ్చునుగదా! రావణవధ మగునుగదా!

ఆంజ—అతిశీఘ్రముగ—

సీత—ఇప్పుడే పోయెదవా?

ఆంజ—కొంతసే పింక లంకలో నుందును.

సీత—ఏల?

ఆంజ—ఆరామములపైఁగాని యాలయములపైఁగాని కపి ప్రవేశించునప్పుడెవ్వఁడైననుఁగొంత నాశనము జరుగకపోవుట స్వభావవిరోధముకా
దు.—అమ్మా! నమస్కారము. (పోవును)

త్రిజ—అమ్మా! అటుచూడుము. ఆంజనేయుఁడు వన మెట్లు ధ్వంసముచే
యుచున్నాఁడో? అయ్యయ్యో! కొందఱు రాక్షసులు వచ్చి
యాతనిని జుట్టుకొనినారు.

సీత—ఆ! ఆ!

త్రిజ—అందఱి నిట్టె చంపినాఁడు. ఆహా! అటుచూడుము. రావణప్రథ
మపుత్రుఁడగు నక్షుఁడు యుద్ధమునకు సంరంభమున వచ్చినాఁడు
(నేపథ్యమున) జయ! రామభద్రా! జయ! రామచంద్రా!
ఊఁ. ఊఁ.

సీత—అదుగో! ఆంజనేయుఁ డారాక్షసుని జంపినాఁడు.
(నేపథ్యమున) జయ రామభద్రా! జయ రామానుజా! జయ
రామచంద్రప్రపాలితసుగ్రీవా! జయ! జయ!

సుగ్రీ—ఆంజనేయుఁ డట్లు మహాసమరసంరంభమునఁ దిరుగుచున్నాఁడు
కాఁబోలు!

త్రిజ—అమ్మయ్యో! మహామాయావి యగు నింద్రజిత్తు వచ్చినాఁడు.
(నేపథ్యమున) జయ రాక్షసేశ్వరా! జయ దశకంధరా!

సీత—అదేమి? అదేమి?

త్రిజ—అయ్యో! ఆంజనేయుఁ డింద్రజిత్తునకుఁ జిక్కినాఁడు.

సీత—అయ్యో! అయ్యో! ఇఁక నేమున్నది? (తొందరపడును.)

లక్ష్మ—ఏఁడీ? ఇంద్రజిత్తు! రే! దురాత్ముఁడా! నీచావు నాచేతిలో ను
న్నదిరా!

సుగ్రీ—ఆంజనేయునకు బ్రహ్మాస్త్రమునమాత్రమే ముహూర్తమేమేమి... బద్ధుఁడ
గునని శాపమున్నది. అందుచే నిట్లు జరిగెను.

రాము—ఈమాత్రముననే వృథగ మహాస్త్రము నింద్రజిత్తు వ్యయము చేసికొనినాఁడా?

త్రిజ—రావణునిసభలోని కాంజనేయుని రాక్షసులు తీసికొనివెళ్లినారు.

సీత—అయ్యో! అక్కడనాతని నేమిచేయుదురో?

సుగ్రీ—సీతాదేవివద్ద సెలవుతీసికొనినవెంటనే సముద్రలంఘన మొనర్చి రాక యాతఁడీవననాశనమును రాక్షసవధము నేల సేయవలయునో?

త్రిజ—అయ్యయ్యో! ఆంజనేయుఁడు కాలిపోవుచున్నాఁడు.

సీత—అమ్మయ్యో! ఏఁడీ! ఏఁడీ!

త్రిజ—తోఁకకుఁ జైలసిక్తవస్త్రములఁ జుట్టి రాక్షసులు నిప్పంటించినారు.

సీత—ఓవైశ్వానరమూర్తి! రామదూత నైనయాతని దహింపకుము.

త్రిజ—అయ్యయ్యో! ఇంక మండిపోవుచున్నాఁడు.

సీత—నేను శ్రీరామచరణభక్తి కలదాన నేని, పాతివ్రత్యమున్నదానే నేని, భాగ్యశేషమున్నదాన నేని, రాక్షసవధ మొనర్తునని శ్రీరామభద్రుఁడు చేసినప్రతిజ్ఞ సత్య మగు నేని, యోయగ్నిదేవుఁడా! ఆంజనేయుని యొడలిఁ జల్లఁ బఱుపుము.

(నేపథ్యమున) జయ రామభద్రా! జయరామచంద్రా! జయరఘువీరా!

త్రిజ—ఆతనికగ్నిబాధ యున్నట్లు కనఁబడదు. మహానందమున నెగురుచు నన్నిగృహముల దహించుచున్నాఁడు.

సీత—అయ్యో! పాపము! స్త్రీబాలవృద్ధు లగురాక్షసు లీగృహదాహమువలన నెంతక్షోభ మొందుదురో?

త్రిజ—లంకాపట్టణమంతయు నొక్కటే మంట!

(నేపథ్యమున) జయ రఘువీరా! జయరణధీరా!

అదుగో! ఆంజనేయుఁడు రక్తవస్త్రధారియై యిచ్చటకు వచ్చుచున్నాఁడు.

ఆంజ—(ప్రవేశించిగంతులువైచుచు)

రామ రామ రామా! సీతా! ♦ రామా! రామా! రామా!
రామ రామ రామా! సీతా! ♦ రామా! రామా! రామా!

1 రామ! రామ! నీసతిమణి గన్నులు ♦ రంజిలఁగనఁబడె రామా!
రామ! రామ! నీముద్రిక సీతా ♦ రామునకొసఁబడె రామా!. రామ రామ.
2 రావణసుతుఁ డగునక్షకుమారుఁడు ♦ రణమునఁ గూలెనురామా!
రావణసేనను మూఁడవభాగము ♦ రహిఁ గడతేఱెను రామా!. రామ.
3 వనము లన్నియును క్షణములోపలను ♦ భగ్నముగాఁబడెరామా!
కనదురుసంపద్ఘనలంకాపురి ♦ గాల్చఁగఁబడె రామా!. రామ రామ.

సీత—ఆహా! రామదూతా! ఎంతవాఁడవు! ఇన్ని కార్యములొనర్చియు నహంభావము నొందకుంటివి. ఇందఱనుజంపినయాయాయాసముచే సముద్రలంఘన మిప్పుడు చేయఁగలవా?

ఆంజ—అందుకొఱకే రామనామమును స్మరించుచుఁ దాండవించుచున్నాను. ఈయుత్సాహమునఁ గాని యబ్ధిని దాఁటలేను.

త్రిజ—అమ్మా! ఈతఁడెట్లులంఘించునో యాచిన్నకొండనెక్కి మనముచూతము రమ్ము.

సీత—త్రిజటా! అలాగే చేయవచ్చును.

ఆంజ—అమ్మా! నమస్కారము.

సీత—నీకు శుభ మగుఁగాక!

త్రిజ—అమ్మా! త్వరగ రమ్ము. పోవుదము. (సీతాత్రిజటలు నిష్క్రమింతురు)

ఆంజ—రామరామరామా! (గంతులువైచుచు నిష్క్రమింపయత్నించుచున్నాఁడు.)

రాము—(తొందరతో) అంజనేయా! ఆగుము! ఆగుము! నాటకపాత్రము లకు నిష్క్రమణ మగుఁగాని పరమార్థముగ నాంజనేయుఁడ వగునీకు నిష్క్రమణమేల? రమ్ము. నాకౌఁగిటికి శీఘ్రముగ జేరుము.

ఆంజ—రామభద్రా! ఇఁకనాటకమున సముద్రమును దాఁటునవశేష మున్నది.

రాము—(నవ్వుచు) దుర్లంఘ్య మగుసంసారసముద్రమును దాఁటింపనీకు నాటకసముద్రములు ప్రత్యక్షసముద్రము లేమిలెక్క? ఏది! ఏది! (తొందరగ రంగమునకుఁ బోయి యాంజనేయుని కౌఁగిలించుకొనును.)

ఆంజ—మహానుభావా! కృతార్థుఁడ నైతిని.

రాము—నే ననఁదగినమాట నీ వనుచుంటివి.

సుగ్రీ—ఆంజనేయా! మంచినాటకమునే చేసితివి. దీనికేఁ బేరేమి యుంచితివి.

ఆంజ—రామసౌందర్యవర్ణనమే ప్రధానముగాఁగలదీనికి సుందరనాటక మనిపేరు.

రాము—నాటకము సుందరముగానుండుటచే నట్టిపేరు సార్థకమైనది.

సుగ్రీ—అయ్యా! రామభద్రా! సర్వవానరసైన్యము సిద్ధముగనున్నది. దండయాత్రకిప్పుడే పోవుదము.

(నేపథ్యమున) జయ రామభద్రా! జయరఘువీరా!

రాము—ఉపశ్రుతికూడ మిగుల బాగుగనున్నది. కపివీరు లుత్సాహమునఁ గేకలు వైచుచున్నారు.

రాము——ఇప్పుడిచ్చుటఁ గావలసిన దేమియు లేదా?

సుగ్రీ——మనము బయలుదేరుట తప్ప నేమియు లేదు. అయిన నిట్లుకావలయు నని కోరెదను.

గీ. ధరణి యీతిబాధలు లేక ♦ తనరుఁగాక
ప్రజలయన్యోన్యవైరముల్ ♦ పాయుఁగాక
కవిత రాజపోషణమునఁ ♦ గ్రాలుఁగాక
నీతిపాలనమున రాజు ♦ నెగడుఁగాక.

రాము—తథాస్తు.

[అందరు నిష్క్రమింతురు.]

ఇది పంచమాంకము.

నాటకము సమాప్తము.

# సౌదామినీ ముద్రాక్షరశాల.

తెనాలి. కృష్ణాజిల్లా.



ఇందు ఇంగ్లీషు, తెలుగు అచ్చుపనులన్నియు చక్కగా, చేయబడును. నవలలు, నాటకములు, కావ్యములు, వార్తాపత్రికలు, పుస్తకములు, ఫారములు, మొదలగునవి యన్నియు, పరిశుభ్రముగ నిర్దుష్టముగ నచ్చువేయబడును. ప్రింటింగుచార్జి మిక్కిలి తక్కువగా నుండును.

## బైండింగు.



అన్నిపుస్తకములును చక్కగా బైండు చేయబడును. అన్నివిధములైన బైండింగుపనులు తోలుబైండు, కాలికోబైండు, హాఫుబైండు మొదలగునవి యన్నియు చేయబడును. రేట్లు చవకగా నుండును.

## సిరాలు.



ఎర్రసిరా, నల్లసిరా, బంగారుసిరా, మొదలగు అన్ని సిరాలతో నచ్చువేయబడును. ప్రూఫులు చక్కగా సవరించబడును.

ఇందు విషయములు తెలియగోరువారిట్లు వ్రాయవలెను.

వే॥ శేషగిరిరావు,

మేనేజరు.